అముద్రితాంధ్రగ్రంథసర్వస్వము,

చతుర్థగ్రంథము 4.

చెలికాని లచ్చారావు,

సంపాదకుఁడు.

# విజయనందన విలాసము.

ఇది

మంగళగిరి ఆనందకవి ప్రణీతము.



మొదటికూర్పు.

శ్రీరామవిలాస ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

చిత్రాడ.

1919.

వెల రు 0—10—0.

# పీఠిక.

మంగళగిరి ఆనందకవి యను నతఁడీగ్రంథమును రచించెను. ఇతఁడు నియోగి బ్రాహ్మణుఁడు. తిమ్మయామాత్యుని పుత్రుఁడు. ఆత్రేయ గోత్రుఁడు. ఈతని కాలనిర్ణయమునుగూర్చి కీర్తిశేషులైన కం. వీరేశలింగముగారు తమ కవులచరిత్రమున నిట్లువ్రాసిరి. "బ్రౌనుదొరవారి కావ్యము 1710 సం॥ర ప్రాంతమున రచియింపఁబడినట్లు చెప్పిరికాని కవికృతిపతిపద్యములో నతఁడు కర్ణాటకపు నవాబగు మహమ్మదల్లీ చేతసత్కారమును బొందినట్లుఁ జెప్పియుండుటచేతను, యీమహమ్మదల్లీ 1749సం॥రమునఁగాని సింహాసనమునకు వచ్చియుండకపోవుటచేతను, వేదాంతరసాయనము 1750 సం॥రమునకుఁ దరువాతనే రచియింపఁబడినదని నిశ్చయింపవలయును. ఈకవి కూచిమంచి తిమ్మకవి మొదలయినవారి కాలములోనే కృష్ణామండలమున నుండినవాఁడు. 443 వ పుట 1899 ముద్రణము వేదాంతరసాయనమునుబట్టి కవుల చరిత్రమునందిట్లు వ్రాయఁబడియున్ననుఁ బ్రస్తుతగ్రంథమగు నీవిజయానందనవిలాస కృతిపతియగు శ్రీ దాట్ల వేంకటకృష్ణనృపాలుఁడు గోదావరిమండలమునందలి ధర్మవరమునందు రమారమి 71, 80 సం॥రములకిందట జీవించియున్నట్లుఁ దద్వంశీయుల వలనఁ దెలియుచున్నందువలనను, మాకుదొరకిన తాళపత్రగ్రంథము వ్రాసిన గంటముకాల జగ్గన్నగారు పైకృతిపతి పేరుగలవారికొఱకు వ్రాసియిచ్చినట్లుండుటచేతను, యీలేఖకుని కాలముగూడ 81 సం॥రములకు సరిపోవుటచేతను నీకవి 19 వ శతాబ్దము నందున్నవాఁడని తోఁచుచున్నది. కృతిభర్త యీపై దాట్ల వేంకటకృష్ణనృపాలుని ముత్తాతయయినచో 17 వశతాబ్దమునకు సరిపోవుచున్నది. అదియునుఁగాక యీతఁడు కృష్ణామండలములోనివాఁడయినచో గోదావరిమండలమున నీకృతిపతికెట్లుఁ దనగ్రంథముఁ గృతియిచ్చెనో యయ్యదిగూడఁ దెలిసికొనవలసి యున్నది. కవి యాధునికుఁడయినను గృహనామమునుబట్టి యీతఁడు కృష్ణామండలము (ఇప్పటి లెక్కలననుసరించి గుంటూరు మండలము) వాఁడనుట న్యాయమని తోఁచుచున్నది. వేదాంతరసాయన వివరములు కవిచరిత్రవలననేఁ దెలియుచున్నను శ్రీవీరేశలింగము పంతులుగారీతని క్రైస్తవుఁడనుట ప్రమాదమేమోయని సందియమొదవుచున్నది. చరిత్రము క్రైస్తవసంబంధమై

న హైవనుఁ జరిత్రవ్రాసినమాత్రాన౯ గవిక్రైస్తవమత మవలంబించినవాఁడనఁదగునా? పంతులుగారు విజయనందనవిలాసమునుఁ జూచియుండలేదు. గద్యమున "శ్రీమద్భ్రమరీకరుణాకటాక్ష,, అని యుండుటచేత నీతఁడు హైందవుఁడుగాఁ గన్పట్టుచున్నవాఁడు. మేము వేదాంతరసాయనపీఠికఁ జూడలేదు. పంతులుగారు కవులచరిత్రము నందువ్రాసిన వ్రాతలనుబట్టియైన నీతఁడుక్రైస్తవమతస్థుఁడైనట్లు నెక్కడను జెప్పకొని యుండలేదు. వేదాంతరసాయనమునందు గద్యములో "శ్రీమత్సర్వేశ్వర కరుణాకటాక్ష వీక్షాలబ్ధ సరస సాహితీ ధౌరేయ,, అనుటఁబట్టియు నీతఁడు హిందూమతస్థుఁడే గాని క్రైస్తవమత ప్రవిష్టుఁడుగాఁడని స్పష్టీకృతమగుచున్నది. ఒకవేళ వాదముకొఱకు విజయానందనవిలాస గద్యములో "శ్రీమద్భ్రమరీ కరుణాకటాక్ష,, యని స్తుతించి వేదాంతరసాయన గద్యములో "శ్రీమత్సర్వేశ్వర కరుణాకటాక్ష,, యని వివిధగతుల స్తుతించుటకుఁ గారణంబేమనియు నట్లుమారవచ్చునాయని సందియము బొడమవచ్చు. అయ్యది తానుస్తుతించువారింబట్టి యుండవచ్చు. ఉ॥ శ్రీతిరుపతి వేంకటకవులు ఎడ్వర్డ్ పట్టాభిషేక నాటకమున "పాసఁగ నిన్నేసు దైవంబు బ్రోచుగాత,, యన నిన్నునేసుక్రీస్తురక్షించుగాక యనియు నర్థమువచ్చునట్లు శ్లేషించియున్నారు. అంతమాత్రాన౯ బరమతావలంబులనఁ జెల్లునా? అట్లేగథనుబట్టి స్తుతులుమారవచ్చును. కవియప్పటి మతస్థుఁడే. గ్రంథకర్తయెచ్చటను దానుక్రైస్తవుఁడనని వ్రాసికొనియుండలేదు. వి గ్రంథమెప్పుడు వ్రాసెనో తెలిసికొనుటకు నేగ్రంథమునందును గవితన రెండవగ్రంథమును బేర్కొనియుండలేదు. ఈకవి వంశీయులెవ్వ రున్నట్లుఁ దెలియుటలేదు. ఈతనికవిత్వము మృదు మధుర పదభూయిష్టమై సాంస్కృతిక సమానగుంభితమై చక్కని శైలిచే విరాజిల్లుచున్నది. ప్రబంధరచనాకౌశలముకంటె నీతనికిభాషాప్రపంచాభిజ్ఞత యొక్కుడుగ నున్నట్టుఁ గన్పట్టుచున్నది. శయ్యలు భావగుంభితమును, భాషాకౌశలమును దెలియఁజేయుచున్నవి. ఈతని కవితాశైలి దెలియుటకై యొకపద్య మిందుఁ నుదాహరించుచున్నవాఁడ.

"ఉ. బాలిక ! కిస్ఫురచ్చికురపాళి కళాధరితాసితాంబు భృ
న్మాలిక ! చందనాదిక ఘనద్రుమశోభిత కేళికావనీ
పాళిఁ గమ్మ పూఁబొదలపజ్జఁ జరింతము రమ్మటంచు మ
త్తాళికచల్ నవాబ్జరుచిరాళికఁ దోడ్కొనిపోయి యంతటన్.

ఇంపలికథ భారతకథ. అభిమన్యుని వివాహమయినప్పటికిఁ బ్రబంధమునందలి ఋతువర్ణనలు, నారదుఁడు శశిలేఖ రూపరేఖావిలాసాది గుణంబులు వర్ణించుటయు, సు

భద్రియలుకలు, పెండ్లిముచ్చటలు బహుసరసముగా యుక్తియుక్తముగాఁ దెలుపఁబడినవి. ఈతఁ డాధునికుఁడయినప్పటికి "ఇతఁడు లాక్షణికాగ్రగణ్యుఁడయిన ప్రబంధకవి" యని కవుల చరిత్రముగూడ నభిప్రాయ మొసఁగుచున్నది. ఈగ్రంథము రాపర్తి గ్రా॥ శ్రీ సాగిరాజు సుబ్బరాజుగారి ప్రోత్సాహంబున అవసరాల తిరుమల రావుగారిచే మా "యాంధ్రపరిశోధక మహామండలి"కి నీయఁబడినది. ఈగ్రంథమందుఁ గ్రిమిజగ్ధములయినచోటుల నక్షరంబులఁ బూరించియు వ్రాతప్రతులయందలి తప్పులసవరించియు ముద్రణమున కనువగునటు లొనర్చిన శతావధానులు శ్రీ ద్వివేది నారాయణశాస్త్రులుగారికిని పై యిరువురకును మాకృతజ్ఞతావందనంబు లర్పించుచున్నారము.

చిత్రాడ.
26—11—1919.

ఇట్లు,
చెలికాని లచ్చారావు.
సంపాదకుఁడు, అముద్రితాంధ్రగ్రంథసర్వస్వము.





శుభమస్తు.



అవిఘ్నమస్తు.

# విజయనందనవిలాసము.

(ప్రథమాశ్వాసము.)



లలితాంగి యక్కున వసించినఁ దా జలధాంతరాళ శం
పాలత విభ్రమంబుఁ దెలుపన్ గొలుపొందు మురారి నందగో
పాలసుతుండు బ్రోవుత నపాంగకృపారసపూర్తి తేటలో
ద్వేలవిభూతి నెప్పుడును వేంకటకృష్ణనృపాల వర్యునిన్.

ఉ. ఎన్న మురారిచన్నవపయి స్నవళింప సుమేరుశృంగపా
లిన్నలకొన్న మేఘముఁ బలెన్ మణిపంజరభా ద్యుశానవో
త్పన్న మనోభవాగమకథల్ విను మన్న పయూరి కేళికా
నెన్నని మేలుకొల్పురమ వెంకటకృష్ణున కిచ్చు సంపదల్.

మ. అరుదౌ హారదహీంద్రమాళి మణిపర్ణాత్మ త్రుమాభృత్సుతా
సుమచి శ్రీజగదుద్భవస్థితి ముఖాస్తోక క్రియాచాతురీ
భ . ఎండై విలసిల్లు శంభుఁ డనుకంపాపూర్తితా లోకవి
. . ణాన్ వెంకటకృష్ణభూవరున కిచ్చున్ శాశ్వతైశ్వర్యముల్.

చ. కని . వు లంది పుణ్యజనవిద్విషదంఘ్రిజయై నలుంగడన్
. లయాజరింపుచున్ గుటిలవృత్తిఁ జెలంగెడుగంగ సొంపునన్

దలపయిసంఘటించి సతివస్త్రరజేసితి వంచు చేనితో
బలుమరు మేలమాడు నుమ భవ్యకృపన్గృతినాథుఁ బ్రోవుతన్.

చ. హిమగిరిశృంగమధ్యమున నెల్లపుడుం బ్రవహించు నిర్ఝరీ
సముదయమట్లనీ వలుదచన్నుల సందున హారజాలకం
బమరుచుటంచు డాయఁజని యల్లనభారతిఁ గౌఁగిలించు న
వ్విమలుఁడు పద్మజుండొసఁగు వెంకటకృష్ణునకున్ జిరాయువున్.

తనగన్మచ్చికురాననస్తనదృగంతంబుల్ నిరీక్షించికా
నినవాంభోధరచంద్రచక్రహరిణీనిర్మాణముల్ జేయలే
వని నిచ్చల్ ధవు మేలమాడు శరదభ్రాభాంగి యాపల్కుఁజ
వ్వని శ్రీవెంకటకృష్ణభూరమణు వాగ్వైచిత్రి నిల్పుం గృపన్.

శతకోటిన్ హరిఁ గెల్చి తద్విమలతేజః కీర్తిపుంజంబు న
ద్భుతలీలం గొని తెచ్చి కైవడి సుధాపూరంబు వేఁ దెచ్చి స
మ్మతి సర్పావళికిచ్చి లోకవినుతిన్ భాసిల్లు నాగారి భూ
రితరైశ్వర్యములిచ్చు వేంకటమహాకృష్ణక్షమాజానికిన్.

అలఘుశ్రీరఘురామ వామభజన వ్యాలీఢనిష్ఠాసమా
కలితస్వాంతులకున్ భవాబ్ధి కటిదఘ్నం బంచు సూచింప డా
పలికేలెత్తి ద్వితీయహస్త మరచేఁ బాటిల్లుమోతుంబటం
చులకిం దెల్పఁ జెలంగు కేసరితనూజుం డిచ్చు నిష్టార్థముల్.

హరికిన్నీశకు వంచనాసురత సౌఖ్యాంభోధి దేలింపఁ గ్రొ
వ్విరిపాన్పొచు నిజోరువిస్ఫుటఫణావిర్భూత నిర్యత్న ర
త్నరుచి న్నెందెరఁగా ఘటించు నుచితత్వ ప్రౌఢశీలుండహీ
శ్వరుఁ డస్మత్ప్రతిభర్తకీవుత మహీవాల్లభ్య మత్యాదృతిన్.

ఉ. తోడవులు బోలె నైయొలపుతోఁ గనుపట్టు వెడంద పాపరా
పడగలమానికంపు జిగి బర్వఁ దలిర్చెడు ప్రౌఢుసాటరై
యడఁచి నితాంతవిఘ్నతిమిరావళి భక్తదృగంబుజద్యుతి
న్గడువెలయించు సిద్ధగణనాథు మరుద్గణనాథుఁ గొల్చెదన్.

శ్రీరామాయణ భారతాహ్వయ కథాసృష్టిస్థిరప్రౌఢవా
వారంగ భా:వార్యులఁ దపస్సంభూత తేజోరమా

దూరీభూతసహస్ర సూర్యులఁ దలంతున్ సారె వల్మీకభూ
పారాశర్యుల సత్కవిత్వ రచనా ప్రాగల్భ్య సంప్రాప్తికిన్.

౮. సనివడి యొప్పెసఁగన్ బుడమిఁ బంచమవేదమనాఁ బ్రసిద్ధిఁ బొం
దిన యాలభారతం బతులకీ గతిమంబున నంధ్రభాష స
జ్జనహిత శబ్దలక్షణ రసస్ఫురితంబుగఁ గబ్బ మొప్పఁ జే
సిన చిరకీర్తిసాంద్రుల భజించెద మువ్వుర సత్కవీంద్రులన్

. జల్లుపాల్లుల నొకపద్యమల్లుఁగాని, తవిలి కృతిసెప్పఁగలఁడె కాకవి తృణాంకు
రములు గైకొని యొకకులాయము ఘటించుఁగాని గిజిగాఁడుమాఁడువు గట్టగలడె.

. జగతి సంస్కృతమున కెన్ని చందములు దె, నంగుళకు నన్ని గల్గు నెంచఁగ మఱియు
యతులుఁ బ్రాసను లెక్కువలట్టి తెనుఁగు, పాటిజేయని తెగులు మాన్పంగఁదరమె.

వ. అని యిష్టదేవతా నమస్కృతియు సుకవి పురస్కృతియుఁ గుకవి తిరస్కృ
తియుం గావించియున్నంత,

౧. సకలసాధ్యాత్మ కళాపరిశ్రమ సుధీజాలంబుతో బంధు సో
దర సామంతనృపాళితో సుహృదమాత్యశ్రేణితో వైణికో
త్కర వీణామృదుగాన వైఖరులతో దాట్లాన్వయాకల్పకం
బిరవొందున్ సభయందు వేంకటమహాకృష్ణప్రభుం డున్నతిన్.

వ. వెండియు నఖండకమల జాండపిచండ గుంభిత యశశ్శుభ్రాంభోరుహోషా
స్ఫూర్తికరోరు దోరుదయ కుధరాగ్రజాగ్రదప్రతిప ప్రతాపఖద్యోత నూత
ప్రద్యోతమాన ప్రభాదారిత మదారితర శేఖణాక్షీణ వక్షోరుహోసక్తవిమల ముక్తాహా
తారకాచికుర భారకాంతిధ్వాంత కాంతాలోక నోత్పలానన చంద్రమంః స్మితచం
ద్రికా విలాసభాసురుండును, కరుణామృత తరంగితాపాంగలీలాపరిపోషితాశేష భూ
సురుండును, సమగ్రతరానుగ్రహ రచితాగ్రహారపత్యగ్రహిరణ్మయమణిగణ భవ
కరవిహరమాణ మహీగీర్వాణ సమాకల్పితానల్ప నవక కార్యాలోకనావార్య ప్ర
దాఃయాత వివిధవిభుధాశీర్ధురీణుండును, ననవద్య హృద్యాధ్యాత్మ విద్యాపారీ
ణుండును, విశ్వవిశ్వంభరా ప్రజావ్రజ సంరక్షణాక్షీణ కృపాకటాక్షవీక్షణామృత
ధారాప్లుతారవిందవాసినీ క్రీడామందిరీకృత నయనారవిందసుందరుండును, నఖర్వ
గర్వాంధ సర్వపరిపంథి బృందాంభోధి మందరుండును, మందార మరందబిందుసం
దోహమాధురీ సాధురీతి ధురీణభాషావిశేష దూషితాహీశ్వరుండును, జగజ్జేగీయమా

నమానితా నశ్వరైశ్వర్య ధుర్యతా మహోశ్వరుండును, సుకవినికర ప్రకటీకృత నిజాంక గద్య పద్యాత్మక ప్రబంధాంతర కథాశ్రవణ కుతూహల తరంగితాంతరంగుండును, నభంగాంగ సౌకుమార్యాధరీభూత శుక తురంగుండును, సకలదిగంతర కల్పితాపార ముకుందేందుధర మందిరారామ మందార చందన ముఖ్యద్రుమశోభిత వన ప్రభృతి సప్త సంతానుండును, నవభ్రసుగణగణ పరిభ్రాజమానుండును, నిఖిలవిద్వజ్జనాభినుతాగణ్య పుణ్యచారిత్రుండును, రంజిత ధనంజయగోత్ర పవిత్రుండును, శ్రీమద్దాట్ల వంశపయఃపారావార పూర్ణిమాచంద్రుండును, నగు శ్రీ వేంకటకృష్ణభూతలేంద్రుండు సిరులం బెంపొందుచు నొక్కనాఁడు

మ. నమభక్తావన కృత్యదక్షనిరుపమాన శ్రీనగాధీశశో
   భన కారుణ్యకటాక్షలబ్ధ కవితా ప్రావీణ్య సంశోభితా
   నను నానందః విన్ సుధీజన మహానందాను సంధానవ
   ర్తను రావించి సమంచితామృత రసప్రౌఢోక్తిఁ బల్కెన్నృపన్.

చ. సురుచిరనాయకోత్తమవిశుద్ధయశో మహిమాభివర్ణనా
   స్ఫురణ జగత్ప్రసిద్ధి బొలుపుంగను సత్కవి భవ్యకావ్యమి
   ద్ధర నవయౌవనాంగి బలితంపు చొకాటపు గుబ్బదోయి తో
   నడుదుగఁ గ్రెడ సల్పునవహారలతావిభవంబు చాడ్పునన్.

మ. హరసద్గేహ పనీ తటాక ముఖ సద్యశ్సంతతుల్ గొన్ని వా
   సరముల్ నిల్చిన చోట బొల్పమరు విశ్వఖ్యాతిఁ గావ్యంబుచేఁ
   బరగు న్వానికి విస్ఫుటప్రసవ శుంభద్వాసనా సంపదల్
   మరుదంభోరవముచే దిగంతరములన్ భాసిల్లుచందంబునన్.

చ. అనుపమబుద్ధిశాలురు మహాత్ము లశేషకళావిదుల్ బురా
   తనకవు లగ్రమాను లజాతన్నికి సాధునికుల్ కనిష్ఠులా
   టు నెనడు పెద్ద వారలయొడన్ మది నాయమకట్టి వారిలో
   నినుఁగడుఁ గారవించు రమణీయకటాక్ష నిరీక్షణంబులన్.

క. కావున మృదుమధురోక్తి, శ్రీవిఖ్యాతము భవద్రచితమగు శశిరే
   ఖా వామా పరిణయకథ, నీవంకితముగ నొనర్పు నేర్పున మాకున్

వ. అని సబహుమానంబుగాఁ దాంబూల జాంబూనదాంబరా భరణాగ్రహారాది సత్కారంబులొసంగిన నంతరంగంబునఁ దరంగితహర్షోత్కర్షుండనై కృతిపతివంశావ

తారం బభివర్ణించెద.

సీ. మలరాచదొంగన్న యలరుబోడులమిన్న, మగనికిమవ్వంపు మావిసుమము
కడుపుచల్లనగాఁగఁ గలిమిచెచ్చెలితోడఁ జెలిదీవిఁగన్న గాదిలిసుతుండు
ననతూఁపుసెగలసాండ్రి మగలనేచు బల్మిఁజెలంగు విటకానిమేనమామ
దోరంపుబాసవాల్ దొనలగూకలిదిర నెసఁగుకళామృతల ఓడినవలఁతి
గీ. రిక్కచాలులరొకమిహు మొ్రక్కవేల్పు, జోడుతలపూఁపు త్రిభువనస్తూయమాన
సరససౌభాగ్యలక్ష్మి ప్రసన్నమూర్తి, యలఘుసన్మార్గవర్తి సుధాంశుఁడలరు.

చ. అతనికిఁగల్గెసౌమ్యుఁడు దయాబ్ధిపురూరవసుందుపుట్టెఁద
త్సుతుఁడన నాయువాతనికిఁదోచె నతండుఁగనెన్ సుధీజన
స్తుతసుగుణాభిరాము నహుషుండనువాని యయాతిగాంచె నా
క్షితివరసార్వభౌముఁడుసుకీర్తి జగంబులఁ దేజరిల్లఁగన్.

వ. తత్సంతానక్రమంబున.

క. పాకిసీమస్పష్టధరణీ, వరపుంగవుఁడొదవె నయ్యవారణకరుణా
వరుణాలయునకుఁ దేజో, నిరతిశయుఁడు కోటకేత నృపతిజనించెన్.

సీ. తననిరంతరదాన ధారాంబుధరవృష్టి సకలార్థినికర సస్యములు పెనుపఁ
దనభుజార్గళమహోదాత్త శౌర్యజ్యోతి సమదారిగర్వ సంతమసమణఁపఁ
దనసాంద్రవిభవ చంద్రజ్యోత్స్న సుహృదుత్పలసరోవరాళి నుల్లసిలఁజేయఁ
దనమహీరాజ్యపాలనశక్తి ధాత్రిఁబు వితతదుర్ణయలతా వితతిదుంపఁ
గీ. బరగె నతిభీమసంగ్రామ పాణిభృత మహోగ్రకరవాల కుట్టనీయోజితారి
విజయలక్ష్మీసమాశ్లిష్ట భుజయుగళ విభాసితుఁడు కోటకేతన ప్రభువరుండు.

మ. సిరిచేతన్ ధరణాలకోటపురిలోఁ జెల్వొంది యీశార్చనా
చిరభక్తిన్ దగి ధాన్యవృష్టి గురిపించెన్ గాంచనామూల్యర
త్నరుచిస్ఫార విభూషణాదికపదార్థశ్రేణి సర్వేసురో
త్కరముం బెంచెను కోటకేతన ధరాధ్యక్షుండు సామాన్యుఁడై.

మ. నిరతశ్రీకరులమ్మహాన్వయమునం బెక్కండ్రు రాజుల్ జనిం
చిరి శ్రీరామసముల్ మహాత్ములు బుధక్షేమంకరుల్ తత్కులం
బిరవొంద న్మహానందుఁడొప్పెఁ గరుణాహృద్యాంతరంగుండు సం
గర గాండీవి సుకీర్తిశాలి ఘనవక్షస్థలపాలు డుద్యద్యుతిచిన్

సీ. అనవద్య సుమనోమనోభీష్టదాయియై సురకార్యమెంతయుఁ దీరయఁడేని
కమనీయసత్పథక్రమణనైపుణిఁ గల్గి తమిజన్మపద్మినిఁ దవులఁడేని
మానితమస్ఫురద్ధర్మధురీణతఁ జెలఁగి యశరీరతాఖ్యాతినందఁడేని
యభిరమ్యసర్వజ్ఞతారూఢి రహికెక్కి విషమవీక్షణవృత్తి వెలయఁడేని
గీ. దానశోభాభిరూప్యవిద్యావిశారదతల కించుక సరిబోల్పఁ దగుదురిందు
కమలబాంధవకందర్పశమనరిపులు, కసవభూపాలమణికి వాక్పతిధిషణికి.

క. లోకమున దాట్లనగర, శ్రీకలితుండగుచు వినుతిఁ జెందినది మొదల్
నాకపసమవిభవుఁడు లల, నాకంతుఁడు దాట్ల కసవనప్రభుఁ డయ్యెన్.

మ. కసవక్ష్మాపతి గాంచె నందనుల లోకఖ్యాతి తేజోరమా
హాసితాజ్ఞాప్తుఁ బెదప్ప భూపతి జినప్పాభిఖ్య రాజేంద్రు ధా
త్రీపతీశున్ బెరుమాళ్ళ సజ్జననుతున్ గృష్ణక్షమాజాని సా
రసగర్భాస్యములట్టు లన్న లీపురన్ రాజుల్ ప్రశంసింపఁగాన్.

క. కసవన మూఁడవతనయుఁడు, బిసరుహగర్భుండు బుద్ధి బెరుమాళ్ళవిభుం
డసమశరరూపసంపల్లసితుండన వెలసె రచ్చలం బుధులెన్నన్.

మ. రసికుం డప్పెరుమాళ్ళభూపతిసుతుల్ ప్రాంచత్ప్రభాధూతప
ద్మసఖుల్ మువ్వుర వేంకటక్షితితలాధ్యక్షుండు నల్లాడరా
జసురేంద్రుం డభిరామరామచరణాబ్జధ్యాననిర్మగ్నమా
నసుఁడౌ తిమ్మవిభుండు దోఁచిరి జనానందానుసంధానులై.

మ. విపులామర్త్యకులేంద్రభోగమహిమావిర్భూతి కవ్వేంకటా
ఖ్యపతిగ్రామణి కెప్పుడప్పయన ప్రోలల్లాడభూజానిక
న్నవరగ్రామము తిమ్మరాజమనుజేంద్రస్వామి కెన్నంగ నె
ల్లపుడుం బందలపాక తావులయి మేలందెన్ శుభశ్రీంతోన్.

శా. అల్లాడక్షితిపాలుఁ డెన్నఁదగె సుగ్రారాతి సౌభాగ్యవి
ద్యుల్లావణ్యకళాశరత్సమయ దోర్ధూశౌర్యధుర్యుండు సం
పల్లావణ్యవతీ మనోరమణ శుంభత్పాదపద్మార్చనో
త్ఫుల్లస్వాంతుఁ డనంగ నమ్మగిలఁ బ్రోద్యద్యశస్సంపదన్.

ఉ. పాడికి వైని యుద్ధపరిపాటి కిరీటికి దంట తుంట వి
లాఁడభిరూపసంపదఁ గళానిధికిన్ దగ భక్తిహేళికిం

జోడు వితీర్ణిదేవ మణి సూక్తి సహస్ర ఫణాధరేంద్రుఁ డ
ల్లాడనృపాలుఁ డాయనకిలన్ దులఁగాఁగలరే నృపాన్వయుల్.

సీ. తుల్యఁ జెప్పవచ్చునే యలరాజు నలరాజు నీవితో నెమ్మేని ఠీవితోడ
బ్రతిసేయవచ్చునే పవిహేతి రవిసూతి సిరులతో ధర్మవైభవులతోడ
గడిసేయవచ్చునే కరివైరినరహరి శక్తితో బరమాను రక్తితోడ
సరిపల్కవచ్చునే సురవాజిగరభోజి గీర్తితో సత్కళాపూర్తితోడ

గీ. సుకవిసుదాయ వాగభిన్నాయమాన, సుగుణరత్నాకరునకు నస్తోకభావి
జితవిభాకరునకు హితశ్రీకరునకుఁ, దెలుఁగు నల్లాడ జనపాలశేఖరునకు.

మ. ప్రతిభాఢ్యున్ బెరుమాళ్ళభూమిగమణున్ బ్రత్యర్థివిధ్వంసనో
ద్ధతుఁ బేరావనిభర్తఁ బద్మభవమేధాశాలి శ్రీతిర్మల
క్షితినాథాగ్రణిఁ గాంచె నందనుల సుశ్రీయుక్తులన్ వైభవో
న్నతి నల్లాడమహీశుఁ డీముగుర నానాసద్గుణోపేతులన్.

క. శ్రీకరుఁడందలితార్తీ, యీకుడు చిరసుకృతి మేదినీశ్వరకుల చూ
డాకల్పకంబు సకల కళాకౌశలుఁ డనఁగఁ దిర్మల విభుండలరున్.

సీ. కమనీయగగన గంగాకైతవంబున నంగజాహితు నుత్తమాంగమెక్కి
ధవళవినూత్న ముక్తాహారమిషమున భారతీకుచపాళిఁ బరిఢవిల్లె
రమణీయచంద్ర సాంద్రజ్యోత్స్న కాదంబమునపద్మజాండంబు మొనయఁజాత్రికి
ఘనసుధాబ్ధిచ్ఛలంబున ధారుణీకిహీరపరిభాసి మేఖలాభరణమయ్యె

గీ. ననుచుఁ దనకీర్తిబుధులు రాజాధిరాజ రాజదాస్థానమంటప ప్రాంగణముల
బహువిధంబులఁ గొనియాడఁ బరఁగె ధాత్రి దాట్ల తిరుమలరాజ గోత్రావిభుండు.

మ. అనఘు శ్రీనిధి వేంకటాఖ్యవిభు సత్యాలాపసంశోభితే
వనరాజున్ ఘనపెద్దిరాట్ప్రభుని భాస్వత్కీర్తియుతా పేరరా
జన్నృపోత్తంసు సమస్తసద్గుణగణాంచ ద్రాజగోపాల రా
జాను శ్రీతిర్మలరాజుఁ గాంచె సుతులన్ సొంపొంద నీ యేవురన్.

క. వారిలలో మూడవవాఁడై రాజిలె పెద్దిరాజు ప్రాంచత్తారా
హీరాబ్జతుసారశర, ద్ధారాధర విమలకీర్తి ధౌరేయుండై.

క. ఆపెద్దిరాజు విశ్వధ, రాపాలన చతురతాప్తి రంజిలె సమదా
టోపాహిత భూపాలక, లాపాధిక తాపకర కళాకౌశలుఁడై.

సీ. వెలసె నేఘనమూర్తి విమలాబ్జసుగుణుని డిండీరపాండురాఖండకీర్తి
కొమరొప్పె నే సునీతిమహీధ్రపటలి నిదళన పాటవభూరితరవిభూతి
పసమించె నే మేటి వసుధావహన భోగివర్ణితగంభీర వచనధాటి
యొసగె నే శుభవిభావసుదీప్తి యమృతపాథోరాశి గాఢనిస్తులకృపాప్తి
గీ. యతఁ డహితలోక దుస్తంత్రిత మదేభ, జాతశాతసృణీభూత నీతిజాగ్ర
దాగ్రహవ్యగ్ర లోచనుఁడనఁగ నెగడె, జగతిశ్రీపెద్దిరాజ రాజన్యమౌళి.
క. భూతదయాదిక సుగుణ,వ్రాత సనాథునకుఁ బెద్దిరాజాఖ్య ధరి
త్రీతలనాథున కిల్లాలై తగు వెంకాంబ శూలి కద్రిజ భంగిన్.
చ. అతనికి వెంకమా వనరుహానన కాననవింటిదంటకున్
బ్రతియగు సోయగంబుల కుమారులు పుట్టిరి పోషితాఖిలా
ర్యతతులు జగ్గరాజు శివరామయ వేంకటరామరాజ భూ
పతు లనఁ బొల్చు మువ్వు రనపాయబలాఢ్యులు లోకమెన్నఁగాన్.
ఉ. వారల కగ్రజుండయి ప్రవర్తిలె జగ్గవిభుండు దత్ప్రతా
పారుణదీప్తి రేఁబగలయారె హరిన్మణిమండలంబు నిం
డారఁగ సాధుచక్రముల నాహత సమ్మద వార్ధిఁ దేలె దు
ర్వార విరోధిసంతమస వారము దూరెఁ గుభృద్గుహావళుల్.
గీ. ఆతఁడు జగ్గనృపతి కర్ధాంగలక్ష్మి, నరసమాసతి లసమాన నరసమాజ
మాననీయాంగ రూపసంపదల బొదలి, పతివిహిత కార్యధుర్యయై పరఁగ జగతి.
చ. అతనికిఁ జిన్నతమ్ముఁడు జయంతునితమ్ముఁ డుదగ్రవిగ్రహో
ద్ధృతభుజశక్తిశక్తి హిమభూధరజాధిప కంఠ భూషకా
యితఫణిహారిహారి సమిదిద్ధవిరోధి మనోభయంకరా
యతమతిపూర్తి గీర్తిహరిణాంకుఁడు వేంకటరామరాజిలన్.
క. అనుపమగుణమతి, సతియగు నక్కమయక్కముల జన్మ్రనం గనకౌనయా
నెక్కుడు మృదుభాషలనై, చక్కదనంబునను రతియ సన్నుతిసేయన్.
క. వారిరువురకన్న ఘనుఁడై రామాదృఙ్మనోహరాకారకళా
ధారిత భావజుఁడై యా, శౌరిన్ శివరామభూతలాధిపుఁ డెసఁగెన్.
ఉ. ఆశతమన్యుఁ డయ్యమరులట్ల నొనర్చెఁ బ్రజానుపాలనం
బా శివరామభూవిభుఁ డుదగ్రకరాగ్రనిశాతహేతిధా

రాశనిపాత దారితమదారి మహీధరవర్గుఁడై పయో
రాశిపరీత సర్వమహిరాజ్య రమాపరమానుషంగతిన్.

మ. అతనుద్వేషిజయాప్తి భూతఃయనిత్యానూనసంసక్తి నూ
ర్జితసన్మార్గవిహారనైపుణి ధరిత్రీమండలాధీశసం
తతులెన్నన్ శివరామరాజు తులితోద్యత్ప్రౌఢి రంజిల్లె నం
చితకీర్తిన్ శివరామరాజనృపతిశ్రేష్ఠుండు భూమండలిన్.

సీ. పర్వరాజ మహోసుపర్వరాజ సమాన సమధిక త్యాగ భోగములవాఁడు
కర్బురాళివిపక్ష కర్బురాగ సద్వృత్త కారుణ్య ధైర్యసంగతులవాఁడు
శారదాపదజాల శారదాపవిశాల చిరకీర్తిబుద్ధివైఖరులవాఁడు
చక్రిసాధనపుత్రి చక్రిమండలమిత్రి సమ తనూరూప తేజములవాఁడు
దలఁప సామాన్యుఁడే సమస్తక్షితీశ, మండలాస్థాన విద్వదాఖండలాభి
సన్నుతాత్మకథా సుధాసారభరిత, మహితదిక్పాళి శివరామమహితమౌళి.

మ. హరిసఖ్యాతిబలున్ నివాతకవచోద్యద్వైరిసంహారి భా
స్వరధర్మోక్తశుభక్రియా కరుణదీక్షాశాలి సద్విగ్రహ
స్ఫురణామోదిత రాజశేఖరు జనుల్ భూషింతురమ్మానినీ
స్మరమూర్తిన్ విజయాంకుఁడంచు శివరామక్షోణిపాలున్ భువిన్.

గీ. అంబకహుతాశనశిఖాళినతను మన్న్య, దశముఖవిరోధుల నడంచి విశదకీర్తి
ప్రబలి శివరామవిభులతో బ్రతికివచ్చు, జగతి శ్రీదాట్లశివరామ జనవిభుండు.

మ. అలఘుశ్రీశివరామరాజసతియై యార్యేందిరాశారదోత్పల
పత్రేక్షణ లెట్టు లట్టుల నిజప్రాణేశ్వరుం బాయ కు
జ్వలహర్షాప్తి సుభద్రితచ్ఛరణ సేవాసుప్రతారూఢి వ
ర్తిలె యాఱారా యన వన్నెఁ దెచ్చెఁ దనపాతివ్రత్య సంపత్తికిన్.

చ. అలశివరాముఁడాజి విజయాంకుఁడు దాఁబడసెన్ సుశీలయై
పొలుచు సుభద్రియం దలసుపుత్త్రుల వెంకటకృష్ణభూమిభృ
ద్విలసితదానదేవమణి వెంకటరాజులు నాసుకీర్తి ధ
న్యుల భువనైకమాన్యుల నహోసమిదిద్ధ యశోభిమన్యులన్.

ఉ. అందఱియగ్రజుండు సుగుణాఢ్యుఁడు వెంకటకృష్ణభూవరుం
డిందు ధరాబ్జకేశవుల నీనుగఁ జూడఁ దొకించుకేని ని

ష్పండకశాయశశిక్రుపల బ్రహ్మవిరోధ మురోంతరంబునం
గందుకు గుందుఁ బుణ్యాజనఘస్మరవృత్తియు నారికొప్పటన్.

మ. ఘనదోర్థూయదితపరితాపహృత భగ్నావలావళిన్ వాష్ప లిం
కనిజోత్సర్జనవార్థనీభరితముల్ గావించి కౌతూహలం
బెనయంజేసి ఘనాళి వేంకటమహా కృష్ణక్షమాజాని యా
ర్యనుతుల్ గైకొని మించె దాతలనరా! దాతయై భూస్థలిన్.

ఉ. కొంద అమందరాగరసగుంభితమానసుఁడందు రెవ్వకున్
గొంద ఱమందరాగధృతిగుంభితమానసుఁ డందు రుర్వరన్
గొంద ఱుపారిజాతమగుఁ గోపికమండలికందు రీ సారెఁబే
రొందఁదురపారిజాతుఁడని గొందఱు వెంకటకృష్ణభూవిభున్.

సీ. ఘనవాహ వేదండ కాండజాసనకాండ పాంశురాంబుజకాండ భవ్యకీర్తిజా
ప్యరాజతరువార సారసాప్తకుమార ధారాధరోదార దానశాలి
ఉడురాజ రాజరాజతనూజ నలరాజ బలవైరిజమనోజ లలితమూర్తి
బిసభుక్తరంగాంగిరస చక్రిపుంగవ గంగోత్తమాంగ రంగన్మనీష
దాయతాహవరిపు మనోజాయమాన చటులతరశౌర్య కదళీగజాయమాన
దోస్థిరవగాహవిక్రమదుర్దముండు పృథివిఁ బెంపొందు వేంకటకృష్ణవిభుఁడు.

చ. విరతివహించివన్నెలిను వెంకటకృష్ణ నృపాలమౌళి వి
స్ఫురితయశంబు పంకరుహసూతి పదంతికి దేవదంతికిన్
గరకరితారకానికరకాంతికి మేల్మగరాలదొంతికిన్
బరువఁపుబొడ్డుమల్లియలబంతికి నాగగనస్రవంతికిన్.

సీ. అడఁచిరిపూగ్రసేనాత్మభూశక్తి బలాన్వితుండై విజయానురక్తి
నలరారుమహితనయవ్యక్తి దానపటిమ విబుధావనక్షమతఁ దనరి
భజనీయ మధురథధర్మజనకత్వ నిరూఢి సత్యభామామనోజ్ఞతఁ జెలంగి
యరిదరస్ఫూర్తి గోభరణదీక్షాప్రౌఢి గోత్రోద్ధరణలీలఁ గొమరుమిగిలి
యనుపమద్వారవతిని మున్నవతరించి కీర్తిశోభాదయాగుణస్ఫూర్తి మించి
పుడమిదాల్గాస్వయంబున బొడమినాటి కృష్ణుఁడనఁబొల్చె వేంకటకృష్ణవిభుఁడు.

మ. అలరెన్ వెంకటకృష్ణభూధవుఁడు కిల్లాలై మరుల్లోకపా
లలతాతన్విబలెన్ సిరిన్ బ్రిబలి కల్యాణకుమాభృద్ధను

ర్గలనారీతి నశేషమంగళగుణాలంకారయై ధారుణీ
స్థలి రామాంబ పతివ్రతామణులలోఁ దా మేటియై యెన్నఁగాన్.

ఉ. ఆరసికాగ్రగణ్యుఁ గొనియాడఁగ శక్యమె చాట్లవెంకట
క్ష్మారమణున్ సుధీహృదయ సంభ్రమరీతిఁ దదీయ భూతిత
ద్భూరిసునీతి బంధునృపతోషణనూతి తదుగ్రహేతి దు
ర్వారవిరోధికానన దవజ్వలనోజ్వలహేతి బాపురే.

మ. అసమాస్త్రుం డశరీరుఁడంబుద మహోర్వ్యావాసి యంభోధిభం
గ సముత్పన్న మహిమప్రభుండు విషభూతాఖ్యానుం డాసమీ
రసఖుం డాశ్రయభోజి వేంకటమహారాజేంద్ర నీ డెవ్వ రి
వ్వసుధం రూప వితీర్ణి నిష్ఠతల భాస్వద్వాగ్రచిస్ఫూర్తులన్.

సీ. రణభేరికా నిర్భర రవశ్రవణమాత్ర గిరిగుహల్ కేళిమందిరములయ్యె
శయఖడ్గధళధళ చ్ఛవినిరీక్షణమాత్ర మరుదశిపదము లుప్పరిగలయ్యె
ధ్వజనీపదోద్ధూత రజనుగన్గొనుమాత్ర యవనాంకురవ్రాత మశనమయ్యె
గడిమిఁ బోయక నిల్చి తొడరుమాత్రన యచ్చరలపొందు కరతలామలకమయ్యె
బరభయంకరదోర్గర్వపటిమఁ దనరు ప్రబలగడిమన్నె భూపతి ప్రకరమునక
టందుశూరులు గొనియాడ నలరెజగతి, చాట్లవెంకటరాట్కుమారానువిభుఁడు.

సీ. ప్రోత్తుంగగిరిశృంగముల చెలువ్ వెలయేటివనరుహశ్రేణి లావణ్యలక్ష్మి
చంచలహరిణదృక్చాకచక్య ముదారసమదేభ హస్తచంక్రమణలీల
రమణీయమృదుతర ప్రతతివిలాసంబు కాంచనకలికా ప్రకాశమహిమ
లసమానకిసలయ విసరసౌభాగ్యంబు సురుచిర మేరు ప్రసూనమహిమ
లనుదినము భీషణాటవి నాత్మయోషి, దవయవభ్రాంతి సూచింప నతనుతాప
కలనఁ దాల్తురు చాట్లవెంకటనృపాల, మణికి నని నోడినవిపక్షమనుజపతులు.

రాజశ్రీనిధి చాట్ల వెంకటమహారాజేంద్ర బాహాసిచే
నాజింబట్టపరాళి రంభకుచకుంభాశ్లిష్టసౌఖ్యోన్నత
శ్రీఁ జెల్వొందఁగఁ జేసి ప్రాక్తనవిటశ్రేణిన్ బయల్ పుచ్చ వే
శ్యాజాతంబుల కూర్మి లౌక మృగతృష్ణల్ గా వె యూహింపఁగాన్.

సీ. అరయుఁడల్లవియ భీకరభటావలిచేతిపందెపు తుటుములక్రిందురవులు
వివరింపుఁ డవి యాశ్వికనికాయ కరాగ్ర కరవాల చకచకస్ఫురితరోచు

లాలింపుఁ డవియు సేనాధినాయకకార్ముక జ్యాలతాభీల ఘనరవములు
పరికింపుఁడవియ చెచ్చెర మహోదగ్రదుర్భర భూరిభేరీభాంకణ నినదము
లనుచు నన్యోన్యకాందిశీకానులాప, కలనగడిమన్నె దొరలు దవ్వులన తొలఁగి
కడిమిఁ బరతురు దాట్లవెంకటనృపాల, సంగరాటోపవన్మహా సైన్యమునకు.

సీ. నీహార వాఙ్మాలినీ హార సురధునీ హారభూధరరోచు లపనయించి
తారకాహీన శతార కాశ పటీర తారకాధిపరుచుల్ దవుల కనిచి
సారసాహితసుధాసార సాగర పాండుసారసాంశు శ్రీలఁ జౌకళించి
గోరాజభవ మరుద్గోరాజ భవసుధా గోరాజగజఘృణుల్ కుందఁజేసి
యలరు మేదినియందాక యరుణధామ, సోములందాక యశదృశమ్మూర్తిమించి
సకలలోకైకవిహరణ చతురతాప్తి, దాట్లవెంకటరాట్కుమందానుకీర్తి.

గీ. దాట్లవెంకటరాట్కుమందానువిభుని తరుణిబుచ్చమకుఁ బతివ్రతాత్వగరిమ
నలయరుంధతి సాటియై యలరు నేమొ తనవిహీనకళావాప్తి తలఁగె నేవి.

మ. ఘనుఁడవ్వేంకటరాజరాజమణి వేడ్కన్ గాంచె శ్రీబుచ్చమా
వనజాతేక్షణయందు నందనుల భాస్వత్కీర్తి నిర్ధూతచం
దనులన్ వెంకటపత్యధీశవర సీతారామభూకాంతులన్
సనయస్వాంతుల సాధురక్షణకళాసంక్రాంతులం దాంతులన్.

క. అతనిసుతాగ్రణి వెంకట, పతివిబుధావననిరూఢి భరితసుధర్మా
తతరతి బరభూభృన్మద, హృతిరాజపురందరుఁడన నెసఁగె ధరిత్రిన్.

సీ. ఊరుతరాళికలోచనోజ్వలజ్వలనార్చి మేనుసోఁకనినాటి నూనశరుఁడు
ఘటజని స్ఫుటపాణిపుట సంభృతాపోశనక్రీడ కందనినాఁటిశరధి
యంధకగంధనిర్గంధనముష్టిబల్మికి లోఁబడనినాటి మేరుశిఖరి
వీరభద్ర పదప్రహార నిర్దళిత దంతసముత్కరుఁడుగాని నాటిసవిత
రూప గాంభీర్య ధీరతా రుచివిశేష, ములననుచుఁ దన్నుఁగొనియాడఁబడమినలరు
భూరివిశ్రాణనాంబు సంప్రష్టశిష్ట తతి,మహీజుండు వెంకటపతివిభుండు.

మ. అవియే సాటి సుకీర్తివిస్ఫురణతో నత్యంతధైర్యంబుతో
నవియే సాటి యజాండకర్పరసమగ్రౌదార్య తేజంబుతో
నవియే సాటియటండ్రు దాట్లకులదుగ్ధాంభోధిచంద్రుండుధ
ర్మ్మవిచారుండనఁబొల్చు వెంకటపతిక్ష్మావల్లభస్వామికిన్.

సీ. సురరాజగురు యుగంధరుల మెచ్చఁడొకింత ఘనతరనిజరాజకార్యసరణి
బలవైరిసుతకుమారుల వేడ్కఁ గాఁగొన డేపోరుఁ బటుభుజాటోపకలన
బల్లిదధీమల నొక్కపరిఁ బ్రశంసింపఁడు బహుళవిశ్రాణనపాటవమున
నలరాజరాజనందనుల మాటవినండు భామామనోజ్ఞసౌభాగ్యగరిమ
నాదికూర్మభుజంగకులాధిపతుల సరకుసేయఁడు భూభారభరణశక్తి
ననినుతింపంగ బుధజనం బలరు జగతి దాట్లవెంకటపతిమహీధర వరుండు.

గీ. అవనిగణపతిరాజవంశాబ్ధిచంద్రుఁ డనఁగ విలసిల్లు రామభద్రావనీశు
తనయ వెంకాంబఁ గూర్మి నుద్వాహమయ్యె దాట్లవెంకటపతి ధరాతలవిభుండు.

మ. సుజనస్తవ్యుఁడు దాట్లవెంకటపతి క్షోణీతలాధీశ్వరా
నుజుఁడు గ్రాహవరంగరంగదరిసందోహచ్ఛిదాదక్షుఁడా
ర్తజనాభీష్టఫలప్రదాతయయి సీతారామధాత్రీశ్వరుం
డజశక్రోపమబుద్ధి సంపదురువిఖ్యాతిం దగెన్ భూస్థలిన్.

గీ. భూనుతసుకీర్తిఁ జనకుఁడై బొల్చు పూసపాటి శ్రీతిమ్మరాట్సుతఁ బరమసాధ్వి
సీతమ వరించె రాముఁడా సీతకరణి, రమ్యయశుఁడు సీతారామరాజవరుఁడు.

చ. పటుతరనీతిశాలి యన భాసిలు తమ్ముఁడు తన్నుఁ గొల్వ వెం
కటపతి భూతలాధిపుఁడు గాంచెఁ దనూజులఁ గామయామినీ
విటతనుసౌకుమార్యనిధి వెంకటరాజనృపాలు శత్రురా
డ్విటపి కుఠారమూర్తిఁ జినవెంకటకృష్ణమహీశు నిర్వరన్.

క. వెంకటరాజు హరిత్కూ, లంకష పాండురయశో విలసితుఁడు గరుణా
సంకలితహృదయుఁ డాజి ని, రంకుశ బలశాలి యలరె నం దగ్రజుఁడై.

చ. అనుపమ దాట్లసత్కుల సుధాంబుధిఁ దోఁచిన కల్పభూరుహం
బనఁదగుఁ గానిచో మృదునఖాంకురనూనము లంఘ్రిమూలముల్
ఘనభుజశాఖలున్ గరతలచ్ఛదముల్ నునుబల్కు దేనియల్
కనదురుకీర్తిసౌరభము గల్గునె వెంకట రాజమౌళికిన్.

సీ. కులగోత్రవారణ కౌశల శాలి గాఁడేనిఁ గువలయద్వేషంబు దగులఁడేని
బహుభంగదశలఁ బ్రాల్పడి ప్రవర్తిలఁడేని బుధగురుద్వేషియై పొదలఁడేని
కుటిలానుగతి కుదుర్కొని క్రిందుపడఁడేని మధుపగుణోద్వృత్తి మలయఁడేని
శివధర్మభేదనోత్సేకంబుఁ గొనఁడేని బహ్మఘ్నతావాప్తి బరఁగఁడేని

మఖవదినవార్ధి శశిశేష మదనరామ గిరుశు లుదభోగదురిఫ్వృతి కీర్తివదన
సుభగతా సత్య సత్క్రియాస్ఫూర్తిఁ దనరు సరియనఁగమించె వెంకటక్ష్మావిభుండు.

ఉ. చెంగటికామధేను వరచేతివిత్రిర్ణిమణీఁ గంస ము
త్సంగతలార్ఘ్యపేటి సరసంగల బంగరుగట్టు మందిర
ప్రాంగణ కల్పభూమిరుహ మాఁకటికబ్బిన సస్యరాశి ముం
గొంగుపసిండి దీనజనకోటికి వెంకటరాడ్విభుండిలన్.

గీ. దాట్లవెంకట రాట్కుమారుండానువిభుఁడు, కాకరలపూడి సత్కులాకల్పమైన
నరసరాజక్షితీశు నందన వరించె, నలవిరించి సరస్వతిలలనకరణి.

సీ. శ్రీరామపాద రాజీవ చింతనసుధారసపాన ముదితమానసుఁడనంగ
రహిమించె వెంకటరాజకుమందాను కమనీయసీతాంబ గర్భసీమ
మతిశాలి వెంకటపతిని సీతారామరాజన్యమణి నరసరాజఘనుని
నారాయణాభిధాన నృపాలతిలకంబు నప్పలరాజాఖ్య నలరుమేటి
దనయులను గాంచె నిర్మ్యోవురనుసుధాబ్ధి, కల్పతరుపంచకముబోలెఁ గమలబాణ
సుందరుల ధైర్యవిహాసితమందరులన, మందకీర్తి గుంభితహరిత్కందరులను.

వ. అంత.

గీ. అధిక ధనధాన్య పుత్రపౌత్రాభివృద్ధిఁ, దనరువెంకటరాట్కుమందాను వసుమ
తీశునన్నగు వెంకటకృష్ణమహిపుఁ, డొప్పె శివరామరాజ భాగ్యోదయమున.

శా. శ్రీరామాంబికయందు నామహిధవశ్రేణీవతంసంబు శో
భార్యమ్యాంగులఁ బుత్రిల న్బడసె నప్పలాద్రిజ భూవల్లభున్
ధీరస్వాంతుని రామచంద్రవసుధాధీశోత్తమున్ సంగర
క్ష్మారంగ ద్విజయాంకు వెంకటపతిక్ష్మానాథ చూడామణిన్.

వ. అందగ్రజుండు.

క. అప్పలభూపతి పూర్వక, కుప్పలసితవిభవశాలి గుణునిమ్నతచే
నప్పలరామముఁబలుమఁగు, జెప్పలతాంతాయుధుండు చెలువచుకలిమిన్.

ఉ. సాగరగభీరతా వినయ సాహస విక్రమ దాన కీర్తి తే
జోరుచిరత్వసంపదల సొంపున నిప్పటిరాకుమారకుల్
గారిల సాటియవ్విబుధకల్పకవాటికిఁ దార్క్షపీటికిన్
సూరివిరోధిశైల శతకోటికి నప్పలరాట్కిరీటికిన్.

సీ. తనమహేశత్వ మెంతయుఁ బొగడ్తకు దాటి విలసదార్యామోదవృత్తి సలుపఁ
దనయినస్ఫూర్తి సంతతమెన్నికకు మించి సన్మార్గగమనకౌశలముఁ దాల్పఁ
దనరాజవిఖ్యాతి వినుతి కశక్యమై పరచక్రభేదన పటిమఁ బూనఁ
దనధరాధిపతిత్వ మనిశస్తుతికి హెచ్చి ఘనరత్నకటకాది గరిమలొరయ
నతఁడు చెలువొందు సుకవిబృందాభినంద్య, నిజకథామందమకరంద నిర్ఝరప్ర
పూరితాఖండ కాండపంకేరుహుండు, రమ్యగుణహారి యప్పలరాజశౌరి.

ఉ. ఒక్కవిపక్షఖండమున నుక్కరినట్టి నగారి హేతి దే
యొక్కడయా రె సంగరమహీస్థలిఁ బెక్కువిపక్షమండలిన్
వ్రక్కలుసేయ నించుకయు వాడిదొలంగదు దాల్పవంశ స
మ్యక్కలశాబ్ధి శీతకరుఁడై తగు నప్పలరాజు హేతికిన్.

సీ. నెరిమించరిపురగుండియలకు గాలంబు మత్తారిసమితికి నెత్తిపిడుగు
వికటాభియాతిజాతికిఁ గాలసర్పంబు గనుసరిపగర మూకలకు మిత్తి
భీకరవైరిచమూకంఠపాశంబు దండిశాత్రవులకు దండుమారి
కఠినవిరోధిసంఘమునకు గరళంబు సమదాహితాళికి శమనదండ
మహహ గాంభీర్యశాలి దివ్యత్ప్రభాని, రాకరితహేళి యప్పలరాజమౌళి
చటులగాఢాసమాశుశుక్షణిసదృక్ష, తీక్ష్ణదుర్లక్ష్య కాక్షేయతీవ్రధార.

క. శతమన్యువైభవుఁడు గణ, పతిరాడ్రఘునాథ భూమిపతి నందనుఁడై
నుతిఁగను బంగారమతన, సతిగా నప్పలసమాఖ్య జగపతిగోనియెన్.

సీ. కనుసన్నమెలఁగు నేర్పునసి చెన్నగఁగాని ప్రాణేశు పేరెదఁ బాదుకొనదు
గురుగభీర రసానుగుణవృత్తిఁ దగుఁగాని హృదయేశునొదల కెక్కఁజనదు
కనదవినాభావమునఁ బ్రవర్తిల్లఁగాని మగనిబాహువు పెట్టి సగమొనర్ప
దతిమృదూక్తులె కాని పతిసముల్లేఖంబున బలుమారు బహువచః ప్రౌఢి నెరప
దౌర యప్పలభూవరార్ధాంగలక్ష్మి, యైన బంగరమాంగన కప్రతిప్ర
తాపమణికి దామరసమంది రామరాప, గాసతీ భారతీ మృగేక్షణలు సరియె.

చ. అతనియనుంగుదమ్ముఁడు సమగ్రసమిద్ధ్రచనాదరుం డనా
హతవైరిశౌర్యసంగతుఁ డనంతగుణాధరి తాంబురాశినా
క్షితిఁదగురామచంద్రనృపశేఖరుఁ డర్మిలి మందపాటివం
శతిలకుఁ డప్పలాఖ్యతనుజ న్వరియించెను సీతమాంగనన్.

క. అతనియనుజుండు వేంకట, పతిన్నప మార్తాండుఁ డనఁగఁ బ్రబలెనహోయ
ద్ధృతశోభాపటలాంధీ, కృతసంయుగరంగ భీతరిపుకాశికుఁడై.

శా. శూరాగ్రేసరుఁడైన వేంకటపతి క్షోణీతలాధీశ్వరుం
డౌరా! వీరవిరోధిఖండనచణుండై మీఱ శౌరాంగనల్
శౌర్యల్ దీరుతు రంతరిక్షసరణిన్ బ్రాంచన్న వీవాధిపో
దారాలింగన సంగమ ప్రథిత సౌఖ్యాయత్త చిత్తాబ్జలై.

సీ. తనప్రాపుగోరివచ్చిన సుధీజనముఁ దాఁగ్రక్కున లేమితమిఁ బాపు ప్రోద్దుపోదు
తనకల్మిఁ దండఁజేరిన దీనజనరాజి మదినిబ్బరపు నొప్పిమాన్పు వెజ్జు
దనదయాదృష్టిఁ జూచినవారి నెవ్వగతీవ గమిఁ ద్రుంచు వాఁడిసురియ
దనపేరిమననుసరించిన బుధావళి పేదరికపు టేనుఁగవంచు మెకము జేను
భళిర! యిటువంటి మేటి యీజలనిధాన వలయితాఖండధారుణీస్థలినృపాల
తిలకములలోన వాసికెక్కఁగలఁడె యనఁగఁ, బ్రబలె శ్రీ దాట్లవెంకటపతివిభుండు.

మ. హరిశౌర్యుండగు దాట్లవేంకటపతి క్ష్మాధీశబాహాసి శ
క్తి రణక్షోణిభయంకరాకృతి రిపుశ్రేణ్యంతరాసృగ్ఝరీ
తరసాస్వాదనవృత్తిమత్తిలి మహోద్యద్భూత భేతాళని
ష్ఠురహస్తాంచలతాళసంగతి నటించున్ బెక్కుచందంబులన్.

సీ. మకమధువ్రతసేవ బొదలుకల్పకశాఖ రతిమనోహరుఁడనంగతఁ దనర్చు
విసము పుక్కిటఁ బూని బుసకొట్టునహిరాజు తమిజన్న పద్మిని దవులునినుఁడు
భువనజాతవిరోధి పూర్ణిమాసితరశ్మి బహుభంగదశలఁజేట్పడుబయోధి
యాశ్రయాశనమైత్రి నలరునంబరమూర్తి కులగోత్రదమనుండు కులిశహేతి
సజ్జనవితీర్ణి వరరూపసరసవదన, పృథుసుచిసుకీర్తి గాఢగాంభీర్యవిభవ
బలవిరళ్ళిల నెవ్వారు ప్రతిధరిత్రి, దాట్ల వెంకటపతికి నుదారమతికి.

ఉ. గణపతి రాజవంశమున కంధిసుధాకరుఁడైన నర్సరా
ణ్మణితనయన్ బ్రభూతనయ నవ్యసమస్తగుణాలవాల స
త్ప్రణుతసుశీల నచ్చమఁ గరగ్రహమూన్చి విరోధిభూమి భృ
త్త్రుణశిఖి దాట్లవేంకటపతి ప్రభుఁడ ద్విజకూలికై వడిన్.

మ. అనఘశ్రీనిధి దాట్లవేంకటపతి క్ష్మాధీశ్వరుం డాత్మనం
దనుఁగా వేంకటరాజసోదరుగతత్త్రసోదయున్ సజ్జనా

వను శ్రీవేంకటకృష్ణనాగమ విధిన్యాదిష్ట వృత్తిం గొనెం
ధనధాన్యాంశుక భూపరిదానముల విద్వద్బృందముం దప్పుడున్.

క. చినవేంకట కృష్ణనరా, వనజాక్షీరమణుఁడొప్పె వర్ణిత ఘోర్ఘ్నా
ఘనశౌర్య దావపావక, జనితశిఖా దగ్ధవైరి జనకాననుఁడై.

ఉ. వేంకటకృష్ణభూవరుని విశ్రుతకీర్తికి సాటిఁబూన వా
క్యంకర పంకజాహితులు జాలక యోఁడఁగఁబోలుఁగానిచో
సంకిలిఁబాల్చి వారలనయంబు శిరోజ శిరోధికాంశు వ
త్సాంకరుచిచ్ఛలంబున సమగ్రిత రాపయశంబుఁ గాంతురే.

చ. రతిపతియే శుభాకృతిఁ బురందరుఁడే చిరభూతిఁ గర్ణుఁడే
వితరణశాలి దాట్లచినవేంకట కృష్ణనృపాలు నెన్నఁ జో
రతిపతి యే శుభాకృతి పురందరుఁడే చిరభూతి కర్ణుఁడే
వితరణశాలి యందుఁ బృథివీస్థలి నెందు సుధీసమూహముల్.

మ. జలజారాతిమదిన్ గృశించె జలముగ్గాలంబు మెండైన కొం
డలలోడాగెఁ దృణంబునోరఁగరచెన్ జంభారిగోరత్నమా
తులపాటుం గొనెఁ గల్పభూరుహము లోకుల్ మెచ్చ శ్రీదాట్ల స
త్కులుఁడౌ వేంకటకృష్ణుదాతృతకుఁ జేతోభీతివాటిల్లఁగన్.

మ. వెలసెన్ వేంకటకృష్ణభూపతి భుజావిఖ్యాత శౌర్యోజ్జ్వల
జ్జ్వలనార్చిం బ్రభవించు వైరిపురభస్మంబూని యాత్మీయని
ర్మలసత్కీర్తికి సాటిరాఁబెనఁగుఁ దారాభర్తవక్షంబునం
గలదుర్వారకళంకకాళిమ దొలంగన్ వెన్నెఁ గావింపుచున్.

ఉ. శ్రీకరపూసపాటికుల సింధుసుధానిధి రామచంద్ర ధా
త్రీకమనాత్మజాత యువతీమణి సద్గుణరాశి నుత్తమ
శ్లోక వరించె భద్రమను శోభివచఃకలనాని రస్తద
ర్వీకరమౌళి దాట్లచినవెంకటకృష్ణ నృపాలుఁడర్మిలిన్.

క. చినవెంకటకృష్ణక్షితి, జనపతిభద్రాంబయందు సౌందర్యరమా
వనజాంబకు వెంకటపతి, మనుజేంద్రుం గనియె సుజనమాన్యున్ ధన్యున్.

గీ. తమ్ములిరువురుఁ దను సంతతమ్మునుచిత, భక్తి సహితమ్ముగాఁగొల్వఁ బరమభోగ
భాగ్యముల మించి సజ్జనప్రణుతిగాంచి, పుడమిఁబొలుపొందె నప్పలభూవిభుండు.

మ. విభవేంద్రుల్ పరిభవించి రప్పలమహోర్వీజాని కయ్యెందిరా
నిభ బంగారమకీర్వ రాత్మజులు సన్మిత్రప్రసిద్ధికాశ కీ
ర్తిభరుల్ వెంకటకృష్ణ వెంకటపరాధీశుల్ సుధాంభోధిఁ గౌ
స్తుభచింతామణులట్టులన్ సహజతేజోదాన ధౌరేయులై.

క. వెంకటకృష్ణక్షితిప మ్మ, గాంచుఁడు విలసిల్లె గువలయావన సునిరా
తంక కళాస్ఫూర్తినిభ, యంకర సంచారకళలయందగ్రజుఁడై.

సీ. భుజవిక్రమతుమాభూతికీర్తులకివి పంచాస్య గోరాజ పటిమఁ దాల్చు
నీతిదాతృత్వ సూనృత ధైర్యములకల్మి కాలకంధర ధర్మలీలఁ గాంచుఁ
బటుతనూబలకళాప్రజ్ఞా కృతులబల్మి మరుదీశ్వరాత్మ భూగరిమలారయుఁ
వచనగభీరతా రుచిదయామహిమ లమృతాబ్ధిగురుధామసమతఁ బూను
నౌర యితఁడనవెలసె దిగంగనారు, జాంశుకీభూత తురగఖురాగ్ర దళిత
రాజితాహిత భూపాబ్జరాగ పాంసు, పౌళి వెంకటకృష్ణభూపాలమౌళి.

చ. అలఘుతరాంబకానలశిఖాభిహతిన్ సమదాతనుద్విష
జ్జ్వలదవలేప జృంభణము వాపిసమంచితగోత్రధర్మకా
శలభృతిగ్రాహి యహీనగుణసంపద రాజవతంసుఁడోయనన్
వెలసెఁ బొగడ్త దాట్లకుల వెంకటకృష్ణ నృపాలుఁ డుర్వరన్.

సీ. పెనురాయి వెలుచ మూపున మోచుకొని క్నంగబడి యప్పులమునుంగు బహుగుఁ దెగ
కలితమదాసన్న గండాప్తిఁ దమయొడల్ దారెఱుంగని మహోద్ధతుల వారగి
పావవిస్ఫురణ చొప్పడియున్న చోఁ గదలనికతో రాత్ముల చనువు రోసి
వినినగానకకన్న పినకకోరల విసంబెడలఁజిమ్మెడువాని నీసడించి
పరిమద మిగౌరోత్త రత్నగర్భాపురంధ్రి, మానితైశ్వర్యనిధి సపరిమత్తసరస
హృదయ మృదుభాషణాస్పద వచనకలన, దాట్ల వెంకటకృష్ణభూధవుని జేరె.

ఉ. లాలిత దాట్లసత్కుల కళానిధి వెంకటకృష్ణ భూవరో
ద్వేల యశస్సమగ్రరుచి విశ్రుతభూతి నిరూఢదోర్బల
శ్రీలసమాన మేధ లొనరించు మెఱుంగులు గాంగభంగరిం
ఛోళికి నంశుమాలికిఁ దిరీమాలికి గాలికిఁ దమ్మిచూలికిన్.

సీ. ఏమేటిసంపత్తి ధీమదార్యారామ సంతానమునకు వసంతసమయ
మేధీరుభుజయష్టి సాధుకీరకలాపమునకు మంజులఫలస్ఫురితశాఖి

యేధన్యుఁడౌన మహీశ దీనార్థి హృత్ప్రమదాబ్ధికిఁ గళానిధానబింబ
మే పుణ్యచారిత్ర మెంతే కవీందిందిరములకు మధురమరందలహరి
నతఁడు జెలువొందు నగధీరుఁ డరివిదారుఁ, డభినవాకారుఁ డనవరతాన్నదాన
శూరుఁ డధ్యాత్మవిద్యా విచారనిరతి, శాలి వెంకటకృష్ణ భూపాలమౌళి.

చ. విమలయశుండు దాట్లకుల వెంకటకృష్ణుని శౌర్యవహ్నికిన్
సమధికపాణిఖడ్గకులిశంబునకు న్మదవైరిలోక రా
జ్యములతిమాత్ర నిస్తులత రాజ్యములయ్యె దురాగ్రహోన్నమ
త్తమతి నృపాలగోత్రములు గోత్రములయ్యె జనుల్ నుతింపఁగాన్.

సీ. అతనుశాత్రవగర్వహరణదీక్షారూఢి నలరారుట మహేశుఁడగుట యరుదె
యసమానవనిధాన సమృద్ధివెలయుట రాజరాజఖ్యాతిఁ బ్రబలుటరుదె
యక్రూర నరరక్షణాసక్తి నెసగుట పురుషోత్తమస్ఫూర్తి నొరయుటరుదె
పరచక్రవర్ధనప్రౌఢి దీపించుట భాస్వత్సమాఖ్యచేఁ బరగుటరుదె
యనుచుఁ గవిబుధులెన్నఁ జెన్నలరి దిగ్వ, ధూకచకుచాగ్ర భూషిత శ్రీకరైక
కీర్తిముక్తాఫలుండు రక్షితవనీప, కాళివెంకట కృష్ణభూపాలమౌళి.

చ. విరహితశక్తి శాత్రవులు వెంకటకృష్ణున కాజినోడి భూ
ధరముల కెక్కియు న్భయముఁ దాల్తురు దారల కంధరామనో
హరతఁ గటీతటీగరిమ నారురుచుల్ బొమలందమెంచి త
ద్వరజయశంఖచక్ర కరవాలశరాసన శంకితాత్ములై.

చ. విలసితమూర్తి దాట్లకుల వెంకటకృష్ణ విభుండు మర్త్యమా
త్రులకుసిరుల్ ఘటించి కృపతో జలమృత్పల లత్వక్స్థిదా
తలఁదల వంపజేసెనని తజ్ఞులు సారెకు వేయునోళ్ళఁదా
రిలఁగొని యాడఁగా విని కవీశ్వరులైరి కవీశ్వరుల్ భళీ.

గీ. స్థిరతరసుకీర్తిశాలి కల్దిండివంశ, వరుఁడు వెంకటరామభూవరుని సాధ్వి
సుగుణసీతమకుజనించె సుందరాంబ, వార్ధిఁబొడమిన మందారవల్లిబోలె.

శా. శ్రీమద్వెంకటకృష్ణభూపతి వరించెన్ వేడ్క నాసుందరాం
బామ త్తద్విపరాజయాన రఘురామక్ష్మావిభుం డుర్విజా
రామారత్నము భంగి శంకరుఁడు శర్వాణింబలెం జాతనా
శీమీనేక్షణరీతి లోకమభినందింపన్ సిరుల్ హెచ్చఁగాన్.

గీ. పతివిహితకార్యకరణ శోభనగుణావళులంబ విలసిల్లె శ్రీసుందరాంబ భళిర
పుట్టెనింటికిఁగండముల్ మెట్టెనింటి, కవనిఁ జెలితనమిడుఁగౌరి నపహసించి.

సీ. సజ్జనస్తుతియోగ్య సౌభాగ్యలక్ష్మీధురంధరతాస్థితి రతియకాదె
మహనీయతరసుధామధురవాక్య విశేషరచనావిభూతి భారతియకాదె
యాత్మనాయకసపర్యాభక్తి భావనోచితమనోగతి నరుంధతియకాదె
హితబంధుజనమనస్స్పృహణీయశాశ్వత సంపదున్నతిరమా సతియకాదె
యనుచుఁ గొనియాడ నెగడె రాజాధిరాజ, దాట్లవెంకటకృష్ణ భూధవుని సాధ్వి
బుధజనసురద్రుమవల్లి సుభ్రూమతల్లి, సురుచిరగుణావలంబ శ్రీసుందరాంబ.

గీ. సుందరాంబయందు సుతను లక్ష్మీనరసాంబసుతుని నప్పలాఖ్యమతియుం
సీతమాంబఘూటి జెంది వెంకటకృష్ణ రాజపుంగవుండు దేజరిల్లు

ఉ. ఆనయశాలి తమ్ముఁడు గుణార్ణవరమ్యుఁడు బంధులోక స
న్మాననఘుండు భోగశతమన్యుఁడు ధన్యుఁడుదారరూప లీ
లానిధి కీర్తిఁద్రిశకశారధి వెంకటరాజమేదినీ
జాని కవీశ్వరుల్ పొగడఁజాలరు వాకుఁగన నమ్మహాత్మునిన్.

సీ. తనతనూసుకుమారత మనోజరాజరాజకుమార రాజి రాజసము దెల్పఁ
దనమహాకోశ్వారత శతార హరికిశోర మయూరగమన గౌరవము జూపఁ
దననిరంతరదాతృత ఘనాఘనసుమాఘవనవనీకామధుఘ్నత నింపఁ
దనసముజ్వలసమాఖ్య నవారవిందచందన శరత్కుందకుందరుచి దాల్పఁ
దనమనోవార్య గాంభీర్యధైర్యపటిమ, లమృతకూలంకషాధిప శమనదమన
శైలలీలాపరిస్ఫూర్తి నోలిసెరపఁ, దనరె వెంకటరాట్కుమందాను విభుఁడు.

సీ. తనువెల్ల విషపుంజమని పయోనిధి రోసి తృణమండయని రెల్లుఁ దొలఁగనడఁచి
గతిలేనివాఁడని క్షితిధరాగ్రిణిఁ బలికి కుడిజికుకనని సంకుసొబగు దెగడి
పాపజాతియటంచు ఫణిరాజు నిరసించి ముసలియంచు హలాంకుఁ గసరివైచి
బహుభాషిణియటంచు భారతి సెగ్గాడి గుహనీగునని హరికోదమసెంచి
యఖిలబుధలోకనుతిపాత్రమై యఖండ,పద్మగర్భాండభాండ సంభరిత విమల
తరసుధారాశినాఁబొల్చుఁ జిరసుకీర్తి, గలసుకృతివెంకట తిమ్మాతలవిభుండు.

ఉ. భూనుతకీర్తి కాకరలపూడి కులాంబుధిచంద్రుఁడార్య ర
క్షానిపుణుండహీనగుణసాగరుఁ డచ్యుతరాము నందనన్

జానికమన్ దయావినయశాలిని వెంకటరాజమే నీ
జానిపరిగ్రహించె సిరి శౌరివిధంబున నార్యులెన్నఁగాన్.

గీ. అప్పల క్షితీశ్వరా చ్యుతరామరా, జులనుఁ గాంచె సకల సుజననుతుల
విభవకీర్తి శాలి వెంకటరాట్కుమం, దానువిభుఁడు తనదు దారవలన.

స. హృద్యానవద్యసురేంద్ర సాంద్రీభవద్వైభవాకరము శ్రీధర్మవరము
సకలవేదపురాణ శాస్త్రప్రవీణవిద్వజ్జనోత్కరము శ్రీధర్మవరము
సమరబాహాటోప శాత్రవభూపచేతస్తాపకరము శ్రీధర్మవరము.
ఫలపుష్పపల్లవ పాదపశోభితోద్యానబంధురము శ్రీధర్మవరము
నిరుపమాగార గోపురావరణ హర్మ్య, నిర్మితామూల్య కళ్యాణ నిఖిలరత్న
కాంతిసంతాన పరివృతాశాంతరము స, దాసుజన మనోహరము శ్రీధర్మవరము.

మ. తనకాధర్మవరాఖ్యపట్టణ రమాతన్వంగి సాక్షాత్కరిం
చి నిజార్చా పరతంత్రియై మెలఁగె నాఁ జెన్నొందె శ్రీసుందరాం
బ నవీనానుపమానభోగములఁ దేర్పం దా జస్రంబు నిం
పెనయన్ శాశ్వతభూతి వెంకటమహాకృష్ణప్రభుం డచ్చటన్.

మ. అనువొందన్ రతిసుందరీ నయన పద్మామోద సంపాదినూ
తనలీలాన్వితుఁడై మహోగ్రరిపుజాతస్వర్థియై లోకవ
ర్ధనకారి ప్రతిభాధురీణ సుమనోధర్మాఢ్యుఁడై బాంధవా
ర్యనుతిన్ వెంకటకృష్ణభూపతి మహీరాజన్య కందర్పుఁడై.

సీ. ఒకగోత్రధర్మ ముత్సుకతాప్తిఁ బూను నేరుపుఁ గన్న నతని పౌరుషమ దెంత
యొకనరు నెట్టకేలకు ద్రోచి యేచి రంజిలుచుండు నతని దాక్షిణ్యమెంత
యొకపంక్తిగళు నాజి నొంచుచు బల్మి వహించి దీపించు నతని యాటోపమెంత
యొకతరి నోపఁగివిల్వ శౌగిగర్త్రిలుచుఁ గొండలనీగు నతనిదానం బదెంత
యనుచు మనగు భవ హరిరామ ఘనులనిఖిల, గోత్రినర్త్రైకవృత్తి బాహుసగరక్షు
బహుళరిపుపంక్తి గళవృత్తి బహువిత్తి, నెసఁగు శ్రీదాట్ల వెంకటకృష్ణ విభుఁడు.

ఉ. పటుదాతృత్వ గభీరతా వినయ సంపద్విక్రమ శ్రీలనో
కట మందారసరస్వ దాంగిరస పాకద్వేషి పాదాబ్జినీ
విటులీడౌదురు గాక యన్యులెనయే వెయ్యేల శ్రీదాట్ల వెం
కటకృష్ణక్షితిపాలమౌళి కరిలోకగ్రావ దంభోళికిన్.

సీ. తనయురంబున బాదుకొనినరంగైదలంగ రేరాయఁడానవశ్రీవహించెఁ
దనమూర్తి మధుపాప్తతజనించు సడిబాయ వెలిదమ్ముగ్రాలు కటాక్షవిభవమూనెఁ
దనపంకజత్వ నిందానుస్ఫూర్తి కొలఁగంగ వలయురి గళగౌరవమున మెలఁగెఁ
దనసన్నిహితగండ దశలరట్టుఁ గగరాజిత హిమాద్రిలుపుచాకృతిఁ గనర్చెఁ
బారదముఁ బాఱఁ దరమికర్పూరరజము నిదనలఁ డికొను నుకృతిఁ జెదరఁ జిమ్మె
యొసగు శ్రీడాట్ల వెంకటకృష్ణ భూర, మణశిఖామణి సత్కీర్తి మానవతికి.

శా. సుశ్రీయుస్సుకుమారగాత్రుఁ డురుతేజోమిత్రుఁ డాశాతటీ
విశ్రాంతస్థిరకీర్తివంతుఁ డతి సంవిన్నిర్మల స్వాంతుఁ డౌ
రా? శ్రీమంతులకెల్ల మేటియనఁగా రాజన్మహారాజరా
జశ్రీ వెంకటకృష్ణభూరమణుఁ డాచంద్రార్క మింపొందెడున్.

## — షష్ఠ్యంతములు —

క. ఏతాదృశగుణమణికి న, రాతిద్విపసృణికి బంధురాజిముఖసరో
జాతనభోమణికి కపఘన, జాతమహాబలవిఘూర్ణ సావీరణికిన్.

క. లలనాస్మితునకు సంగర, తలనానాహితవనీవిదళ నాతిదవ
జ్వలనార్చిస్తుల నాగ్రహ, కలనాద్భుతపదమునకు జగద్వితునకున్.

క. అజభామాహిమధామా, భుజభామానిత సుకీర్తిభూషిశునకు నూ
రిజనాదృతశుభమతికి ర, విజనాకద్రుమవితీర్ణ విభవోన్నతికిన్.

క. కరుణామరందలహరీ, భరణకటాక్షారవింద భాసితవదనా
గ్రిరసోదంచితవాక్యము, ధురతాపదిహసిత వాగ్వధూ రమణునకున్.

క. భీమాహితసమరధృతి, శ్రీమతికి మనోజ్ఞరూపజిత రతిపతికిన్
శ్రీమద్వేంకటకృష్ణ క్ష్మామండలపతికిఁ బాప్త సజ్జనతతికిన్.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన విజయనందనవిలాసంబను మహాప్రబంధంబునకుఁ గథాప్రారంభం బెట్టిదనిన.

—(0)—

## — కథాప్రారంభము —

చ. స్థిరఁదగ నేలు ధర్మనిరతిన్ జనమేజయు భూతలేంద్రుఁడ
క్కరిపురి రాజధానిగను గౌరవవంశసుధాకరుండనం
బరగియరుల్ దలంక ఘనమార్గ పరిభ్రమణైకవృత్తి మే
దుర సుమనః కదంబ పరితోషణకారిక శాకలాపుఁడై

చ. అతఁడరి భీమవిక్రమ సమగ్రిత జీవనరాశి వేష్టిత
క్షితి భరణప్రవీణుఁడయి చెల్వువహింపఁగ నిట్లు కొల్వువం
దతులతపో మహత్వనిధి యర్యమతేజుఁడు శాంతవర్తనా
న్వితుఁడగు పైలనామక మునిప్రవరుండొక నాఁడువచ్చినన్.

క. భూరితర భారతకథా, పారంగతు సుగుణసాంద్రుఁ బైలమునీంద్రుం
జేరిజనమేజయుఁడు నయా, మారఁగఁ బ్రణమిల్లి భక్తి నాతనికనియెన్.

మ. అనఘంబౌ సకలశ్రుతిస్మృతి, పురార్థంబుల స్వక్రము
ఖ్యానలింపాములభూరిసంభ్రమ రసాక్రాంతాత్ములంజేసి యొ
య్యన నస్మద్బహుజన్మసంచితము పుణ్యంబెట్టిదో మీరలిం
పునవిచ్చోటికి నేగుదెంచితిరి సంపూర్ణానురాగంబునన్.

క. మీరాక సకలశోభన, కారణమిష్టార్థసిద్ధిఁగాంచితిని విప
ద్భారంబెడఁద్రోచితి వి, స్ఫార శ్రీసుగుణసాంద్ర పైలమునీంద్రా.

క. ఘనుఁడగు వైశంపాయన, మునివచనన శేషధర్మములు వింటిని నా
విననియదిగలదొకటి దా, నిననాకెఱిఁగింపవలయు నేరుపుమెఱయన్.

ఉ. పుణ్యకథాప్రసంగములపూర్వములైనవి తెల్పువాక్యనై
పుణ్యము నీకగల్గునని బుద్ధినెఱుంగుదు విష్టపత్రయీ
గణ్యుఁడుసీరి పుత్రి బలఘస్మరుగుపౌత్రిన కుగ్రశాత్రవా
రణ్యదవాయితాకృతికి రాణిగఁజేయు చరిత్ర చెప్పుమా.

వ. అనిన జనవల్లభున కత్యంత మాధురీధురీణవచనంబుల నమ్మునివల్లభుం డిట్లనియె.

క. వినుసావధానమతివై, ఘనవాహనుపట్టిపట్టి కళ్యాణకథన్
విన నఘశ్రవణంబులక, త్యనుపమితాక్షీణ సంభ్రమాపాదియగున్.

ఉ. వెన్నునియాజ్ఞ ద్వారవతి విశ్రుతమద్యకవాటగోపురా
భ్యున్నతసాలసౌధముల భూరిమనోహర నూత్నరత్నదీప్తి

న్నలువొందనాకపురి దీనికిఁ దీటెయనంగ బుద్ధిసం
పన్నత విశ్వకర్మ యసమానచమత్కృతిఁ జేసెఁబేర్మినన్.

సీ. ప్రాకారగోపుర బలభిన్మణిద్యుతుల్ కారుమొగులచాయఁ గడకుఁదోఁప్రియు
మందిరకురువింద మణిబృందదీధితుల్ జగలుమానికము దేజమ్ముఁగ్రమ్మ
గుద్యాగారోత్కృత గురుకాంతి సంతతి ప్రాద్దుబాబాడాలు పొలుపుదెగడు
సౌధహీరకలాప సమధికరోచులు పండువెన్నెలనిగ్గుఁ బారఁజిమ్మ
సౌధశిఖరాగ్రవిరచిత, చర్మ్రకలశతటవి కీలితవిమలముక్తాకదంబ
రుచిర మాధూతతారకా, నిచయ మన్నగరి విభవ మెన్నఁదరమె వాగ్వరునకైన.

చ. పురహరి నీలసౌధములు బొల్చుతదంతర ఖేలదైణదృ
గ్వరచరణాబ్జనూపురరవ స్తనితభ్రుకుటీంద్రచాపకా
యరుచితటిత్కచాగ్ర నవహారఘనోపల మండలీ నిరం
తరగతి ఘర్మబిందుజల ధారలచే స్తనయిత్నులో యనన్.

ఉ. తేటగు నిల్వుటద్దముల తేజమునందగు సాలభంజికల్
బాటిలు నిద్దపుంగరుడ పచ్చల కంబము లాయతోజ్జ్వల
స్ఫాటికవేదికల్ చలువ చప్పరముల్ మణిమంటపంబు లె
చ్చోటను జూచినన్ నగరిసొంపు గణింప విధాత యొంపునే

క. పురసౌధ కవాటతట, స్ఫురదురు మణిబింబ దంభమున నానాది
గ్వరనికరము దౌవారిక, గరిమన్వెలసిల్లు దేవగణము నుతింపన్.

ఉ. భుక్తికిముక్తికి న్నెలవు పోల్పగ నిందుజనింతమంచు నా
సక్తిసుధాంధసు ల్సకలజంతుమిషంబున దోపఁజూచి సు
వ్యక్తినథోజగన్నిలయు లన్నగరీపరిఘాంతరాళ వా
ర్వ్యాక్తిఁ జరింపుచుండ్రి హృదయోదిత సంభ్రమజృంభమాణులై.

శా. పోరాముల్మణిగోపురాగ్రముల నేప్రొద్దున్ నిలింపుల్నితాం
తారామస్ఫుట సూనగుచ్ఛమకరందాసార శైవాలినీ
తీరాంభస్సరసీవిహారముల నెంతేనిర్గతశ్రాంతి నా
యూరన్నిల్చి సుఖింపుచుండ్రనుదినం బుత్సాహయుక్తాత్ములై.

చ. జిలుగుపసిండి ప్రాతపనిఁ జెన్నగు మేడలఁ జంద్రకాంత మం
డలరుచి మద్దవాకిళుల డగ్గరి సారెకుఁ దొంగిజూచు క

న్యలముఖలక్ష్మికోడె మధుదాపగ దమ్ములఁగాని శోధరా
స్థలినవి యేలతాల్చునయశంబు మిళింద ఘృణిచ్ఛలంబునన్.

చ. నగరిపువైభవోన్నతిఁ గనంపగు నప్పుటభేదనంబునన్
మృగనయనల్ గడంగి విపరీత పరీతముల న్ద్రివిష్టపా
ఖ్యగణిత కాంచనస్థగిత హార్మ్యతలాంతిక సూర్యకాంతుల
న్నొగిలి చరింపుచుందురు సూనసుధాంశుశిలాలయంబులన్.

ఉ. ఉన్నతసౌధ హీరతుదులుజ్జ్వలసాల వినీలకాంతులు
ద్యన్నిలయాబ్జరాగ ఘృణులంబరవీథిఁ దగన్సుధాంధసు
ల్సన్నుతదేవ సింధుజలజాతహితప్రభ వా సరిస్వతు
ల్పన్నగ నిందుఁగూడెనని బల్మరుగప్పంకిడఁ జూతురాదృతిన్.

చ. పురిఁబుషితాహి భుక్ప్రకరముల్మణి కాంచనసౌధగోపురో
పరివెలయన్నిజాశ్వగళ బద్ధభుజంగము జాతిభీతిలోఁ
గెరలునటంచు భానుఁడిరుగ్రేవలఁ బోవఁగ నాటనుండియు
న్ధరణిప్రసిద్ధిగాంచె నయనద్వయ సౌజ్జనుల్ గణింపఁగన్.

క. బలభేది వీటిసతులకు, గలిగినజవ్వనము సోయగము దిగిచిపురీ
లలనల నమర్చి శతధృతి, యలరెఁదనఁ జనులు చమత్క్రియాశాలిజున్.

క. సోమునికళలోఁ మెఱుఁగిడు, కాముని యలరంప గములాకాంచనశోభా
శ్రీమెఱయు ప్రతిమలోయనఁ, గామినులన్నగరి వెలపుగాంతులు వెలుచన్.

క. నానావిధ ఫలపల్లవ సూనలతాపుష్పహారశోభితనికటో
ద్యాననికుంజముల నిజాధిపులతో మెలఁగుదురు పురీందునిభాస్యల్.

మ. పరగన్నాల్గుమొగంబులన్ విధితప్రియాపారాయణాసక్తిఁ జె
న్నారయుంగాయది యంతసేప నిపురపాప్రద్యన్త్రిహీలోకని
ర్జరులేకానన పంకజాభ్యసిత శశ్వద్వేద వేదాంగత
త్త్వరహస్యార్థ సమగ్రులై సిరుల శేవంబొల్తురిల్లర్పుడున్.

మ. అరినిర్భేదనశక్తి సత్పథచరత్వారూఢి లోకైక సు
స్థిరసోమాబ్జసమాఖ్య భూరిసుమన శ్శ్రేణీ మనోహారి కృ
ద్వరసంపూర్ణకళాప్తత న్దవలయోహాత్సాహ ప్రధానంబు నం
బురరాజంబున రాజమండలము పొల్పుంగాంచు నత్యున్నతిన్.

మ. నవ సంఖ్యాకములౌ నిధానములతో నల్వొంది తామిట్లు ఖై
తువిధిన్ మాన్పఁగ లేడటందు ద్రవిణస్వామి న్నగంజాలి పై
కఁవుసంఖ్యల్ గలవిత్తమెక్కుఁ కరు తా రార్జించి మిత్రావళిన్
భువి శ్రీమంతులఁ జేయు చుందురతివిస్ఫూర్తిం గిరాటుల్ విభున్

చ. పితృపతికొక్కఁడున్న పురభేదికి నొక్కఁడు వృషంబు రేవతీ
పతిపతికొక్కఁడు నాగలి పసన్ బరికింపఁగ నిట్టివార లే
గతిఁ గృషి జేసి భూమి ప్రజఁ గావఁగ నేర్తురటందు తత్పుర
స్థితపదజాల్ హసింపుదురు దీర్ణవి నిశ్చలనైభవోన్నతిన్ కైవ.

సీ. దివిఁ బాసి గ్రహరాజి భువికేగుదెంచెనా విపణివీథుల రత్నవితతు లమరు
నురుకీర్తి వలగంధగిరి వీడి వచ్చెనా నాయకుల కోటల గాన్పు మొలకలమరు
తటిదుత్కరము సచేతనరీతిదోఁచెనా నవవయః ప్రమదాజనంబు దనరు
బలవైరి పెక్కురూపులు దాల్చి పొల్చెనా నాకమనీయ రాజవర్గంబు లొప్పు
భువనభయశాలి యనంతభూరి తనువు, లెత్తి విలసిల్లెనా మహోదాత్త బాహు
శౌర్యధౌరేయ సద్భట సంఘ మొనరు, రమణఁ బెంపొందు నమ్మహారాజధాని.

గీ. హరివలగ్నలు మీనకటాక్షసరణు, లళికచలు కార్ముకభ్రూలతాభిరామ
లును ఘటస్తనులగుటఁ బేర్కొనఁగఁ దత్పు, రంబు వెలయాండ్రు రిసౌభాగ్యరాసులై

సీ. పసుపులుఁ నీవండ నొసగెదే చెలి వెలయాలి నాదండ నీకేలగల్గు
ననబోఁడి వలువ గప్పినవి పూబంతులా యౌనతిప్రియుఁడు చేనంటవలదు
ఓలనాగ యీతమ్మి నేనాసఁ దావులానెద మున్న యొకఁడు కొన్నదిసరసుఁడ
చెలిపలు దొరగుల చేనమ్మ చూచెదు కల్వలా కొన లేని కాంక్ష యేల
తెలది కాంచనమాలిక వలెనటన్న, బుధవరత్నంబు రకుఁ దక్కఁ నొరులకమ్మ
ననివిటులతోడ నర్మోక్తులాడికొనుచు, ననుదినము పువ్వులమ్ముదు రతివ లచట

సీ. కరపాళి పుష్కర సరిదంబువులు గ్రోలునన్న చోనున్నతులెన్న నేల
యతిదీర్ఘదంత సంహతిఁ గొండలు బెగల్చునన బల్మికల్మిఁ బేర్కొనఁగ నేల
జలధులఁ రొంపిగాఁ గలఁపఁజాలునటన్న రోషవిస్ఫురణ వాక్రువ్వ నేల
పుడమిబ్రాతాళంబు బ్రుంగఁ ద్రొక్కు నన నంగ భూరిమదోద్వృత్తిఁ బొగడ నేల
యనుచు జనులాడ నైరావతాద్యశేష, హరిదిభంబులఁ దమ సాటి బొరయనీక
నగరివీథుల ఘంటికానాద మెసఁగ, సంచరించు మహోద్దామ సామజములు.

ఇభునినవ్వులఁ బడద్రోయునవితదీయ, హారులనిరసించి పవనునికంటెనధిక
జవమున గమించులత్పురాశ్వములఁజూచి, దేవతాశ్వంబు వెలవెలబోవుగాదె.
అనగరంబునకధిపతి, యై నెగడున్ హరి మనోభయానకసం
యన్నానాసురసేనా ధర, దానామృత శక్రిబిభుర దర్పోద్ధతుఁడై.
లలితారుణ హాలాహల శిరోధిఘనశిరోగృహమేను లేమేటిపేరిక్షణంబు
లతులితశుభ్రితకిరో వ్యాహారసరణియే యుత్తమోత్తముని పేరోలగంబు
బహుళవిశ్వంభరా భరనిర్వహణభోగి యేదయాగుణశాలి నృపులకయ్యా
యభివర్ణనీయసుధార్ణోనిధాన కన్యక యే మహాత్ము మోహప్రపురంధ్రి
యతఁడుదగుఁగఁసభామ మురాద్యశేష, యామినీచరసమవర్తి యశీనుతాంఘ్రి
తామరసఁడాస్యభక్త భవామయార్తి, త్రిభువనఖ్యాతకీర్తి శ్రీకృష్ణమూర్తి.
ఆకృష్ణుఁడు, నిజహితకా, ర్యాకలనమెలఁగ నిచ్ఛలాహోదరస
స్వీకృతమానసుఁడై ము, ల్లోకములనుఁబొగడఁగాఁ బలుండింపొందున్.
రాముని కులకామిని యల, కాముని సతి దెగడు సోయగము జవ్వనమున్
గ్రామెఱయుఁబొగడికంగని, శ్రీమించున్ మించుబోలె రేవతియనఁగాన్.
ఆరేవతియందధిక, శ్రీరమ్యశరీరఁ బుణ్యశీల గుణలతాం
తారామ సీరి యొక్క కూ, మారిక శశిరేఖ లోకమాన్యం గనియెన్.
నియాతండు తదుత్సవాప్తి నఖిలక్ష్మానిర్జరానీకమున్
ధనధాన్యాంశుకభూషణాదిక పదార్థ శ్రీలనత్యంతమున్
తనివొందింపుచు దమ్ముఖోదిత శుభోదర్కోక్తిఁ జెన్నొందమిం
చెనగా రాతిప్రకీపటీ నటనఖై చిత్రి స్ఫుగర్జితముల్.
బాలిక చక్రదనంబుల, కేలికయై నాఁడు నాటికెదుగుచువిద్యా
న్మాలికపోలిక మదనుని, వాలికపూములికిపసిది వన్నియ కెక్కెన్.
అంత.
అసమానోన్నత సౌధకేలనసరోజాక్షీ నిభావ్రితల
వ్యసురదుప్రిప్ర నవోన్న మద్భ్రమర మాలానీక జీమూతన
త్యసమాజృంభిత పోషితాహి రిపుసాంద్రింబార్య సంఘాతమా
నసవాంఛాఫలదాన విస్ఫురణమిందప్రిప్రస్తు కెక్కెన్ భువిన్.
పురమివ్వాల్గంటికేపుటి భేదనము మనోహరగశాంచితహార తరళమయ్యో
సకలవిద్వత్సహాత్సంఘాతమున కేపురమతల్లి యీపురరతనమయ్యో

# ప్రథమాశ్వాసము.

ఘనకుతుకంబొనర్చు గిరిసానుదరీకటక ప్రదేశ నూ
తనవనమండలాంతర పథంబునదా జనియె న్నృపహోన్నతిన్.
మ. ఘనశాతోదరిగాంచె మ్రోల సముదంచద్వార్ధిఖేయోరుభం
గనితాంతోదకశీకర్మామలినముక్తారంగవల్లీ శుభా
యనవానామణి మంటపాయుతన హర్మ్యద్వారకన్ శౌరిశో
భనపాద్మాంబురుహార్చనాపరజనాపద్వారకన్ ద్వారకన్.
చ. అగణితవైభవోన్నతిరయంబు మెయిన్ జనుదెంచు నాసుభ
ద్రి గుణసముద్రి జూచి దవుదవ్వుల జారులు వేగవచ్చి భ
వ్యగుణదయావివేక నయవర్తనులన్ బలరామకృష్ణులన్
దగబొడగాంచి పల్కిరి సుధామధురోక్తుల గేలుమోడ్చుచున్.
శా. మిముజూడన్ బతిపంపలో దొలకుకూర్మిన్ బుత్త్రుంగూడి భ
స్మమయస్యందన మెక్కి యాప్తపరివార శ్రేణితోడ్తోసనం
గాఢ్యమై శ్రీవల నేగుదేరగ సుభద్రాదేవి వచ్చెన్ దటి
త్కమనీయాకృతి బెంపుసొంపెసగ సాక్షాల్లక్ష్మి చందంబునన్.
క. నావినిప్రమోదరసకల, నావినివేశిత మనంబునం దగువారిన్
రావించిపనిచి రబ్బల, దేవాచ్యుతులామె దోడితేర రయమునన్.
మ. వెనుప న్వారరుదెంచి సప్రణయ వాక్ప్రౌఢిన్ బ్రియంబూన్చితో
డ్కొని దేతేరగ నాత్మనందనునితో గుంపై మురారాతిప
ట్టణవాసుల్ నిజరూపలక్ష్మి గొనియాడన్ ధర్మహార్మ్యాంతికం
బన దేవాయ్యన డిగ్గిలోనికయగన్ మోదంబు దీపింపగాన్.
అంత సుభద్రరాకగని యాప్తులతో నెదురేగుదెంచి య
భ్యంతరమందిరంబునకు నాయమదోడ్కొని తల్లిదండ్రుల
త్యంతముదంబునంజని తదాత్మజుతో నటనూనసౌరభ
ప్రాంతమనోజ్ఞ గేహమున గౌరవలీల వసింపజేయుచున్.
ప్రియంబులన్న లాప్తులు, బలు దెరగుల గౌరవింప బ్రతివాసరము
ద్యుళికుంతల బహుసౌఖ్యో, జ్వలమానసయయ్యె సుతుడు వర్ధిలుచుండన్.
అంత నొక్కనాడు
శ్రీగోపాలుడు గామపాలుడు మణిసింహాసనాగ్రస్థితిం
యోగిధ్యేయచరిత్రు లిద్దఱొకచో నుత్సాహభావోద్యమ

శ్రీగన్పట్టెఁ దదీయపార్శ్వమున వాసిన్ దేవకీరోహిణీ
నాగాగాత్రివలగ్నలిద్వ్యనేక నూత్నస్వర్ణపీఠిం దగన్.

ఉ. అత్తఱి దోడితెచ్చె నొకయంగన నాశశిరేఖసన్మణా
యత్త శుభాంకరూపరుచిరాంగి మెఱుంగులపోఁడిపుజాలువా
చిత్తరుబొమ్మ జిత్తజునిచే కరవాలము గమ్మతావిపూ
గుత్తియమూల్యరత్నములకుప్ప యనందగు నామెవేసుకన్.

ఉ. వచ్చినదాయరాదిగిచి వర్ణితరూప మనోహరాంగిసం
పచ్చపలేక్షణాసదృశ భాగ్యవతిం శశిరేఖ గౌఁగిటన్
గ్రుచ్చి నిజాంకమధ్యమున గూర్చి లలోదరులిద్దరాత్మలో
నొచ్చము లేనికూర్మి నయనోత్పలపూరిత సమ్మదాశ్రులై.

క. రోహిణియును దేవకియును, నాహలికేశవులఁ జూచియనుగత హృదయో
త్సాహమునబల్కిరీ చెలి, నాహవవిక్రమ విహారి కభిమన్యునకున్.

క. పరిణయమొనరించుటయది, కరముచితము శుభము వీటఁగలబంధు సుహృ
త్పరివార హృదయసమ్మద, కరముజగత్ప్రీతియ వినుతికారణముగదా.

చ. అనవినిమందహాస రుచిరాననుఁడై నరకారి సీరిఁగ
న్గొని మనతల్లులాడు పలుకుల్విహితాస్పదము ల్ముదంబు బ
ర్వనవినయంబుతోడ నవివింతె సుహృద్బుధ బాంధవాది స
జ్జననికరప్రియంబదియె సల్పఁదలంచిన నెన్ని భంగులన్.

చ. అనిహరితోడ శౌరియిటులాడెఁ దదుక్తులనాలకించి చెం
తనొకతె మంజుభాషయను లత్వరయంబున డాయఁబోయి శో
భన గుణభద్రయైతగు సుభద్రకు దెల్ప శ్రుతిప్రియంబుగా
వినితలయూచి యాసతియవీన ముపప్రిచరీ కృతాత్మయై.

క. ఆమంజుభాషకనుసన్, శ్యామయ హారాదిబహువిధ మణిభూషా
హేమాంశుకముల గుతుక, శ్రీమెఱయఁగఁజేసి యాదరించి ప్రియమునన్.

సీ. కలికియొకర్తె తెకెంగ్రాలి నిలువుటద్దముఁజూప పసిడిబాగాలొకర్తె పణఁతియొసఁగ
గపురంపు సురటి యొకర్తె సరోజముఖి వీవఁ గదుచందనమొకర్తె యాతివ పేర
నలరు మెత్తువలెనొత్తు మబలయొార్తు వహింప మగువయొకర్తె తెయాకుమడుపులీన
భామయొకర్తె తె బట్టు పన్నీరుకలశంబు ముత్యాలగొడుగొకర్తె ముదితదాల్ప

పద్మగంధియొకతె బరాబరులు సేయ, దెరఁదయొక్కతె గొడుఁగు నెత్తికొనిరాఁగ
రాజసంబును సౌకుమార్యంబు మీఱ, రమణి ప్రాసాదసోపానరాజి డిగ్గి.

పంచచామరము—సురాధినాయకాత్మజోక్తసూక్తులన్ని దెల్పినం
మురారిసీరియాలకించి మోదమూని బంధుమి
త్రరాజి మెచ్చ నాతలంపు దారుతీర్తు రోషుడిం
గరంబు పేతు జేతురో జగంబువారు నవ్వఁగన్

అని సందియంబున

ఉ. సరసంపున్ నడసొంపుగన్న యడుగుల్ సౌవర్ణరత్నాంకనూ
పురయుగ్మారవకైతవంబున గృహప్రోద్యన్మరాళీపరం
పరఁ గేరన్ బిగిగుబ్బవ్రేఁగున జెలింపన్ గానుశంపాయుచుల్
గురియున్మేను సుభద్ర సాంద్రకుతుకాలోలాంతరంగంబునన్.
అరుదేరంగని సోదరిన్ సుగుణమాన్యన్ రూపరేఖామనో
హరసౌజన్యనిధిన్ బలాచ్యుతులనానందభావంబునన్
సరసన్ వజ్రమయోన్నతాసనమునన్ సంధింపశ్యామాకులా
భరణంబొప్పె సితాంబుజోపరిపరిభ్రాజన్మరాళీప్రభన్

వ. అంతమఘకైటభారి ప్రియంబు దొలుక, రోహిణీ దేవకీపురంధ్రిల వరాంక
తలమున నటించు పూరెమ్మ తళుకుపసిఁడి, సోయగపుబొమ్మ శశిరేఖ డాయబిలచి
కరము కనికరమున మురవైరి, తనుబిల్వఁ ద్వరితగమన లీలనరుణచరణ
కలితకటక ఝుణఝుణత్కార కోలాహలమున శౌరి సమ్ముఖమున నిలిచె.
నిలువం జూచి కరమ్ములందిగిచి సాంద్రభూషహర్షంబులోఁ
బలనూపన్మధుకైటభాంతకుఁడు నా తల్లీ? వధూటీమత
ల్లి? లతాతన్వి యటంచు నంకమున నోలిం జేర్ప నచ్చాల ని
ర్మలదీప్తిన్ దగెనంబు భృద్విగకటవిద్యున్మాలిక నొప్పలుఁ బెన్.
అల్లన సోదరి ప్రియవయస్య ముదంబున నెత్తికొన్న మే
నల్లునిఁ గేల రాఁదిగిచి యంకతలంబున జేర్చి కూర్మి సం
ధిల్ల శిరంబు మూరుకొని నిద్దపుఁ గూకటి దువ్వి మేన రం
జిల్లు సువర్ణభూషణవిశేషముల న్సవరింపుచుండగన్.

క. మురహరుని యంకయుగళి, న్గరమొప్పు సుభద్రికొమరు గన్నియయును జా
పకులను దాఁగలను గూర్చి, సరవిన్ హర్షంబు చంద్రచంద్రికలకిరియన్.

క. ఇల శశిరేఖాసౌభ, ద్రిల చతురాస్యుఁడు శుభాంకరూపరుచుల దు
ల్యులుగా సృజించినాతని లలితకరాంబురుహకౌశలము పొగడఁదగున్

వ. అని యుభయపార్శ్వంబుల కూర్చున్న యయ్యిరువుర నుపలక్షింపుచు పృథుపృ
థాపావిశేషంబున సన్నుతో నన్నగధరుం డిట్లనియె.

ఉ. పాండవు లుర్వరావలయ భారధురంధర తాప్రవీణు లు
ద్దండ భుజప్రతాప మథితద్విష దుత్కరుఁ డందులోన నా
ఖండలనందనుండతఁడు గాదిలిపుత్రుఁ డతండు దత్సమా
నుండగుఁ గాన నీతని కనూనకృప న్శశిరేఖ నీఁదగున్.

చ. అనిన జనార్దనుంగని హలాయుధుఁ డిట్లను నీదు మానసం
బునకుచితంబయొద్ది యది పూనియొనర్పఁగ నాకు భద్రమా
మనలకనుంగుదోడు గుణమాన్య సుభద్ర దదీయసూతిఁ జే
రొకనఁదగువాని కీసకియఁ గూర్చుట జూడఁగ మేలుగాదొకో.

గీ. హలధరుండిట్లు పలుకఁ బ్రియైక సరస, వచనవిస్ఫురణకుఁ గౌరవప్రియోద
యావసరమునఁ బొంగు సుధాబ్ధివీచిపగిది ముదమునఁ బొంగి సుభద్ర పలికె.

ఉ. చెట్టతనంపు వైరుల నశింపఁగఁ జేయు సుధీజనాళిఁ జే
పట్టి సమస్తసంపదల భాసిలఁ జేయ మహీతలంబునన్
బుట్టినపుణ్యమూర్తులు భూరిగుణాఢ్యులరై చెలంగు మీ
కిట్టిమహానుభావులకు నేను సహోదరిగాఁగ నోచితిన్.

ఉ. శ్రీవిభవాభిరాములయి చెన్నగు నగ్రజులార వాక్పురం
ధ్రీవరు నేభజింతుఁ గులదీపకులౌ సుతులెన్న నాకు ధా
త్రీవనితాకృతుల్ దెగడు దివ్యతనూజు భగత్వకాంతిరే
ఖావిధులం గరంబలరు కన్యల మీ కుదయింపఁజేయఁగాన్.

ఉ. మున్న గనాఁగఁగల్గె నలుమోముల వేల్పుకృపం దనూజుఁడు
ద్యున్నలినాంబక ప్రతిముఁ డవ్వల నారతివంటి రూపసం
పన్నిధిసన్నికుఁ గల్గె బలభద్రకుమారిక యోర్తు దాని నే
మన్ననఁ గేలఁ గూర్తు నభిమన్యునకందు వచించితి సభన్.

మ్మఁదను బంధుగణము కాంతాజనంబు, వినఁగఁ బలికె నపలికెది యనుపమాన
మానసావాలజనిత సమ్మదలతాళి, తానసంపదకును దోహదంబుగా దె.
అదియునుంగాక భవదీయ కరుణాకటాక్షవీక్షాలబ్ధప్రభావుం డగు పురందరనం
దనుం డిచ్చుటికి నన్నను పునప్పుడు

తెలియఁగ రోహిణీతరుణి దేవకియున్ మొదలైన ముఖ్యకాం
తలు హితబంధుసజ్జనగణంబు వినంగ సభక్తి రామకృ
ష్ణులఁగని పల్కె మామకతనూజునకాశశిరేఖ నిచ్చి ని
ష్కలకృపతోఁ గరగ్రహము సల్పుట యొప్పిద మెన్ని భంగులన్.

పర్వతభేదనాదిక సుపర్వ కృతస్తుతిమోదితాత్మకుల్
సర్వవసుంధరావలయ సాధుజనావనదీక్షు భూరిదో
ర్గర్వవిరోధిశిక్షు నభిరమ్యులు మీ కొరు లీడె సంతతా
ఖర్వభవత్కృపాకలనఁ గాదె మమున్ సిరులూనియుండుటల్.

అని తన మాటలుగా మీతోను నెఱింగింపు మనిన విన్నవించితి మఱియును

ప్రమద మెసఁగ సకలబంధులుజూడ మీ, తోడవియ్యమంది తుహినధామ
రేఖఁబోలిన శశిరేఖ కోడలుగాఁగ, నాత్మఁగోరుదాన ననవరతము.

అనిసుభద్ర యిట్టు లసదృశశైరీష, కుసుమపేశలోక్తి నెకసమెసఁగఁ
బలుకఁగాఁ బ్రలంబభంజను డక్కజ, నయసముఖ్యులపుడు వినఁగఁ బలికె.

బలభిత్సూనుని సవ్యసాచిని నిజప్రాణేశుగాఁ గొన్న గా
దిలి తోబుట్టువవీవు మాకగుటఁ బ్రీతిన్ మత్కుమారిన్ భవ
త్కులచూడామణి నీతనూభవున కిత్తుం దేవతల్ మెచ్చ రం
జిలుముక్తామయహారవల్లిఁ దరళశ్రీఁ గూర్చు చందంబునన్.

అనుటయు సంతసిల్లి విజయాంగన బల్కెఁ బ్రలంబవైరిఁ గ
న్గొని శుభకీర్తిజా సత్యవచ… వు గావున నమ్మియుండు దా
న నని మురారినుం దొడఁగ… నాశశిరేఖ మౌళి మూ
ర్కొని ప్రమదాశ్రుకందళ నిరుద్ధవిలోచన పంకజాతయై.

మెఱుగారుకప్పు పెన్నెఱు గొజ్జఁగిసురుల్ కమ్మనెత్తావులు గుమ్మరింప
నపరంజిరవల తోరఁపుకమ్మపంజుల తళుకు లేఁ జెక్కులఁ గలయఁ బ్రాఁక
గొనబు నెమ్మొగము గ్రమ్మిన చొకాటపుముంగురులరంగు చీకట్లు నలవరింప

సాంద్రసంపాదిత సౌగంధికస్రజలు సల్లగలువరేకుల చాయఁ బోలఁగజాఱియ
గవఁగొనఁగ నిజకర్ణవతంస మెసఁగఁగు, గలచనుంగవ పైరఁగుఁ గానుడివ
గడగడవడఁకెఁ బరిమళంబు గడలుకొనఁగ, వనితయభ్యంతరావాసమునకుఁజనియె.

మ. చని నిచ్చల్ తలిదండ్రు లగ్రజులు హర్షస్ఫూర్తి మన్నింప నం
దనుఁడుం దాను హృష్టభోజనపదార్థ స్వర్ణభూషాంబరా
శన శయ్యా సుమమాల్య చందన ముఖానేకవస్తు సౌఖ్యంబులన్
దినరాజిన్ ధృతిఁ గాలమట్లు గడపెన్ నిండారు మోదంబునన్.

వ. అంత నొక్కశుభవాసరంబున దేవకీవసుదేవ యశోదా నందాదులు రామకృష్ణాదిసహోదరులు యదు వృష్ణి భోజాంధక పరిభృతిబంధులును [illegible] సుహృదమాత్య పురోహితాది విద్వజ్జనంబు కేసువేర సగౌరవంబుగా నానారత్న విచిత్రభూషణాంబర సుగంధానులేపన కర్పూర తాంబూల మధురఫల కుసుమ హారిద్రాదిసత్కారంబుల నాసుభద్రి నానందంబునొందించిన నచ్చంచలాక్షి సవినయభాషణంబుల సముచితంబుగా నందఱ వీడ్కొని తనయుండుఁ దానును మణిచిత్రస్యందనంబున నారోహణంబు సేసి పరివారంబిరుగెలంకుల నడువ

మ. అమలస్ఫాటికకాంతిమద్విపుల హర్మ్యద్వీప శృంగార హ
ర్మ్య మనోజ్ఞాలయ దీప్తవీధికలఁ బౌరగ్రీహపాళీనము
ఖ్యమహాజంతుకదంబ సమ్మిళిత రంగద్వారకాపట్టణో
త్తమదుర్గాంబుధి వేఁక వెల్వడి సుభద్రాలక్ష్మి సొంపంబునన్.

ఉ. ద్వారవతీపురం బిటుల యంగన వీడ్కొని నూనసౌరభో
దారవనప్రదేశముల నద్రిశిఖాకటకప్రదేశవి
స్తారభయంకరాటవుల శారతరాంబుజలాశయంబులన్
జూరెల నాళ్ళుబల్లియలు జూచుచుఁ బోవఁగఁ బోవ నొక్కచోన్.

గీ. వనరుహదళాయతేక్షణ యనఘసర్వ, జనకదంబక సుఖరమాస్పదము భువన
మానవీయంబు గవ్యాత్తిమానమైన, సుందరారామ మొక్కటి జూచె నె.

మ. కనినారంగ సువర్ణసాల కదళీ ఖర్జూర మాకంద చం
దన ముఖ్యద్రుమ ఫలప్రసూనదళసంతాన ప్రహృష్టద్విజ
స్వనసంక్రాంతము బద్ధకైరవ సరస్సారభ్యసంబంధి శో
భన మందానిల కాంత మివ్వనిఁ గణింపంశక్యమెవ్వారికిన్.

క. ఈవనము శుకాదికవులఁ, తావనము సుధారసోపమాంచిత సరసీ
జీవనము సకలమునిసభ, సేవన మఖిలార్థగాళిజీవనముగదా.

చ. అనుపమపల్లవైకగణికావృతమున్ గురువిందసాలశో
భనకరమున్ శ్రుతిప్రియపరభాషిత సద్విజమున్ దశాన్వితం
బగు వనంబు చూడ్కికిఁ బ్రమోదముఁ గూర్చె నాసువేయ ప
త్త్రనమునఁ దెల్వియిట్టి దెచటం గలదే యని సన్నుతింపుడున్.

చ. జలనిధిమేఖలావలయ సర్వనృపాల జయేందిరాళికిన్
తల పరివారయుక్తముగఁ దాను పృథాసుతవైఖరిన్ గోరి ని
శ్చలమతిఁ జేరెనోయనఁ బ్రసన్నమదలీల జనుల్ భజింపఁగాఁ
గెలకుల వచ్చె నాత్మపురికిన్ విజయాంగన సత్వరంబుగాన్.

ఉ. వచ్చి మణీహిరణ్మయనివాసముఁ జొచ్చి సుతుండుఁ దాను వి
వ్వస్పునిఁ గాంచి గేల్మొగిచి ద్వారక కేగినభద్రవార్త లా
మెచ్చొదవంగఁ జెప్పి యొలమిం బితృసహోదరబంధులాదిగా
వచ్చటఁ గల్గుసజ్జనుల నందఱ సేమముఁ దెల్పి వెండియున్.

వ. అభ్యంతరమందిరంబున నయ్యంబుజాక్షి సకలోపభోగంబు లనుభవించుచుండె నే
తద్వార్తఁ గుంతీధర్మజప్రముఖులు విని పరమానందకందళితాంతఃకరణులై యుం
డి రయ్యర్జునుం డఖిలసుహృదమాత్యబంధు విద్వజ్జనసమ్మతం బగునొక్క శుభ
వాసరంబున భువనమాన్యసౌజన్యు నయ్యభిమన్యు విద్యాభ్యాసంబు సేయించిన
నతండు

చ. విని కఱచెన్ షడంగయుతవేదము సర్వపురాణశాస్త్రముల్
ఘనమహిమాస్త్రశస్త్రపృథలక్ష్యవిభేదనమున్ గదాదిసా
ధనసమరప్రవీణతయు దంతితురంగరథాదిరోహణం
బును మొదలైనవిద్యలు సముజ్జ్వలబుద్ధి విశుద్ధచిత్తుఁడై.

. నేర్చిసమస్తవిద్యలిటు నిచ్చలుఁ గ్రీడికి సాసుభద్రికిం
గూర్చినరాజబంధుహితకోటికి సంతసమావహిల్ల స
ప్తార్చిసదగ్రతేజుఁడు బలాంతకపౌత్రుఁడు వొల్పె సంగతా
ర్యార్చితశుభాంకరూప నవయౌవన సంపద నంతకంతకున్.

సీ. అబ్ధివేలాపరీతాఖిలోర్వీభార ధౌరేయ భూరి దోర్దారుదారు
లతిశాస్త్ర నిస్త్రింశశతధార ధారాభిహత శత్రురాజపర్వతకలాపు
లకలంకకీర్తిమౌక్తిక వరసృగ్భూషి తాశావధూకైశికాభిరాము
లశ్రాంతవిశ్రాణసాసార పుషిత విశ్వంభరామర్త్య భూజప్రకాండు
లసదృశప్రాజ్య సామ్రాజ్య హసితశక్రు, లసమబాణోపమానసర్వాంగ సౌకు
మార్య తారుణ్య లావణ్య మాననీయు, లింపెసగుచుందు రిపాండవు లేవురెలమి.

ఉ. వారలలోనఁ బెద్ద గుణవంతుఁడు శాంతుఁడు నిత్యసత్యభా
షారతుఁ డర్కతేజుఁడు వసంతసమాగమఫుల్లమల్లికా
శ్రీరమణీయకీర్తినిధి సింహపరాక్రముఁ డాశ్రితావనో
దారదయాధురంధరుఁడు ధర్మతనూభవుఁ డొప్పు నున్నతిన్.

సీ. వ్రాయించె నేరాజు వర్ధితజయశుభాక్షరపంక్తి దిక్తటస్తంభరాశి
రూపార్చె నేరాజు క్రూరకోపదవాగ్ని వీరశాత్రవ వంశ విపినవాటి
నిండించె నేరాజు నిరుపమకీర్తి కర్పూరంబు బ్రహ్మాండ భూరిపేటి
మాయించె నేరాజు మహిత దానా రుణఘృణి దీననిబిడదారిద్ర్యతమము
రమ్యచరణాంబుజముల కారాత్రి గలుగ, నెరపె నేరాజు భూమిభృన్నికరమకుట
మణిగణనిరంతర శ్రీల మహిఁ జెలంగు, నతఁడు సుగుణాంబునిధి పాండవాగ్రజుండు

క. ఆపాండుసూనుఁ డఖిల, క్ష్మాపాలురచేత నుపదగా ధనమణిభూ
షాపటదంతితురంగక, లాపములం గొనియె దోర్బలస్ఫురణ మెయిన్

ఉ. అరిఁగొనియిట్లు రాజనివహంబులొసంగఁగ రాజసూయ మ
న్వరమఖ మాచరింపనగు వాంఛదలిర్ప సుయోధనాది భూ
వరతతికేశవాది యదువర్గము సర్వసుహృత్సుధీపరం
పరఁదగువారలం బిలువఁబంపెనతండు సగౌరవంబుగన్.

ఉ. వారలుగాంచనాభరణవస్త్రములాదిగఁగల్గువస్తుసం
భారధురీణులై చరథమత్తగజాశ్వములెక్కి దిక్తటీ
వారముశంఖకాహళరవంబులు బోరుకలంగదు
ర్వారచమూసమేతముగ వచ్చిరి వేడుకఁదత్క్షణంబునన్

ఉ. వచ్చినరాజబంధుబుధవర్గములం దగుచోట్ల నిల్పి వి
వ్వచ్చుని భీమునిం గవలవారిననుంగులఁ బంపియుద్యతుం

గ్రచ్ఛజనాత్మమందిరములన్ విడియించె హృదిష్టభుక్తిమై
మెచ్చదవించి తాను వారి మించినవేడ్కఁ బసించెఁ గద్దెలన్.

వ. ఆసీనులై యన్యోన్యప్రణయపూర్వకమధురభాషణంబులఁ గొంతప్రొద్దు గడపి వాసుదేవునింగని పాండవాగ్రజుండు రాజసూయం బనునొక్క మహాధ్వరంబు విధ్యుక్తక్రమంబుగా భవదీయానుమతంబు నాచరింపం బూనియున్నవాఁడ గర్తవ్యంబేని దత్తద్వస్తుసంభారంబులకధ్యక్షుండవై యయ్యప్రయోజనంబులం దగువారల నియమించి యింద్రాదిసర్వసుపర్వబృందంబున కుత్సవంబుగా నమ్మహాసవనంబుఁ జేయింపుమనిన నానందకందళితహృదయారవిందుండై యమ్ముకుందుం డిట్లనియె.

ఉ. మానితబాహువిక్రముఁడు మారుతసూతి మహాస్త్రశస్త్రవి
ద్యానిపుణుండు క్రీడిగవలద్భుతశౌర్యసమగ్రులౌ త్వదీ
యానుజు లిట్టివారలు సహాయులు గాఁదగునీకుఁ దక్కిన
న్నభినుత రాజసూయ మొకభూవరమాత్రుఁడు సల్పనోపునే.

క. నావిని ధర్మజుఁడు త్రిలోకీవినుతచరిత్ర తావకీనకటాక్ష
శ్రీవలనఁగాదె మచ్చేతోవాంఛలు సఫలమగుట దుర్గమభంగిన్.

చ. అని వినయోచితోక్తుల మురాంతకుఁ దేల్చి పృథాతనూజుఁడ
వ్వనజదళాక్షుతో సభకు వచ్చి యమాత్యపురోహితాది స
జ్జనులను జూచి యధ్వరము సల్పుట కొక్కముహూర్తవాసరం
బనువుగఁ దెల్పుఁడన్న విని యాసభికుల్ శ్రుతిశాస్త్రపద్ధతిన్

సీ. పదిసెంచి యొకశుభైకదినంబుఁ దెల్ప నాఁడధ్వరతంత్రసమార్జ్యవేది
కాశాలికా పశుకాండ యూపారణి స్రుక్స్రువ ఋత్విక్పురోహితాది
యాజ్ఞికనికరంబు నాయితం బొనరించి శ్రుత్యుక్తవిధి రాజసూయమఖము
సల్పి సవత్సగోశతకోటి బహుధనభూదానముల సర్వభూసురులకు
సంతసముగూర్చి యవభృథస్నానకలిత నిర్మలతఁ దత్తదుజ్జ్వలాశీర్మహోక్తి
యుతముగా నౌదలలశుభాక్షతములూని ద్రౌపదియుఁ దానుఁ బొల్చె నారాజసుతుఁడు

చ. సువమతి రాజసూయము జగద్విదితంబుగ నిట్లొనర్చి య
య్యవనిపుఁడు భూమిపాలుర సముంచిత కాంచనభూషణాంబరా
ద్యనుపమవస్తుసత్కృతుల నందఱఁ దేల్చి సగౌరవంబుగా
ననిచిన వారలాత్మనిలయంబుల కేగిరి సంతసంబునన్.

గీ. కుంతిపెద్దకొడుకుఁ గూరిమిఁ గన్గొని, శౌరిపలుకె రాజసంఘమునకు
సలుపరాని యట్టిజన్నంబుఁ జేసి సు, స్థిరయశంబుఁ గంటి ధరణి యందు.

క. అనిపలు తెరగుల ధర్మజు గొనియాడి యతం డనుజ్ఞఁ గొని ప్రీతి మెయిం
దన మిత్రబంధుయుతముగఁ, జనియెం ద్వారకకుఁ బాండుసంభవు లనుపన్.

వ. అంత సుయోధనుండు.

సీ. మాణిక్యఖచిత హర్మ్యకవాట కుడ్యగేహముల నింద్రప్రస్థ మలరుటయును
మనుజనాయకులు సామజరథ్యరథవధూ ప్రభృతుల నుపదగాఁ బట్టుటయును
త్రిభువన స్తవనీయ విభవసంభృత మయదత్తమణిసభ దనరుటయును
ఘరసాన్నదానాది సత్కారముల భూతధాత్రి సురావళిఁ దనుపుటయును
రాజసూయాధ్వరావసరమున ధర్మ, రాజుసుతు మందిరమశేష రత్నధాన్య
ధనవసన భూషణాది పదార్థ, సమితి, కిరవగుటజూచి యాత్మ సహింపలేక.

క. శకునియు దుశ్శాసనుఁడును, సకలబలంబులును గొలువ సరభసముగ వీ
టికరిగి ధర్మజుఁ డనుపఁగ, వికలాత్ముఁ డగుచు దుర్వివేక స్ఫురణన్.

గీ. కరిపురికిఁ బోయి ధృతరాష్ట్రుఁ గాంచి పాండ, వాగ్రజుని రాజసూయ మహాధ్వరోత్స
వక్రియముఁ జెప్పి కౌరవ వసుమతీశుఁ డలశకున్యాదిమిత్రులఁ గలసి పలికె.

ఉ. పాండుని యగ్రనందనుఁడు ప్రాభవము స్సిరిగల్గి భూమి భృ
త్కాండము లెల్లవస్తువులు గానుకలిచ్చి వినమ్రవృత్తి నొం
డొండ భజింపఁగాఁ బుడమి నొడ్లకు నబ్బఁగరానియట్టి యు
ద్దండ మఖంబొనర్చి పరమస్థితి నుండుట మీరుగంటిరే.

ఉ. ఆతని వైభవంబుఁ గనినప్పటినుండియుఁ జిత్తవృత్తి యం
తే తలపింపరానికత నికొక్కనియున్నది మత్ప్రభుత్వ వి
ఖ్యాతి తదీయలక్ష్మికి శతాంశము బోలదు మీరు వామొజన్
భీతమనస్కలౌట వినుపించితి మీకుఁ దగంగ నెంతయున్.

వ. అడవిని సౌబలుం డను విసాళనభుక్తిని లక్కయింటి చి
చ్చున నడవిన్ హిడింబముఖశూర నిశాటులచేత నేమిట
ద్దనువులు వీడ కిట్టిసిరిఁ దాల్చి పృథాసుతు లుంట వామనం
బనవరతంబు నీహృదయ పట్టుచు నుష్ట్రలిసంగ్రహించె నున్.

క. అని వెట్టిదపుశ్వరగ, దీరఁగ నాకయుపమ వెదకితిం జూదమున
న్నోరిన వారల సిరిగొని, కారడవి వసింపఁ బనుపఁగాఁదగు బెలుచన్.

మ. ఇదిపక కేన్మ్రతియొంకః పాయమున భూమియిష్ట త్కుమారాజ్య సం
పద బెంపొందినవారి లచ్చిగొన వేభంగు వ్విచారింపఁ గా
దు దృఢస్వాంతుఁడవై కడంగి కపట ద్యూతక్రియ న్భూరి భూ
భృదరణ్యంబుల కంపి పాండవుల నీ వీధాత్రి యేలందగున్.

చ. ఆనవిని సంతసిల్లి హృదయంబునఁ గౌరవరాజు పొంగునం
దనులఁ దదాప్తుల న్సముచితంబుగ రానియమించి కుంభజా
ది నిఖిలసాధులోకము మదిన్వెఱఁగందఁగఁ జూదపున్నెపం
బునఁగొనియె న్పృథాతనయ భూమిసమేత సమస్తసంపదన్.

ఉ. అప్పుడు ద్రోణభీష్మకృపు లాదిగఁగల్గిన సభ్యులాత్మల
న్నొప్పిరిగొన్న ఖేదమున మోముల విన్నదనంబుఁ దోపనే
చొప్పువలంచి కైతవపుజూదమున న్సిరిగొంటి రిట్టి పెం
పొప్పదు పాండుపుత్త్రుల నయోజ్జ్వలులంచు వచించి రాసభన్.

గీ. శకుని దుర్బోధ కౌరవక్ష్మావిభుండు, మాయజూదంబువలన సమస్తరాజ్య
లక్ష్మిగొన నిట్లుదుఃఖాతులత్వయుక్త, హృదయుఁడై యంతపాండవాగ్రేసరుండు

క. తమ్ములు ద్రౌపదియును దుః, ఖమ్మున వెనువెంటనడువఁ గనుఁగవ నిండం
గ్రమ్మినజల మొత్తుచు డెం, దమ్మున నడరూని ధర్మతనయుఁడు సనియెన్.

వ. మఱియు నత్యంతశోకపరితప్త మానసుండై ధౌమ్యుండు దోడనడువఁ గరినగరం
బు వెడలి యెరికిం జేరరాని యొక్క ఘోరారణ్యంబున నిలచి రంత.

ఉ. అచ్చటిసింహ ఖడ్గ శరభాదిక వైపినజంతుసంతతుల్
దచ్చికడల్ ప్రతిధ్వనులు దాత్తతరంబు మదంబు పెంపుసొం
పచ్చుపడంగఁ జేయుచోద లాత్మపురీమురజారవంబులై
మెచ్చొదవించుఁగాని బెడమింపగలేవు భయంబు వారికిన్.

ఉ. ఆదృశభీమకానన మహీస్థలసంతతి కోర్చిపాండుపృ
థ్వీశయితాత్మజుల్ నిలిచి విశ్రితపర్ణకుటీరవాటినై
పాదజసం బొసంగు సరసంపు ఫలంబులుఁ గాయగూరలు
న్స్వాదరలీల బుచ్చికొని యన్నముగా భుజియింతు రెప్పుడున్.

ఉ. విశ్రుతభోగరాజ్య పదవీచ్యుత పాండుతనూజు లిట్లు దృ
ష్టశ్రీపూర్వకష్టపుదశ న్వనభూమి దురంతశోకభా
రాశ్రితులై చరించుటయు నమ్మురవైరి యెఱింగి యకటా
యీశ్రమ కెట్లు బాసి సుఖియింతురొ వారిల యెన్నినాళ్ళకున్.

వ. అని చింతించి దారుకుం బిలచి పాండవు లరణ్యంబున నున్నవారు వారలం జూడఁబో వునది యరదం బాయితంబు జేసి సత్వరంబుగాఁ దెమ్మనవుడు నతండు సైన్యసుగ్రీవ మేఘపుష్పబలాహకంబుల నమర్చి గరుడధ్వజం బెత్తి రథంబుఁ దెచ్చి సమ్ముఖంబున నిల్పిన నమ్మహానుభావుండు రథారోహణంబు జేసి పరిమితపరివారుఁడై నిజపురంబు నిర్గమించి ద్వైతవనంబునకుం జనుటయు.

ఉ. ద్వైతవనీ మునీశ్వరులు దవ్వులఁ గన్గొని రత్నకాంచన
స్ఫీత శతాంగమధ్యమున శిష్టజనావను లోకరక్షణ
ఖ్యాతయశోవిహారి దనుజారి వసంజని తెల్ప ధర్మజుం
డాతతభక్తి సోదరులనంప మురారికి సమ్ముఖంబుగన్.

శా. చేరన్వచ్చిన భీమపార్థుల దృఢాశ్లేషంబునం దేల్చి యెం
తేరాజీవ శరోమాకృతులు మాద్రీనందనుల్ మ్రొక్కఁ గా
గారామొప్పఁ గరంబులం దిగిచి యక్కుం జేర్చుకొం డంతలో
ధీరాగ్రేసరు ధర్మజుం గదియ నేతెంచెం బ్రమోదంబునన్.

గీ. కదిసి యభివాదన మొనర్పఁగా యుధిష్ఠిరుఁడు కరాంబుజముల నెత్తి కడుఁ బ్రియంబ
దొరల ఋషులతో నొకకుశాస్తరణవేది. నునిచి కుశలమారసిన నయ్యనఘుఁ డనియె

మ. సకలోర్వీ పరిపాలనోత్సవ దశా సంపూర్తి శోభిల్లుతా
వక చిత్తాబ్జ ముదాత్తసింహశరభ వ్యాఘ్రాది నానామృగ
ప్రకరాభీలవనీనివాస కృశతా ప్రాప్తిం బ్రవర్తించె నె
న్నికొన నారి సుయోధనప్రబల దుర్నీతి ప్రభావంబునన్.

మ. సరసీజేక్షణుఁ డిట్లు ధర్మసుతు నాశ్వాసించి పక్ష్మాలయాం
తరవాసిన్యైన ద్రౌపదిని గానంబోవ సంప్రీతి వే
గిర మయ్యింతి కుశాసనోపరి జగత్క్షేమంకరోద్యద్దయా
పరమూర్తి న్వసియింపఁజేసి కుశలప్రశ్నోక్తులం దేల్చినన్.

సీ. త్రిభువనానందసంధాన విభవశాలి, యగణితానంత కళ్యాణ సుగుణపాళి
వివిధమునిబృంద హృదయారవింద హేళి, ఘోరఖలమాళి పాంచాలిఁ జూచిపలికె.

చ. కరము ప్రియంపుఁటింతు లుడిగంబులు సల్పఁగ మేల్పసిండియు
ప్పరిగెల తాంతపుంబుఁ బ్రుప్పైఁ బవళించి యుపాంతరత్నసం
జరశుక శారికల్ మృదువచస్సరణిన్ వెలయింపఁగా నిరం
తరము సుఖించు నీ విటఁగనందగితియ్యుటజస్థలంబునన్.

గీ. కూరలాకులె యుగను గుడిచి మొఱపసేల, గటుదర్భపూరితపుఁబ్రుమీఁద
మేనుచేర్చనయ్యె మానినీమణి కౌర, వాధినాథు దుర్నయంబుకతన.

చ. అనుచు మురారిఁ జూచి ద్రుపదాత్మతనూభవ రూపకీర్తిశో
భనగుణ విక్రమోన్నతులు పాండుతనూభవు లిట్టివార ల
య్యనుపమరాజ్యభోగము సమస్తము వైరులపాలుజేసి యె
ల్లనరులు నవ్వ నీయిడుమఁ బడనోచిరిగా జనార్దనా.

క. భువనత్రయరక్షాగా, రవశాలివి నీవ మిగులఁ బ్రాపని తమలో
వివరింపుచునుండెడు పాం, డవులకు నిటువంటి సంకటపుపాటొదవెన్.

క. అనుటయు హరి యను వినుమం, గన దైవము సేత నాకకాదంబురుహా
సనపురహరులోపరుడా, వినడఁపననుభూతివలన నీకిటులుఁగదుగా.

ఉ. ద్వాదశవత్సరంబులు దివంబులు రాత్రులు బాంధవుత్రుల
న్మేదురభక్తిఁగొల్చి మది నిండిన యిద్దురవస్థకోర్చి ధా
త్రీదయితాంగనల్ నిను నుతింపఁగ వన్నియకెక్కె మమ్ము శా
తోదరి? యంచుఁబల్కి శమనోద్భవుఁడాసి యనంతరంబునన్.

చ. దనుజవిరోధిపల్కె వనితాజనతామణియా సుభద్రత
త్తనయు జగత్ప్రశస్తనయు ధర్మజ! నీరజనీవరాన్వయా

జ్ఞ? నెనరుబూని నీవు పనుపంబనఁ బన్నగఁ గూర్మిఁ జూడఁగా
ననయముఁ గోరుచుంద్రు హృదయాబ్జమునం దలివంశ్రులెంతయున్.

వ. అనుటయు ధర్మనందనుండు

క. ఆపదలఁ జెరచి సాంద్రద, యాపరమతి వగుచు మముఁ గృతార్థుల జేయన్
జూపట్టువేల్ప వీవసు, మా? పురుషోత్తమ! త్రిలోకమాన్యచరిత్రా.

శా. నీచిత్తంబునకెద్దియిష్ట మది చింతింపంగఁ గర్తవ్యమై
తోఁచుం మాకని యాసుభద్ర గుణవంతుండైన సౌభద్రునిన్
వేచక్రాయుధు మ్రోలనిల్పఁగ దయానిర్ణిద్రభావుండతం
డాచామీకర రత్నకీలితశతాంగారూఢులం జేయుచున్.

ఉ. ఉల్లముపల్లవింపఁగ సహోదరుఁడాత్మరథంబుమీఁద మే
నల్లునిఁ దోఁడబుట్టువుఁ బ్రియంబుమెయిన్ వసియింపఁజేసి యె
ల్లెల్లఋషుల్ పృథాతనయు లెంతయు దవ్వనుపంగ రా దయా
వెల్లి తదృష్టిఁ గన్గొనుచు వీడ్కొని వారి రథాధిరూఢుఁడై.

ఉ. చారుసువర్ణరత్నమయ సౌధశిరోగృహకుడ్యమందిర
ద్వారకవాట గోపురవితానములన్ విలసిల్లుచుండు నా
ద్వారకకేగి శౌరి మును దాను శతాంగముడిగ్గుచో సుభ
ద్రారమణిం దదాత్మజుని గ్రక్కునడించి ముదంబెలర్పఁగన్.

వ. తోడికొని యభ్యంతరావాసంబున కరిగి కుమారసహితంబుగా నమ్ముద్దియఁ దల్లి దండ్రులయొద్ద నునిచి యప్పుండరీకాక్షుం డుచితకార్యంబులం బ్రవర్తిలుచుండె.

క. నావినిజనమేజయధా, త్రీవరుఁడప్పైలమౌని మృదుమధురవచః
శ్రీవినుతి సల్పి మునివర, యావలికథ నాకుఁ జెప్పుమని యనుటయున్.

మ. అతిదీనార్థినికాయలోచనచకోరాత్రేయ! సర్వంకష
ప్రతిభాధికకృతకార్తికేయ! సమరప్రత్యర్థి నిర్భేదనో
ద్ధత కౌక్షేయ! సుధీజనావన దయాధౌరేయ! లోకైకశా
శ్వత సామ్రాజ్య రమావిజృంభణ నిరస్తస్వఃపురీనాయకా.

క. పంకజదళనయనా! మీ, నాంక! దురవలేపవిలుఠదరి హృదయశిలా
టంక! విజయేందిరా సమ, లంకృత నిజదోర్వ్యటంకలాలిత మూర్తీ.

పంచచామరము — ధరామరావనా! బలాహృతద్విషన్మహా వసుం
ధరా! మరాళవాహధీసనాథ! శ్రీయశో నిరు
ద్ధరామరాజరాజితాద్రి ధామ! సన్మనోనిబ
ద్ధరామరాజదంఘ్రి సంతత ప్రచింతనాదృతీ.

గద్య — ఇతి శ్రీ భ్రమరీమల్లికార్జున కరుణాకటాక్ష వీక్షాలబ్ధ సరస
సాహితీధౌరేయ యాత్రేయగోత్ర పవిత్ర మంగళగిరి నరస
యామాత్యపౌత్ర తిమ్మయామాత్యపుత్ర సుజనవిధేయ
ఆనందనామధేయ ప్రణీతంబైన విజయనందన
విలాసంబను మహాప్రబంధంబు నందుఁ
బ్రథమాశ్వాసము.
శ్రీ. శ్రీ. శ్రీ.

—0—



శుభమస్తు.

అవిఘ్నమస్తు

# విజయనందనవిలాసము.



(ద్వితీయాశ్వాసము.)

——(0)——

శ్రీమద్వేంకటకృష్ణధ, రామహీశారమణ! రిపువిరామ! జయశ్రీ
ధామ గుణస్తోమ దయా, స్థేమ కళాధామ మతులిత చిరతరకీర్తీ.

గీ. అవధరింపుము జనమేజయక్షమాధి, వల్లభోత్తమునకుఁ బలుకె సల్లలితమ
రందకందళమాధురీరసధురీణ, మృదుతరోక్తులఁ బైలమునీశ్వరుండు,

వ. అంత

ఉ. తుమ్మెదచాలుడాలు వలఁదోఁపియుకురుల్ బలుదమ్మిరేకులన్
ఱిమ్ముకటాక్షముల్ పసిఁడినిగ్గుల కగ్గొనరించు మేను గుం
దమ్ములఁగేరుబల్వరుస తమ్ములదాయి నవల్చుమోమునం
దమ్మునుగల్గు నర్జునినినందనుఁడయ్యభిమన్యుఁడొప్పఁగన్.

ఉ. కేళివలనుండి చూచి శశిరేఖ చెలుల్ జగదేకరూపల
క్ష్మావిభవాభిరాముఁ డనఁ జెన్నగునీతనికే సుమాముదం
బావహిలన్ సుతున్ బరిణయంబొనరింతునటంచు సీరి మి
త్రావళితోడఁ బలుకెననయంబు సుధామయభాషణోచితిన్.

ఉ. అలతకూన నాయళికులాలక నామృగరాజమధ్య నా
లోలకురంగశాబకవిలోచన నాకలకంఠి నాశటి
న్మాలిక నారథాంగకుచ మండల నాచిగురాకుబోఁడి నా
బాలిక నివ్వధూకుసుమబాణున కీయఁదగున్ బ్రియంబునన్.

మ. అనిపల్కారయ సుధారసోక్తుల మనోహర్షంబు సంధిల్ల ని
ట్లను వాదింపుదు నన్నచో నహరహం బప్పలుకుఁ లాలించి య
ర్థనమానుండు బలాత్మజాతయును మెచ్చుల్ బూని మోహంబు పెం
పున నన్యోన్యనిరీక్షణోత్సవ సముత్ఫుల్లాననాంభోజులై.

సీ. పనిలేనిదైన గల్పనఁ జేసికొని సుభద్రాప్రసూనాను చెంతలకు నేగు
నేగి తటాలున నెదురైనఁ దొరయు సిగ్గున దలవాంచి కన్గొనలఁ జూచు
జూచి రాకొమరుని సొబగి భ్రమసి మాటిమాటికి వలపు నెమ్మదిని నిలుపు
నిలిపి యవ్వరరూపనిధితోడ నెన్నఁడు గూడి క్రీడింపగల్గు ననితలఁచు
దలఁచి మనమున నతని సౌందర్యభాస్వ, దభినవాకృతి నచ్చొత్తినటుల వకఁ
గొని సుమారీశిరోమణి కుసుమబాణ, బాణపీడితయగును మ్రిప్పాటుఁ గాంచు.

క. కన్యాశిరోమణియు నభి, మన్యుం డనవరత మిట్లు మానససంభూ
తాన్యోన్య మోహవిభ్రమ, సన్యస్తవివేకధైర్య చాతుర్యములన్.

వ. అంత

సీ. నిలయపంజరకీర కలరవంబు లెసంగ వెలఁదిపలుకులంచు వీనులొగ్గు
గమనీయమణిపుత్రికలచెల్వ మీక్షించి యతివసోయగ మిట్టిదనుచు నెంచు
నబలానుబింబభాగ్యములనోచిన సముజ్జ్వలదర్పణశ్రీల సరసమెలయు
ననబోఁడి నడచిన నవ్యలాక్షారాగ చరణాంకగృహమధ్య సరణిఁ దిరుగు
నంకమున నిల్పి సుభ్రాంశుభాగరూప, చిత్రఫలకంబుఁ గన్గొనుఁ జిత్తజాత
శాతశరజాత వేదనా స్వస్థహృదయుఁడగుచు నారాజనందనుఁ డనుదినంబు.

చ. కుసుమసువంటకంబుఁ గననోర డొకింతుక నూనశయ్య దా
ల్పఁడు మణిభూషణచ్ఛటలఁబొందడు మైసుగంధంబుఁ జాదక్రొ
మ్మ్రుడి సవరింపఁ డాప్తులకుముచ్చటజెప్పఁ డతండు నెమ్మదిన్
ముడిగొను బాలికానుగతమోహతతి మోముకుళీకృతాక్షుఁడై.

చ. రమణివిలాసరూపరుచిరత్వ నిరీక్షణ మోహవిభ్రమో
ద్యమము నిజాంతరంగమున నగ్గలమౌట సహింపకేగ భూ

రమణసుతుండు పాన్పుఁడిగి రమ్యలతా ఫలపుష్పమంజుల
ప్రమదవనాంతరాళ పరిభాసినికుంజ కుటీరవాటికన్.

చ. చనియట శీతలానిల వశచ్యుతసూన రజఃపరిదీప్త నూ
తన శశికాంత వేదిఁ బరితాపభరంబున మేను సేర్చి యొ
య్యన సురసాలసాల నికరాప్త వనప్రియ కీరశారికా
నినదము లాత్మ్రకుమ్మలిక నింపఁగ నచ్చటుఁ బాసి దిగ్గనన్.

ఉ. లేచి నిదూర్పుగాడ్పు లళిప్రకరంబు నదల్ప నొక్కెడన్
బూచికరంబు గమ్మవలపుల్ వెదచల్లు నికుంజపుంజము
ల్చూచి యొకింత డాయు చవిలోలత రంగదనంగశస్త్రశా
లాచయముల్ గదా యివి తలంప నటంచు నతండు వేఁకన్

మ. కళికల్ లేఁదలిరాకుజొంపములు జొక్కంబైన కప్రింపుతీ
ప్పలు బూగుత్తులు నంటులున్ లతికలు న్పద్మావళుల్ భృంగముల్
నలినాక్షీతనురూపసంపదలఁ గన్పట్ట న్నిరీక్షించి య
బ్బలభిత్పౌత్రుఁ డనూనమోహపరితాపం బూను డెందంబునన్.

వ. ఇవ్విధంబున మధుర మరంద ఫల కుసుమ కిసలయ లతావిసర పరిభ్రాజితోద్యాన
శుక పిక శారికా కలకలారవంబులఁ గులుకుచు నుత్ఫుల్ల కమల కహ్లార సౌరభోల్లస
త్కాసార సలలిత తరంగ డోలికా మాలికాందోళిత కాదంబ శాబక కదంబంబుల
లాలించు జోలపాటల యొఱపు నెఱపు రంగద భంగ భృంగీసంగీత ప్రసంగంబులకుఁ
గలఁగుచు నితాంతకంతు శరసంతాపితాంతరంగుండగుచు నుపవనంబున సౌభద్రుం
డు విహరింపుచుండునంత.

చ. అలఘుతరార్జునాత్మజుని యౌవనరూపవిలాస లక్ష్మి చూ
డుఁడుల కమితానురాగ మొనఁగూర్పఁగ జూచుకతంబునన్మది
గళవళమొంది చిత్తజుని కాకల కోర్వఁగలేక రేబగ
ల్చిలుకలకొల్కి తల్లడిలు సెజ్జపయిం జెలులూరడింపఁగన్.

సీ. చివురాకుపెదవి వాచవికైన దరికిడాయఁగనీదు మధురోపహారములను
గ్రేఁగంటనైన వీక్షింప దాసన్నసంఫుల్ల కైరవ నవాంభోజములను
మఱచియైనను గేలమన్నింప దభిరామ వాసనాన్విత పుష్పవల్లరులను
నెట్టకేలకునైన నెదనలందదు సారఘనసార సాంకవ గంధములను

బలుకరింప దొకప్పుడు పంజరాంతరాళ శారికాకీరపరంపరలను
గుసుమ శరచాప షట్పదీ గుణరవంబు, సొరిదినంతత వీనులు సోకికలికి.
ఉ. పంకరుహాంబకుండు మదిఁ బాయక లోవెత బెట్ట నాత్మప
ర్యంక లతాంత కోరకము లాతనిఁ గ్రొమ్మెరుగారు దూపులై
కింకలఁ బెట్టఁగా వలిసఖీమణు లివ్విడనాడి యక్కురం
గాంక ముఖీశిరోమణి నిజాయతనంబుఁ దొరంగి చెచ్చెరన్.
చ. బలితపుగబ్బిగుబ్బగవ భారము సైపక కౌనుదీవ సం
చలతవహింపఁ బెన్నెఱులు జారఁ గటీతట బద్ధ మేఖలాం
చల మణికింకిణీ చరణ సారసనూపుర విస్ఫుటారవం
బు లెసఁగఁ గేళికావిపినభూమికి వచ్చె విరాళిఁ దూలుచున్.
చ. ఘనశశికాంత వేదికలఁ గప్రపుఁ గమ్మరజంపు గుంపు నిం
డిన సుమనోమరందతటినీతటుల న్జెలువంపుగాడ్పుతో
నెనసినవాంబుశీకరము లెల్లెడఁ జల్లుసరిత్తటంబుల
న్ననవిలుకాని వంతలఁ బెనంగి లతాంగి చరింపుచుండఁగన్.
ఉ. సారసువర్ణరత్నమయసౌధములో విరిపాన్పుమీఁద శృం
గారవతీ శిరోమణిని గానక తత్తరమంది బిత్తరుల్
మారశిలీముఖ వ్యథఁ గుమారిక సైఁపకయొంటిఁ గేళికాం
తారనికుంజ పుంజసదనంబుల కేగెనొకో తలంపఁగన్.
క. అని మది నెంచుచు నిలువక, యనుపమితారామసీమ కవ్వనజాక్షుల్
చని శశిరేఖాన్వేషణ, జనితాత్యంతానురాగ సంరంభమునన్.
సీ. కలకంఠకుల కంఠకలనాద కలనాదరణ యోగ్యసురసాలరాజి పజ్జ
నవభృంగరవ సంగత విశాల లవలీలతాకుంజసదన సంతతుల సరస
సుకదంబకకదంబ సుమగుచ్ఛకలితాచ్ఛ ఘృణికాంతయు తవితర్దికలమీద
బిసజాతవిస రాతతసరోనికర మానిత ప్రాంత కదళికాతరుల నడుమ
మంజుతరగోస్తనీ కాయమాన మండ, లాంతరాకల్పిత సుశీతలాంబుయంత్ర
పార్శ్వనిర్మిత సుమతల్పభాగములను, సరసిజాననఁ గానక యరసియరసి.
మ. తొగనెత్తావికొలంకునీటిచలువల్ తోడ్తోఁ బయింగ్రమ్మఁ గో
జ్జఁగిపూదేనియ యేటి కాలువదరిన్ జాబిల్లి రానిద్దపుం

జిగి వళుకొత్త వితర్దిఁ దెమ్మెరలు మైనిండింపఁ గర్పూర ధూ
ళిఁ గరంబూరిన పుంతలుం బొదలు నాళీకాక్షి వీక్షింపుమన్.

క. చేరఁ జని ప్రియవయస్యలు, గూరిమిఁ దళుకొత్తఁ గుసుమకోమలిని సుధా
సారమధుర మృదువాచా, పారీణత నూరడించి పలికిరి నెమ్మిన్.

చ. సగసిజగంధి మమ్ము నిమిషం బెడఁబాయనిదాన వౌంటి నే
తెఁవృన నాటతోఁట కరు దెంచితివమ్మ మరందవారి ని
ర్ఝరాయ లెటు లీదితమ్మ ఘనసారపు తిప్పల నీపదాబ్జ మే
కరణిఁ జరించెనమ్మ కొరగాములు సెల్లునటమ్మ యింతికిన్.

ఉ. ఇమ్మహి లేఁతజవ్వనపు టింతులు కాంతులఁ గోరరమ్మ చి
త్తమ్మునఁ దాల్మి వీఁడి పరితాపము లిట్లు వహింపనేకు నా
యమ్మగునమ్మ యింతవల పొరడి పుత్తురటమ్మ నెమ్మదిన్
దిమ్మరి మాగు బారి కిటు తెంపువహింతు రటమ్మ కోమలీ.

ఉ. చందనగంధి! కుందనపు చాయల సోయగముల్ హసించు నీ
యందపు మేని సొంపు మదనాంబకవహ్ని శిఖాచయంబునం
గం దెగదమ్మ నెమ్మొగము కైవడి జాబిలిఁ గన్న తమ్మి మా
టికిం దలపించెనమ్మ ప్రకటింపకుమమ్మ కడింది చైదముల్.

చ. బలుశిఖి నెమ్మి చిల్క ప్రతిపక్షి సమీరుఁడు చిమ్మరీఁడు గో
యిల నెరినిప్పుకల్ గురియు దృష్టిభుజంగమ వేణిబింబమం
జులమగు మోవి బుష్పసమశోభితనూలత బాణిపల్లవం
బుల విలసిల్లు నీవిపుడు ముద్దియ రాఁదగునే వనోర్వికిన్.

చ. అనుచు ముఖాబ్జ మెత్తి నయనాశ్రుకణంబుల నొత్తి యున్నత
స్తనయుగమధ్య హారమణిజాలముఁ జక్కఁ ఘటించి నీప్రియుం
డనవరతంబు గూరిమి బయల్పడ మిక్కిలి గారవింపఁగా
నెనసెదవమ్మ సంపదల నింతుల నందఱికంటె మేటివై.

ఉ. బాలిక! విస్ఫురచ్చికురపాళిక శాధరితాసితాంబుభృ
న్మాలిక! చందనాదికఘనద్రుమశోభితకేళికావనీ
పాళికఁ గమ్మ పూఁబొదలపజ్జఁ జరింతము రమ్మ టంచు మ
త్తాళికచల్ నవాబ్జరుచిరాళికఁ దోడ్కొనిపోయి యంతటన్

ఉ. అసదృశగంధబంధురతరానిలనిర్గతఫుల్లమల్లికా
కుసుమపరాగశోభిత నికుంజములన్ సురభిత్వసంపదు
ల్లసితసరోజకైరవకలాప సమేతసరోవరంబులన్
బ్రసవమరంద నిర్ఝరులపజ్జఁ జరింపఁగఁ గౌతుకంబునన్.

సీ. కొదమతుమ్మెదపిండు చెదిరినట్లడవారె నలినేక్షణలు హేమనాసలగుటఁ
బగవత్తి రాచిల్క పరిమూలలకు నేగె ముదితలు సాంకవామోదలగుటఁ
దరలి రాయంచమొత్తములు మానసమొందెఁ జెలువలు నీలాభ్రచికురలగుట
మదరథాంగకులంబు చదలు దారికిఁబోయెనబలలు చంద్రికాహాసలగుటఁ
దత్తరంబున నిజరజోవృత్తిమాసి, పొదలు నెత్తావి గొజ్జఁగిపొదలు దూరెఁ
జారుమలయాచలమరుత్కిశోరకంబు, లలుకఁబోఁడులు భుజగరోమాళులగుట.

సీ. పొగరుగుబ్బలతోడఁ బొత్తుజేయఁగ జాలు ఫలజాలముల నేల డువిచెదమ్మ
కలికిలేఁగోళ్ళతోఁ జెలిమిబూనఁగఁడంగు కోరకంబుల నేల గోసెదమ్మ
యడుగుచాయలతోడఁ గడునెయ్యమునమించుఁ జిగురుటాకుల నేల చిదిమెదమ్మ
మధురోష్ఠరుచులతో మైత్రిఁదాల్చి పొలంగు నలరుదేనియ నేల చిలికెదమ్మ
సరసబాహులతోడ నేస్తమున వెలయు, ఫలలతాసంతతుల నేల గలచెదమ్మ
యనుచు నన్యోన్యచతురవాక్యప్రసంగ, సంగతుల బోఁట్లు వనకేళిసలిపి రప్డు.

చ. జలరుహగంధి నేఁచునళిశాబకకోకిల కీరమండలం
బుల మదమత్సరాగ్రహ సముజ్జ్వలతల్ సడలించురీతి ను
త్పలదళనేత్రియోర్తు సుమపల్లవపక్వ ఫలప్రకాండముం
బెలుచఁగలంచె గోరఁజిదిమె న్నలుదిక్కులవైచెఁ జెచ్చెరన్.

శా. కేలంగైకొని పూవుగుత్తు లొకపంకేజాక్షి లీలాగతిన్
బాలారత్నము నోర్తునైవ నెద నంటందాకి వ్రాలె న్వెసన్
మ్రోలన్ దత్కచరీతి గోడి చరణాంభోజంబులం బెక్కుచం
దాలం దామచయంబు వేఁడుగతి నంతర్భృంగ నాదార్భటిన్.

క. ఈరీతిఁబలు వెరంగుల, నారీతిలకంబులిట్లు నాతికిశ్రంగా
రారామక్రీడాకల, నారతిచేఁ గాలయాపనము సేసి యటన్.

సీ. నాళీకనాళాగ్రనాళీకవద్భూరి డోలీకృతోర్మిరింఛోళి సహిత
మంగీకృతాంభోజ భృంగీకృతాభంగ సంగీతమాధురీసంగతంబు

శీతానిలకిశోర ఘూర్ణితాంబుజ పరాగజాతావృతాష్ట దిగ్జాలకంబు
తీరామ్రకదళీఖర్జూరామలకముఖ్య సారాగసుమనారి సౌరభంబు
చారుతరశీతలాంభః ప్రపూరమునర, దానిరాకృతసురగో సుధారసంబు
గాంచుచకోకౌఘ కలకలారవ వికీర్ణ, మగునాకానాక కాసార మరసి చెలులు.

గీ. అనిమిషానోదకర భువనైకభూతి, మంగళకరాబ్జరేఖాసమగ్రతయుఁ జ
నాభినుత రాజహంస రథాంగయుక్తి, గలిగి హరుఁడనమిందు నాకొలనుడాగి.

చ. వెలిజిగికట్టుపుట్టములు విప్పి సరిత్తటి నిల్పి పావడల్
పులినకటీప్రదేశములఁ బూని జతల్ గొని యల్లనల్లనన్
గొలనికిడిగ్గి రక్కుసుమకోమలు లంఘ్రిసరోజయానకా
శలము దరిపన్ ఘటించఁ బెలుచం దదుపాంతమరాళజాతికిన్.

శా. ఈరీతిన్ సలిలాకరాంతరమునం దింతుల్ ప్రవేశించి యొం
తేరాజీవముల న్గలంచి తోగలం జెండాడి శైవాలవ
ల్లీరాజిన్ బెకలించి మత్తమధుపాళిం దోలి చంచన్మరా
ళీరత్నంబుల బెట్టనిల్చి జలకేళీలోలతన్ గ్రాలఁగన్.

చ అప్పుడొకబోఁటి కాంచనమయంబగు కొమ్మున నీరునించి యొ
కకుపాలతిమీదఁ జిమ్మ నది గ్రక్కునదోయిట మోముగ్రమ్మ చోఁ
జపలమృగాక్షి కేల్గవపసన్దగి జాబిలిమున్ను గొన్న ని
ద్దపురుచు లిమ్మటంచు నొగిదమ్ములు దామరికట్టెనోయనన్.

ఉ. ఆయమృతాంశు బింబముఖు లందఱునీరము జల్లులాడినల్
చాయలఁదక్కుచాగ్రఘనసారమృగీమద కుంకుమద్రవ
శ్రీయుతమైసరంబు విలసిల్లెఁ బరస్పరమైత్రిగూడఁ గం
గాయమునా సరస్వతులకైవడి లోచనకౌతుకంబుగన్.

చ. అతులసరోవరోభయతటాముల నూతనపత్త్రకోరక
ప్రతతినవాంబుజా కరశరత్ప్రముదా నికరానుబింబ సం
తతు లెసఁగెన్ బరిస్ఫురితతత్తనురూప నిరీక్షణోత్సవా
గతఫణిలోకయౌవతముకైవడిఁ జూపరకద్భుతంబుగన్.

చ. జలకములాడి యిట్లు జలజాతముఖుల్ జలజాకరోపరి
స్థలికరుదెంచి చేలములు దాల్చి నెఱుల్దడియొత్తి కప్రపుం

గలపమలంది కస్తురిఁ గాటుకఁ దీర్చి మృగమదంబునం
దిలకము లూని ఫాలముల దీప్తవిభూషణ భూషితాంగులై.

సీ. అలకలు వడిఁ దూర్చె వరుణాక్షి యొకతె ముం బరమిచ్చె నొకతె యంబరవలగ్న
కూర్చెఁ గంచుక మొకతె కుండలిరోమాళి కమ్రపూసరు లూన్చెఁ గొమ్మ యొకతె
కజ్జలకచ యొకర్తు కాటుక నలరించెఁ బరిమళించి డెనొకతె పద్మగంధి
గుణరత్ననిధి యొకర్తు మణిభూషలునిచె వీవన వీచె నొకతె పావనచరిత్రి
చంద్రముఖి యొకర్తు నెమ్మేన జంద్రమలఁదె, బూనెనద్దము ముకుర కపోల యొకతె
యొకతె లతకూన తెలనాకులొసఁగెఁ గూర్మి, జననుతనయకు రేవతీతనయకు పుడు.

శా. శాణోల్లీఢమనోజరాజ నిశితాస్త్ర శ్రేణులో నాఁబ్రసు
శ్రోణుల్ రత్నవిచిత్రభూషణసమారూఢ స్వదేహద్యుతుల్
రాణింపన్ ఫలపుష్పకోరకరసప్రాలంబనానాతరు
శ్రేణీచ్ఛాయల సంచరింపుడు మనస్సీమానురాగంబునన్.

చ. సొలపు వహించి నిల్చి రొకచో మలయాగమరుత్కిశోరసం
చలితతమాలసాల ఘనసారపటీర కదంబనింబమం
జులవనవాటి కాంతరవిశుద్ధసుధాకర కాంతకేళికా
నిలయసమీపమాత ధరణీరుహమూల సువర్ణవేదికన్.

గీ. నిలిచి యచ్చోట వెండిగిన్నియలయున్న, నించియుంచిన సుమవారణీరసంబుఁ
దరళమృగశాబకాక్షులు ద్రావితావి, యంతకంతకుఁ దన్మ్రవంబావహిల్లి.

ఉ. చానలలోన నొకతె యెలజవ్వని దిగ్గన లేచి కొప్పుముడిం
బూనికమ్మ గ్రొవ్విరుల పుప్పొడిరాల బయోధరోద్ధతిం
గానుపడంక హారలతికల్ చెదరన్ జరణాబ్జనూపుర
ధ్వానముతో నటించెఁ గనుదమ్ములు చెందొవచెల్వుఁ దాల్పఁగన్.

సీ. తొలుకెంగుల్ తెగనుండి తొరఁగుముక్తాపరంపరలు నాలతల క్రొవ్విరులు రాలం
గుసుమచాపమదేభ కుంభోచ్ఛలత్కుచ శాటి నాఁబాలిండ్లఁ బైఁట చెదరఁ
జెంపమిన్నేరేకులఁ జెమరు తేర్చినన సోఁగకనుదోయి మాటికి నిల్గడలఁ బారిక
నునురాజుపలనఁ బల్లుబాకువస్నెలపోవ్రు నానెుగంబున రిత్తనవ్వు గొలఁకఁ
బృథుపయోధరభార సంభృతిఁ గలంగు, చదలనాకొను దివసంచలన మొందఁ
గరపదాంగద ఝుణఝుణత్కారమొలయ, మగువయొకతె నర్తించె మదముకలిమి.

చ. వెలఁదులు గొందఱాసవపు విస్మృతిఁబాణి సరోజవల్లకీ
లలితరవంబు పొత్తున మెలంగని గీతిక శౌరహాస్యముల్
సలిపి రనేక భంగుల విశాలనికుంజ కుటీరవాటికో
చ్ఛలదళినీకదంబ సరసస్వన రంగదుపాంగసంగతిన్.

ఉ. ఆతలిరాకుబోడుఁ లిటులాసవహీనమదప్రభూతని
ష్ఠేతుకహాసవాగ్వికృతి నృత్తకళాదివికారభూరిచే
ష్టాతురతన్ బ్రవర్తిలి తమంతనలోఁ దెలివూని సీరిక
న్యాతిలకంబుఁగన్గొనిప్రియంబునబల్కిరి మంజుభాషలన్.

ఉ. మానవతీ!సుధామధురమంజువచోరచనైకచాతురిన్
వీనులకింపుసొంపునొదవించు భవత్ప్రియకీరమిచ్చటం
గానమునిన్నఁబాసితృటికాలము దానొక చోటకేగదా
యీవనికాదుశ్శాఖలపయింగనుపింపది దేమివింతయో.

క. సురదారివియాటపాటల, సరసవిపంచీనినాదసంరంభములం
గరమలరఁగమనమిటమదిఁ గెరలి వనీభూజశుకసఖిత్వముకలిమిన్.

ఉ. వేఱొకపుష్పవాటి కతివేగమునంజనబోలు నిత్వనినన్
కాఱియ బూనిరిత్త వెదకంబని లేదిటురమ్మువోదమా
యారడిచిల్కలన్ గలసి యంతటనింతటనుండుదవ్వలం
బాఱదుకూర్మి నీవు వెనుపంబొడవైనదిగాననావుడున్.

గీ. దినదినము నావలనఫలంబెనసి వృద్ధి నలరి నేనెంత మాటాడనంత మాట
మగుడనాడ నదల్ప నేనెగిరిపడుచు, నఱిగె వనశుకరాజి నెయ్యమునఁబొదలి.

ఉ. ఆనగరానియీస్మరశరా నలవేదనఁగుందు నాకునో
మానినులార ? యాచిలుకమాటలు సూదులువోలెనెంతయున్
వీనులుగాడిపాఱు వనవీథులయందు విపక్షవృత్తిలో
నూనిమెలంగు దాని మనమూరకయుండక రోయ నేటికిన్.

చ. చిఱుతతనంబు నాటగోలె జేతనపెంచిన ముద్దుజిల్క న
న్దొఱఁగి విపక్షవృత్తి వెసనూల్కొనిపోవ వనద్రుమాళిన
కఱఫలభంగ కాంక్షల మొగంబులఁ గ్రోధరసంబుఁదాల్చి తా
మఱిమిఱిఁగుయ్యఁ గీరనివహంబెద నాయెడమైత్రిఁగోరునే.

వ. అని పలుకు శశిరేఖం గముంగొని వయస్య లిట్లనిరి.

చ. కడుపునఁ గన్నవారి పయికన్నను బెంచినవారిమీఁద నె
క్కుడు ప్రియమండ్రు కావునఁ జకోరవిలోచన యూరకిమ్మెయిం
దడయఁగనేల నేవనమునం బెరచిల్కలఁగూడియుండునో
కడువడినీదుచిల్క వెదకందగు బోదమటంచుఁ బల్కుచున్.

గీ. వనజవదనఁ దోడికొని బోటికత్తియ, లచటుఁ బాసి మఱియు నాటతోటఁ
గలయఁదిరుగు శుకనికాయంబులో ముద్దు, చిలుక కానఁబడమిఁ దలఁకితలఁకి.

సీ. కృతకాద్రికూట నిర్గత నిర్మలాంభోఝరీ తీరమాకందబృందమరసి
పరిపాకనిర్గళత్ఫలసమావృతదాడిమ మహీరుహ కదంబకముల వెదకి
మరుమచ్చలతేఁళి సరసీతటన మేరుఖర్జూర కదళికాగములఁ జూచి
జలయంత్రనికట నిస్తులసాంద్ర గోస్తనీఘనకాయమాన సంఘముల నెమకి
పొంచియెడనెడ జాజిపూఁబొదల మాధ, వీలతాదుల గొజ్జంగివిరులయిండ్లఁ
గలయ వీక్షించి యచ్చోటఁ గలికిచిలుక గానఁబడకున్కి నెమ్మదిఁగలఁగికలఁగి.

క. ఈమాటతోటలోపల, నేయెడఁగనుపింపదయ్యె నేవనమునకుం
బోయెనో చిలుకం జతఁగొని, యాయాచోటులను వెదకనగు రాఁజిలుకన్.

వ. అని బహువిధంబుల శుకాన్వేషణాయత్తచిత్తంబుల నమ్మత్తకాశిను లుండునంత
నక్కడ.

ఉ. అర్జుననందనుండు నిశితాంగజబాణవిషాదవేదనో
త్సర్జితధైర్యుఁడై చెలువదానుభజింపుచు నైందవోపల
స్ఫూర్జితవేదికం బొదలుచు న్మకరంద రసోపహాక్తులన్
గర్జిలు చిల్కఁ జూచె నుపకంఠ రసాలమహీజశాఖికన్.

క. కనుఁగొని యబ్బురపడి ది, గ్గన లేచి రసాలభూరుహాంతికమునకుం
జనితదూరపరమాలో, కనజనిత నవానురాగ కలితాత్మకుఁడై.

క. కీరములు లేవె జగతి న, పారమ్ములు దీనితో శుభశ్రీరేఖా
తారుణ్యలక్ష్మి నెయ్యది, గోరంతసమత్వమూనఁ గొనకొన వెచటన్.

క. బలకృష్ణులకిలఁగల రా, జాలు గానుకలుగ నొసఁగు శుకములు కేళీ
నిలయాంతర మణిపంజర, ములనలరఁగ వానిచెల్వములుగనుఁగొనమే.

సీ. దివిజాధిపతికూర్మిజవరాలి కేళిమందిరపాళి జక్కర దిండిపులుఁగు
పరిసతకార్ముకశాలి భామినీమృదుపాణి సారసాగ్రవిహార కీరముక్క

పంకేరుహాసన ప్రమదాసభాంగణ వరరత్నపంజరాంతరశుకంబో
రజితభూధరరాజ రాజీవలోచన నిలయంబున మెలఁగుచిలుకయొకొ
గానిచో నిట్టిసకలలోకప్రశస్త, రూపశుభలక్షణ కళాకలాపమహిమ
మహిమసలుదాని నండజకుండలమున, నవనిఁగనుఁగొంటి మేదృగుత్సవముగాఁ

చ. అడుగులు కెంపుజాఁ గిలుకుటందియ లందము బచ్చజా మెఱుం
గెడలఁగఁద్రొక్కుఱెక్కలపయి న్గలరంగు బలాశకోరకం
బడుగున దోఁచఁజాలిన ముఖారుణకాంతియుఁ జూచి నెమ్మది
న్గదుఁబ్రియమావహిల్లఁ జిలుక న్వెసఁబట్టికొనం దలంపుచున్.

ఉ. పొంచిరసాలభూరుహముపొంత వినిశ్చలదేహుఁడై కటా
క్షాంచలపాళి దానిపయి నాని కరాంబుజ మొయ్య సాచియ
ప్పంచశిలీముఖోపముఁ దుపట్టె సరోజమరందమాధురీ
ప్రాంచితవాగ్విశేష సముదారముఁ గీరము సత్ప్రచారమున్.

క. పట్టుకొనిగేలఁ గవ్వడి, పట్టి శుకము గరతలంబుపై నేరిచియీ
చెట్టునకువచ్చు కతమున, నిట్టిదిరాచిలుకఁ దొరకె నేమనవచ్చున్.

చ. అనిమదిసంతసిల్లి చిలుకాయశుకానక నిన్నునాదు సా
మ్మునికనుగొందు నాకుఁ జెపుమా యిపుడెచ్చటనుండివచ్చి తీ
వని కెటనుంకుదాన వనివార్యకృప న్ననుఁబ్రోచువారలే
మనికి వసించియుండెదరు మానుగ నున్న తెఱం గెఱుంగఁగన్.

క. నావిని దూరితభయ సీ. డావిలమతి యగుచు నతని కనియెఁజిలుక రా
జీవమరంద మధురవా, చావైచిత్రీ విలాససంగతి సెలఁగన్.

గీ. వినుము నీమేనమామకునఁగపట్టి, చెలువములపుట్టినిల్లు విశేషసుగుణ
వల్లికావాలము సతీమతల్లికయన, వరలు శశిరేఖ పేరునీ వెఱిఁగినదియ,

క. యెన్నఁడుఁజూచినయది యో, కన్నులకానందరసము గ్రమ్మఁగ నీరూ
పన్నెలఁత వాటఁగొలెఁ గూ, డున్నియును మఱచి యొప్పునను మదిఁగుందున్.

గీ. అత్తెఱఁగెఱింగి చెలితాల్మి కత్తళంబుఁ, జిగురుబాకున నరనరజేసి మనసు
దూరి యాభిమానవిత్తంబుఁ జూరఁగొనియె, నేది మగటిమి వెడవింటిరాచకొడుకు

ఉ. అంతము లేనికూర్మి నిను నాత్మఁదలంచుచు శయ్యఁబాసి యిం
తింతనరానికంతు నిశితాశుగవేదనఁ బూనిరేబగల్

జింతలవంతలన్ జివికి చేడియయొక్కతె కేళిమందిరో
పాంతవనస్థలిం దిరుగఁ బల్కరు దైవముఁ దూరుచున్నదిన్.

చ. అళికులవేణి యిట్లు విరహార్తి వసీసుమకుంజవాటిలో
సొలయుచునుండుదాని వెతఁజూడఁగనోడి మదాప్తకోటి ని
స్థలసిచరింపనీ యుపవనస్థలి కేగరుదేరఁగాంచి కే
వలకృప నన్నుఁబట్టుకొనవచ్చినఁ జిక్కితి నీదుచేతికిన్.

గీ. నలినలోచన చిన్నటనాటనుండి, కూరిమిదలిర్ప మధురోపహారములిడి
పెనుపఁబెరిగినదాన నేపెంపుశుకంబు, గాను వినుమయ్య యొకమాటకరుణతోడ.

ఉ. చక్కెరవింటివాని నెకసక్కెము సేయఁగజాలునట్టి నీ
చక్కదనంబు జవ్వనము చందముఁ గన్గొని మోహమాత్రలో
నెక్కొని వేఁడుదానిఁ గరుణింపక లాఁతిగఁజూతురయ్య లో
నక్కట నీవెఱుంగవె ఘనంగుడు జేరజ మాట నెమ్మదిన్.

మ. అనవినికీఁ డిపట్టి హృదయాబ్జము ఝల్లనఁ గీరరాజముం
గనుగొని పల్కునావలనఁ గాదె మనోజనిశాతశస్త్ర వే
దన నలగోల దాలిచెఁ గదా యికనేగతి సైఁచువాఁడ నం
చనుగతమోహదాహ వివశాత్ముఁడై యతఁడంతకంతకున్.

గీ. కన్నుఁగవమోడ్పుఁదలయూచుఁ గడలుజూచు, సారెకుసురనునవ్వుసంచలనమొందు
గరముఁ జిక్కటగదిఖుంచు దురవగాహ, సూనశరశాత శరదూయమానుఁడగుచు.

వ. ఇట్లు దురంతకంతుశర సంతానవేదనాక్రాంత స్వాంతుండై సుభద్రాకుమారుండు
న్న సమయంబున.

గీ. నీరజదళేక్షణలు సుఖాన్వేషణాను, రాగ తత్పరలయి సుమారామసరణి
వచ్చుచోఁ దమమ్రోల విప్వచ్చునను గుకోమరు కెంగేల రాజకీరమును గాంచి.

క. కంజదళేక్షణ తావక, పంజరకీరంబు గ్రిడిపట్టి కరమునన్
రంజిలుచున్నది యిఁక వెద, కంజనదీక్షింపు కౌతుకము దైవారన్.

గీ. అని యనతిదూర, మునఁ జకోరాక్షులొక్క గుజ్జుగొజ్జఁగిమాటున గొమిర నునిచి
మంజుభాషిణి యనునొక్కమచ్చెకంటి, నలసుభద్రాకుమారుఁడాయంగనను పం

మ. చని యచ్చోటఁ గిరీటిపుత్త్రుఁ ద్రిజగత్సంస్తవ్య చారిత్రుఁ గ
న్గొని కేలెత్తిడిప్పి మరందబిందుమధురా నూనానులాపోపరం

జనమై పొల్చు భవత్కరాంబురుహ రాజత్కర మాసీరి నం
దనకేళీగృహ పంజరస్థమది యిద్ధాత్రి జరాజింపగన్.

క. ఆశుకవి ప్రవరావన, కౌశలము వహించి దాని గైకొంటివి గా
నాశుకవిప్రవరావన. కౌశలము వహింప నీకుఁగర్జమకాదే.

చ. నిరుపమకీర్తిధూత రజనీకర! నీకరసీమనీమనో
హర శుక మొప్పఁగాంచి మణిహాటక కాంచికలాప మానసాం
కురిత నిరూఢలజ్జమెయి గొజ్జఁగిపూఁబొద పజ్జడాఁగి వే
గిరపడుచుండు జాలిగొని కీరము నేగొనివచ్చునంతకున్.

ఉ. నావలభేదిపౌత్రిఁ డనాహతమోహత మోనిమగ్నుఁడై
తావలమయ్యె మాటుగొన దానికి నేమి నికుంజవాటిబో
టీ వెస నాదుచూడ్కికి ఘటింపగదే జగదేకమోహినిన్
బావలవంతదీరఁగ మనంబునఁ గోరిక లూరఁ జూచెదన్.

చ. అనవినిమంజుభాషిణి నృపాత్మజ డెందము సీరికన్యకా
మనవరఝురీనిమగ్నమని మానినిడాగిన తావుఁ జూప న
ల్లన గనుసన్న నాతఁడు చలన్నిబిడేక్షణ చంచరీక పా
ళి నిగుడజేసెఁ బైపయిని లేమముఖాబ్జరసానుభూతికిన్.

చ. మునుచికురాంధకారమున మూఁగి వధూముఖకాంతి నిర్ఝరిన్
మునిఁగి కుచాద్రులూతగొని ముత్తరుల న్గన దూర్మికాచయం
బు నెనసియూఁగియూఁగి నునుపాక్కలతామర దూరిక్రమ్మఱన్
గొనకొనవయ్యె నర్జునుని గూరిమిఁబట్టి కటాక్షభృంగముల్.

చ. రమణికటాక్షవీక్షణ పరంపరలన్ ఝషపాళి యానృపో
త్తమపరిభాసితానన సుధాకరకాంతి సుధారసప్రవా
హమునకు నొయ్యనొయ్య నెదురై తదుదారకటాక్ష దృష్టిజా
లముఁబయిఁగొన్న గ్రమ్మఱి చలత్వమునన్ మునిఁగెన్ ద్రిపాంబుధిన్.

చ. మఱియు ననూనరాగరసమగ్నత నవ్విజయాత్మజుండు ప
ల్మఱుఁ దనరూపకాంతి సుకుమారతలన్ దిలకింపగొంకుఁ జి
త్తరమును మోహమున్నెనఁగఁ దన్వికుచాంతర హారపాళికిన్
వెరయు బ్రియాంగవైభవసమీక్షణఁ బొంగుఁ ద్రిపానతాస్యయై.

మ. అవనీపాలసుతుండుఁ గామినియు నిట్లన్యోన్య సర్వాంగయు
క్తవయోరూపశుభాంక వైభవనిరీక్షారాగ సంజాతమా
రవికారప్రతిరుద్ధ మానసములన్ రంజిల్ల సౌభద్రుఁ జూ
చి వధూటీమణి మంజుభాషిణి వచించెం జేరి మదళోత్కంఠతగన్.

ఉ. రాజకులావతంస? యలరాజముఖీకుల రత్నమా కళా
రాజవతంస శాత్రవుఁ దిరస్కృతి సల్పుత్వదీయరూపమున్
తేజము మున్ను విన్నయది దీప్తకటాక్ష నిరీక్షణద్యుతి
శ్రీఁ జెలువొందఁ గన్నయది చిత్తమున న్ముదమంకురింపఁగన్.

చ. చెలువకు నాటియున్నయది చిత్తము నీపయి నీయుడుంగ రెం
దలిరులయాన దాని రసదాడిక నానువజీరు కాకలన్
గళవళమొంద నీక కుతుకంబున వేగఁ బరిగ్రహింపు మా
త్మలమము బోఁట్లు సంతసముఁ దాల్పఁగఁ గాలముఁ ద్రోయ కెంతయున్.

క. అనవిని తలయూఁచి కరం, బున మెలఁగెడు చిలుకఁ జూచి పోయదవే పెం
చిననారికడకుఁ బొమ్మని, నును రెక్కలు గేలనిమిరి నూల్కొను బ్రేమన్.

గీ. ఇష్టమృష్టఫలాళిసంతృప్తిఁ దేల్చి, యంశుమదనూన మృదుగరుదంశుకంబు
నాశుకం బిదె కొమ్మని యతఁడు మంజు, భాషిణికరాగ్రమున నిల్పెఁ బ్రమద మెసఁగ.

మ. చిలుకం గైకొని వేగ వీడ్కొని భవచ్చిత్తంబునం బ్రేమ ని
ల్పులతాతన్వి పయి న్నృపాలయని యప్పూఁబోఁడి గొజ్జంగిప
జ్జలకే తెంచి తత్రిపానతాస్యసుషమా సౌభాగ్యవద్దివ్యమం
గళమూర్తిన్ శశిరేఖఁ గాంచి పలికెన్ గంభీరవాగౌచితిన్.

ఉ. కన్నియ నీవు రూపజితకంతుఁడు పార్థునికూర్మిపట్టి యా
సన్నవనద్రుమాంగణ విశాలనికుంజ కుటీరవాటిలో
వెన్నెలజేని మానికపువేదికల న్విహరింపుచున్న వా
రిన్నికటంబునన్ మనకు నెక్కుడుజాగొనరింపఁగూడునే.

చ. అనిశశిరేఖఁ దోడుకొని యచ్చటుఁ బాసి లతాంగు లేగుచో
ననిమిషరాజపౌత్రుని కటాక్షనిరీక్షణపాళి నెవ్వడిన్
వెనుకొనియెం బయోజముఖి వేణినిబద్ధసుమప్రకాండవా
సనలకు మూఁగు కేళివనసంగతభృంగకలాపమో యనన్.

శా. ఆరామామణి నీగతిం బ్రియవయస్యల్ దెల్పి యాత్మీయ కాం
తారాభ్యంతరకుంజవాటి సుమనస్తల్పంబునం జేర్చి చె
ల్వారం దారువసించి చెంతలఁ దదీయస్వాంత సంజాతదు
ర్వారానంగరుజోపశాంతి కరవాగ్వైచిత్రి వర్తిల్లఁగన్.

చ. అలఘుసదధ్వవర్తన సమాదర మూని జగత్త్రయీనమః
కలన నినుండనం బొలిచి కాలగతిం దమిజన్మపద్మినిన్
గలసిన పాతకంబపరకంధిజల ప్రవిగాహనంబునన్
దలఁగఁగఁజేయ వేగెడు విధంబున నేగె దినేంద్రుఁడద్రిసన్,

సీ. సంధ్యానటద్గిరీశ విభూషణాయత పణిఫణారత్న గభస్తులనఁగ
జరమాంబునిధిజల స్నానార్థి మునిబద్ధ తీరద్రుకాషాయదీప్తులనఁగ
గంధినాయక మదోత్కటసామజోపరి సలలితారుణ కుథచ్ఛాయలనఁగ
నధ్వగాహితజైత్రయాత్రాసమారంభ రతిపశౌర్యానలద్యుతులనంగ
దృఢనియమతత్పరావనీదేవనికర, కరపుటీక్షిప్త విమలార్ఘ్యకణనికాయ
దళితమందేహదేహరక్తరుచులనఁగ, జనము నుతిజేయసంజ కెంజాయలడరె.

చ. కనుఁగొన నేనుపద్మినుల కైవడి దవ్వులనుండ కెప్పుడిం
పౌనరెడుకూర్మిఁ దన్నెడలకుండఁగఁ జెల్లునె వారుణీవధూ
జనితనవానురాగ వివశత్వము బూనె ఘనాధ్వవర్తి యా
నినున కటంచుఁ గ్రమ్మరై సహింపక గాయ విచారశీలయై.

సీ. వరసమాగమవేళ నరసి రేచాన చన్గవఁబూయు కస్తూరి కాంతులనఁగ
సాంధ్యనర్తనకేళి సవరించు మడిగాసుమల జేని కుత్తుకతళుకులనఁగ
గమలజాండవనంబుఁ గలయంగ దిమ్మరు సమయసామజ తనుచ్ఛాయలనఁగ
నిజవిటసంకేత నిలయంబులకుఁ బోవు నభిసారికలవసనాంశులనఁగ
గొల్లయిల్లాండ్రు వయసెల్లఁ గొల్లగొనిన, మాయగొల్లని మైజిగి మాటుపఱచి
జారచోరులు మిక్కిలి సంతసిలఁగఁ, గలయవల్లడఁ గటికచీకటులు బొదలె.

చ. సరసిజముల్ ముడింగె మునుసత్పథవర్తనుఁ డౌయినుండు దాఁ
గరములఁ గారవింప సిరిఁగాంచి ద్విజేశ్వరసానుబంధబం
ధురతల మించి యీకుముదినుల్ నగ నాథవియోగఖిన్నతలో
బొరసితిమంచు బద్మినులు మూర్ఛిలి కన్నులు మూసెనోయనన్.

సీ. మందానిలవిఘాత బృందారకాపగా వీచులడిండీరఖండము లనఁగ
వ్యోమేంద్రనీలహర్మ్యపరిష్కలదత్త సారహీరోపలచ్ఛవులనఁగ
సముదగ్రతిమిరాఖ్య యమునాతరంగిణీ రసములో బెళుకుబేడిసలనఁగ
నఖిలకందర్పక్రియాకాలవైద్య సంఘటితతరసౌషధీఘుటికలనఁగ
రాజరజనీ వివాహసంభ్రమసమగ్ర, సురవధూబృంద విరచిత శుక్తిజాత
రంగవల్లికలన నభోరంగమెల్ల, నాక్రమింపుచుఁ దారకలలరెనంత.

గీ. కువలయానంద సంధానకుశలతాభి. రాముఁడై వేగఁజనుదెంచు రాజువిడియ
నమరులెత్తిన పటకుటీరమన వేల్పు, తేని దిక్కునఁ దోలి తెల్పు గానయ్యె.

చ. గురుతరమైమదిం బెనఁగు క్రోధరసంబు దయారుణద్యుతి
స్ఫురణమిషంబునన్ మెఱయ భూరితమఃకరిగర్వపాటనో
ద్ధురకిరణాఖ్య శాతనఖ ధూర్వహమై యుదయాద్రికూటభా
సురమగు మత్తకేసరికిశోరమనన్ శశిదోచె నత్తఱిన్.

ఉ. భారపువంతనూఁది కనబాసె రథాంగచయంబు దీర్ఘికా
కైరవరాజి సౌరభవికస్వరమై వికసించెఁ జీకటుల్
బేరెముగాసె పుష్పశర వీరుఁడు గార్ముకమెక్కుబెట్టెఁ జె
ల్వారె హరిన్నభోంతరస మాకలితంబులు బండువెన్నెలల్.

వ. ఆసమయంబున.

ఉ. క్రొన్ననవింటివాని విరిగోలలవాఁడికి నిండురిక్కరా
వెన్నెలవేఁడికిన్ గడఁగి వీచెడు వాసనగాలిదాఁడికిన్
జెన్నునొఱంగి సజ్జడిగి చేడియ చెంగటి కన్నెమావి నె
డన్నివసింపఁబోవ నచటన్ గలఁచెన్ శుకకోకిలధ్వనుల్.

ఉ. అచ్చట నిల్వకొక్క జలజాకరతీరము చేరితత్పయో
జోచ్చలమత్తరాళిపృతనోజ్వల గానరవంబు వీనులన్
జొచ్చిన నందుబాసి సుమనోగృహ మొక్కటిజొచ్చియుండఁగా
వచ్చెనె దీనిలోన మరువాలిక తూపులయిల్లుగాదొకో.

చ. అనివిరహవ్యథావివశమైనమతిన్ బవమానభూత నూ
తన సుమవల్లిబోలె వనితామణి ద్రిమ్మరఁగూర్మి నెచ్చెలుల్
గనుగొని చేతులంబొదవి క్రమ్మఱఁదెచ్చిప్రసూనశయ్యపై
యునిచిన లేచియిట్లనియె నుగ్మలులంగని గొందలంబునన్.

ఉ. ఏచిసుఖాప్తిఁ బాయక నిజేశులకౌఁగిళులందు నెప్పుడున్
బూచినతంగెడుల్ బలె విభూషణభూషిత దేహవల్లికా
రోచులఁ బొల్చు కన్యకలు రోయ స్మరార్తి గృశింప నింతగా
నోచితి మీరలూరక ననుంవెతలం దెరలింప నేటికిన్.

మ. దిలకింపం బ్రతిపక్షిరాచిలుక జాతిద్వేషి చైత్రుండు పూ
విలుచేదాల్పు సదామధువ్రత గుణాన్వితుండు ప్రాణంబు దా
యలు గాడ్పుల్ శశియంకకాఁడు పికమయ్యయ్యో గళగ్రాహి యి
బ్బలవద్వేషులలోన నెట్లు విహరింపన్వచ్చు నాబోటికిన్.

చ. ఎదఁ జిగురాకుబాకు గదియించెద వెన్నెలచిచ్చుఁ జొచ్చెదన్
మృదుబిసతంతుజాలపుటురిన్ గళమూన్చెదఁ బుష్పనాళిభృం
గెద నతిసాహసాప్తి గమకించి తుషారవిషంబుఁ గ్రోలెదన్
బిదప ప్రసూనధన్వి శరబీరము నెవ్వ తెలియఁద జూఁపునో.

మ. పలుమారున్సుమసీధుపాని జనితాభంగోన్మదోద్వృత్తి వ
ర్తిలుచండాళుల బల్గుణంబున బగల్ రేయిన్ జగంబంతటం
గలయంబర్వననంగభూతకృత సంతాపంబునుం బొందితో
య్యాలి నిల్పోపక హాయటంచు సుమశయ్యాన్వ్రాలె మూర్ఛాదశన్.

చ. అటీమిటి గబ్బిగుబ్బగవ హారలతల్ కదలన్ మెఱుంగుముం
గురులళికంబు గ్రమ్మ నెఱిగొప్పవయంగ నిడూర్పు నేఁడి వా
తెఱనలయింప గ్రొంజెమట దేరఁగఁ జెక్కులఁ బూవుపాన్పుపై
యొఱగినలేమఁ జూచి యడరూసిన డెందములన్ సఖీమణుల్.

క. స్మరగపాణి సంభృతైక్షవ, శరాసనానిశ విముక్తసారశరాళీ
దురహోమూర్ఛితచేత, స్సరసీరుహ యయ్యో నకట నతియనిమతియున్,

చ. చివురులఁ బాదముల్ బొదవి చేతులుఁదమ్ముల నొత్తికన్నులం
దొవలనమర్చి బాహువుల నూత్నమృణాలికలూన్చి గబ్బిచ
న్గవ విరిగుత్తులాని సిరిగంధము మేననలంది చెక్కులన్
దవిలిచి చంద్రఖండములు దన్వికిఁ జల్వలు గూర్చిరంగనల్.

ఉ. ఆరమణి సుకంచాగ్రనవహారమణి స్సగశాసిదోగసి
కూ్రరమనోజబాణతతిఁ గూరినభారపువంత జల్వలం

గూర్చి కూర్మిచెల్వ లోకకాంతయడంచి సువర్ణరత్నశో
భారచిరోన్నతాసనముపైఁ గదియించి వచించి రత్తఱిన్.

క. తరుణి మనము మెప్పింతము, మరుఁ జాపగుణీకృత భ్రమద సుమనస్తో
మధులచ్ఛికోమల మణిదా, మరుచిర నవసుందరున్ సమర్చల ననుచున్.

చ. మలయ మరుత్కిశోరహతి మవ్వఁపుఁదేనియజాలువారు మం
జులసుమకాయమానమునఁ జొక్కఁపుఁగప్రఁపుఁ దిన్నెమీఁదస
ల్లలిత నవీనసారసదళంబిడి యందుమృగీమదంబునన్
వలపులవింటివాని చెలువంబు లిఖించి విచిత్రవైఖరిన్.

మ. వరసౌభాగ్యకళాభిరామ రతితద్వామాంకమందావహిం
చిలుకుస్వామి సుధాంశులన్ సరస నాశీతానిలవ్యాళభు
క్పరభృత్కీరమరాళభృంగముల నొప్పన్ మ్రోలఁ జిత్రించి పం
కరుహాక్షీసఖులిట్లు సమ్మదసమగ్రస్వాంతలైయంతటన్.

క. సముచితభక్తిశ్రద్ధల, సుమశరు నావాహనాది షోడశపూజా
పరిముదితుఁ జేసివారా, కరమొగిన్ గుమిగూడి లేచి ఘటితాంజలులై.

చ. శరధిసుతాసుతాయ సుమచాపధరాయ రతీశ్వరాయ శం
బరమథనాయ గంధపవమానమదద్విరదాయ పాంథసం
హరణచణాయ లోకభయదాద్భుతవిక్రమభాసురాయ సుం
దరతరమానితాయ మదనాయ నమోనమయందు మ్రొక్కుచున్.

చ. అగణితభూరికాంతుల శరాసమున న్విషజాతసంగతిం
దగుగుణమూన్చి యందు సుమనఃప్రియబాణము సంఘటించి ము
జ్జగ మరువందఁగా నిజభుజస్ఫుటశక్తిసమగ్రతన్ ఘనా
ధ్వగపురముల్ మర్దించు నిను వర్ణనఁజేసెద మీశుగా స్మరా.

ఉ. ఏయెడ లేరె చాపధరు లిద్ధర నాఘను లొందు రెండుగా
చేయుదు రెంత నేరుపది చెన్నగు గన్నులవింటఁ గమ్మపూ
సాయక మూని రెండొకటి సల్పఁగజాలిన నీదుకౌశలం
బాయజుఁడైన నెన్న నసమర్థుఁడు లోకులఁ జెప్పనేటికిన్.

క. అని బహువిధముల నాక్రో, న్ననవింటివజీరు నిట్లు నయసముచితవా
క్యనిరూఢిఁ బొగడుమగువలఁ, గనుఁగొని శశిరేఖ పలికెఁ గనలుమనమునన్.

ఉ. ఓలిఁ గుజన్మమైత్రియు మఘాన్మదవృత్తియుఁ గాంచినట్టి చం
డాలుఁ బల్గుణంబుఁ గొనియక్కట తాను నిజైకధర్మమున్
జాలఁ గొఱంత చేసికొని చానల నేఁచ ననంగభావమున్
దాలిచియున్న వీనిఁ దగునా కొనియాడ మృదూచితోక్తులన్.

వ. అనియమ్మరును ద్దేశించి.

చ. ఉరక మనోజ నీ వెవరి యుగ్రుని దన్నిటలాంబకాగ్ని చేఁ
దొఱఁగి శరీరము న్మఱల దోఁచితి పాంథజనాఘవృద్ధినో
మఱి రతిపుణ్యకర్మమహిమంబుననో యటుగాక మునిక్రి
మ్మఱ హరఫాలనేత్రశిఖ మ్రగ్గుజనుల్ బ్రతుకంగ నేర్తురే.

ఉ. ఆకమలాయతాక్షుఁ డఖిలావనిఁ దాతని నూతివోట నే
నీకు సహోదరిన్ దెలియ నేరక మారకి డంగి నన్ను నీ
లోకములోన మానినులలో నొకదానిగఁ జూచి యేఁచినన్
నీకరకార్ముకంబుఁ దుదినీరసమానటు నేశపింప నే.

క. కామిని పలుదెరగుల న, క్కాముని నిటు దూఱి మాఱి కమనీయకళా
స్థేముని సోముని సుగుణ, స్తోముని వీక్షించి పలికె సొలసిన మదితోన్.

మ. సుమనస్సంతతి బోవ్రు దుం గవలయాస్తోకానుమోదంబు నెం
పమరం జేయుచు సత్పథాభిగమనవ్యాపారసర్వజ్ఞనా
ళిమణిశ్వపరిభలన్ మదారిదళనాలీఢపరిభావంబునం
గొమరై రాజన చంద్ర? నీ వబలలం గుందింప నర్హంబొకో.

సీ. నిన్నాదలధరించు నీలకంఠురునకు హాలాహలజ్వాల గ్రాలు కెంత
నినుఁ గన్నగా నొసర్చిన భామదానవరిపునకుఁ గార్చిచ్చు మ్రింగు కెంత
నినుగర్భమున వహించిన పయోరాశికి బాడబజ్వలనసంభరణ మెంత
నినుఁ దండఁ జేర్చిన నీరజనీహృదయేశున కనలప్రవేశ మెంత
మహివిషంబునకు విషంబ వృదవంబు, నకు దవంబవు బాడబాగ్నికిని బాడ
బానలమవగ్నికి నగ్ని వజ్జమథన, చల్లదన మేలనీ మేను ల్లసిల్లు.

చ. అనయమునన్ వియోగుల దయారహితాత్ముఁడవై మథింపఁ జెం
దిన కలుషంబు పేర నతినిష్ఠురమైన మహామయంబునం
దినదినమున్ గృశింపు మను ధీరత దక్కి కళావిహీనతం
గొనకొనె దుర్విహింసకులకున్ దురవస్థలు రాకమానునే.

గీ. సరసిజారాతి దుస్సహ విరహభార, పరవశస్వాంతయై యిట్లు బహువిధముల
దూలనాడు సరోజాక్షి మ్రోలనిలిచి, రమణుల తతి నాబుతు రాజుగూర్చి

చ. అలసు మనోనువృత్తి మనుపావళికిన్ బలుగాకిమూకవ
ర్తిలిపాడవైన మూఁగకు శ్రుతిప్రియవాగనుభూతి మానితా
త్మ్యలఘుత చంచలాత్మునకు నందఁగఁజేయుచు నిమ్మహావనీ
స్థలికి ప్రభుండవై తగు వసంత! నెలంతల నేఁచుటొప్పునే.

గీ. చల్లదనములకెల్ల నాస్పదమవీవు, ప్రాణబంధుండవఖిల ప్రపంచమునకు
మారగురుతల్పగులగూడి మానవతులఁ, గొండలము పెట్టదగ దోరి మందపవన.

క. బాలికల నేఁచుపాతక, శీలుండవు నీవటంచుఁ జెందినకినుకన్
నాళీకభవుఁడు నిన్నొక, మూలన్ బడవైచె నురగముల కశనముగాన్.

మ. ప్రతిపక్షస్థితిఁ దాల్చి క్రోధము దలిర్ప న్నోర్మునన్ మాటమం
చితనం బింతయు లేక యీఘనతరుల్ జేకొన్న నానాఫల
వ్రతతిన్ భంగమొనర్చుచున్ దిరుగుకీరవ్రాతమా! యేటికీ
శతపత్రాయతనేత్రి సాంకవతనూ సౌరభ్య నర్దింపఁగన్.

క. ఒకలకఁటికి సతినీ వేక గ్రీవముగ మొలఁగియేఁచఁగ రానే
లా కన్నెలఁ జేయుచుఁ బలు, గాకులజతగలై నీకుఁ గాని గుణమొగిన్.

గీ. మానితాతను మధుర ధర్మంబు గుఱుచ, పఱచి సుమనస్సమూహ సంపద హరించి
యెప్పుడుఁ గుజన్మమైత్రిచే నింపెసంగు, మధుపములకేల జెలిమీద మమతగలుగు.

చ. సరసిజగంధులిట్టులు వసంతమరుచ్ఛుకకోకిలాదులన్
బరువిడి మారిమారి విరిపాన్పునయిన్ వడయింపఁజేసియ
న్నరిసుతు సౌకుమార్యసుగుణప్రతిభా కథనానులాపవి
స్ఫురిత ముఖాంబుజాతలగుచున్ దనరార ననంతరంబునన్.

గీ. రాజుకరపీడచేఁ గుంది రహిఁ దొలంగు, పద్మినీసంతతికి నాత్మభర్త రాక
మునుఁ దెలియఁ జెప్పవచ్చినయనునిమాత, చొప్పునను పూర్వదిశ వేగుఁజుక్క వొడిచె.

గీ. జలజములువ్రాంగ గలువలచాయగ్రుంగ, రాజబింబంబు చరమాంబురాశిఁ గ్రుంకె
సింధురాజన్యరతిర్గయ చ్ఛిన్నవారు, ణీపయోధరహీర కలాపమనఁగ.

ఉ. కోకమువిందు బద్మములకుం బ్రియభర్త మురారిదక్షిణా
లోకము వేదసంపుటము లోకహితుండు విభాస్వదంబర
శ్రీకమనీయభూషణము చీకటికిన్ బగవాఁడు దోఁచె బం
ధూకసుమద్యుతిన్ వెగడు తోరపుకాంతినినుండు తూర్పునన్.

చ. మనసిజబాణసంచలితమానసయౌ శశిరేఖ నెచ్చెలుల్
వనమునునుండనీక కొనివచ్చి విచిత్రమణీనికేతనం
బున విరిపాన్పుజేర్చి నరపుత్రికథారచనానులాపశా
లినులయికాలయాపనము లేమను సల్పుచునుండి రంతటన్.

ఉ. భాసురమయ్యెఁ గేళివనపాళివిదూరితపాంథమానసో
ల్లాసము శీతలానిలవిలాసము జాతిలతావళీపరి
త్రాసముగోమలచ్ఛదశరగ్రథితపథితాంగజైత్రవే
ష్వాసము గేకినీరతిరిరాసము నా మధుమాస మెంతయున్.

మ. తలిరుంజాయల సంజకెంపొదవె మొత్తంబైఁ బూమొగ్గదు
కర్లడాల్ మించె మదాళిమండలగరుత్కాంతిచ్ఛటాధ్వాంత మ
గ్గలమయ్యెన్ శిశిరర్తుభాస్కరుఁడు గుంకన్ కమ్మపూఁదేనె
మందలమెన్ గాపిలె పాంథచక్రములు జైత్రాబ్జప్రబోధంబునన్.

మ. వనలక్ష్మిన్ వరియింపుచో ద్విజకులవ్యాహారమంత్రంబులన్
వనవేదిస్థలిపైఁ బలాశకళికావహ్నిం బ్రతిష్ఠిలచి నూ
తనమాధ్వీకృతధార మాధవుఁడు దా తృప్తిఁ గావింపఁజే
రొకనఁదోడ్తోదిశలావరించె మదవద్రోలంబధూమచ్ఛటల్.

చ. శ్రుతిహితవాగ్విభూతి పరిశోభిమహావనిమండలద్విజ
వ్రతతులనూనమాధవుకృపన్ సకలేష్టఫలాప్తిఁ గాంచనౌ
శ్రుతిహితవాగ్విభూతి పరిశోభిమహావనిమండలద్విజ
వ్రతతులనూనమాధవుకృపన్ సకలేష్టఫలాప్తిఁ గాంచవే.

సీ. కప్పుపెన్నెఱులయ్యెఁ గండుతుమ్మెదబారు లొరపుగల్గుననంటు లూరులయ్యె
నుఱుచిరాధరమయ్యె నరుణబింబఫలంబు నవకోరకంబులు నఖములయ్యె
గబ్బిపాలిండ్లయ్యెఁ గమ్మపూగుత్తులు వనరుహంబు మనోజ్ఞవదనమయ్యె
శుకపికారవములు సూక్తివైఖరులయ్యె మృగపల్లవంబులు పదములయ్యె

బాహులయ్యెలతాతతుల్ బ్రిసవరజము, గుకుకటీరనిబద్ధదుకూలమయ్యె
నాసయయ్యెను సంపంగినవవనేంది, రాజ్ఞనేత్రిక నామనియరావనమున.

మ. ఘనుఁగూర్చెన్ సుమనస్సమూహమున కామోదంబు నత్యాదృతిం
దనిపె న్మాధుకరావళిన్ బహురసద్రవ్యాప్తి శ్రిత్యుత్సవో
క్తి నిరూఢద్విజపాళి నీప్సితఫలాధీనంబుఁజేసె న్మహా
వనిపాల్లభ్యమునన్ వసంతుఁడు దయావర్ధిష్ణుభావంబునన్.

చ కలితవనక్షమావలయగంధ నిరంతరరాగయుక్తిఁ జె
న్నలరెడు పల్లవాన్వితలై యలగొమ్మలు పుష్పగుచ్ఛపా
త్రలఁ గలకల్లుబోయ వెసఁదావి మదాప్తినుదాత్తగీతికా
కలననటింపుచుండు నళిగాయకకోటి మధుప్రియంబుగన్.

చ. ఆదృతిఁదావులంటుచు రజోంశుకమూడ్చి మరందసాత్త్విక
స్వేదముగ్రమ్మగా మధుపవృత్తసితేతర రత్నదామక
శ్రీఁదగుదీవచేడియల చెన్నుగుణాప్రివ్వరిగుత్తిగుబ్బలన్
మోదమెలర్పసోలు విటముఖ్యులఁబోలె మరుత్కిశోరముల్.

చ. మలయసమీరణాబ్జరిపుమాధవులున్ సహాయులై
కెలఁకులరా మరుండు పికకేకిగళస్వనకాహళార్భటుల్
వెలయుశుకాశ్వమెక్కి వెడలెన్ బధికాహితదృగ్భయానకో
జ్జ్వలసుమనశ్శరాసనసుసంఘటితామ్రదళాంకురాస్త్రుఁడై.

ఉ. హైమజలంబులన్ జలకమాడి కటీధృతధౌతచేలలీ
లామహనీయులై పరిమళద్రవమూని ప్రఫుల్లమల్లికా
స్తోమముకంఠదేశములఁ జొన్పిమనోహరభక్తిఁదేలియా
రామములన్ సుఖింతురు పరస్పరవాంఛల భోగులత్తఱిన్.

వ. ఇట్లఖిలజనానందసంధానకారణంబగు నక్కుసుమాకరంబున నొక్కనాఁడు.

మ. అసదృశ్యస్త్రద్యుదరాతిభీమబల భీష్మాదిత్యపుత్రాద్యశే
షసుహృద్బంధుభటావళుల్ గొలువఁగా జంభద్విషత్పూర్ణభో
గసమృద్ధిం గొలువై సువర్ణరుచిరంగ స్ఫాటపశ్రోణిను
ల్లసిలం గౌరవరాజు కౌతుకవిలోల స్వాంతుఁడై యత్తఱిన్.

చ. సలలితఖడ్గశోభితుని సాంకవగంధ విభాసిగండమం
డలుని శిఖాధివాససుమనస్తుత గైరికసానురాగ న
త్యలఘువినూత్న రత్న కటకాంచిత పాదవిలాసు భూమిభృ
త్తిలకముఁ డాసి కౌతుకమతిన్ వనపాలురు గేలుమోడ్చుచున్.

చ. ధృతివిజితాసుహృద్వసుమతీ! సుమతీ! సితకీర్తిధూతరా
జతగిరిశంఖ! యేరికి వశంబగునే సుమనోధివాసభా
సితసురసాల విస్ఫురణఁ జెల్వగునిర్మలి నాప్సరస్తతిన్.
క్షితిఁ జెలువొందు నందనముఁ గేరెడు కేళివనిం గణింపఁగన్.

క. నాళీకనాళపారణ, పాళీకమనీయపక్షపవమానచల
న్నాళీకయుతమదాళీ, నాళీకలనీతిరీతి నలరుఁ గొలఁకుల్.

కవిరాజవిరాజితము.

శ్రీరుచిరసారఘనసారకరవీర తరువారములు భూరితరసౌరభములం గా
సారసరసీజ సముదాగ మధుపూర మద గౌరవ వికారసువిహారిమధులిడ్బృం
దారవవినోదముల హారిహిమవారియుత సారసులతీరముల జారుతరనానా
గారములచేరువలఁ దోరపుసమీరణకిశోరములఁ గేళివనధారుణి జెలంగున్.

చ. మృదులసరోరుహచ్ఛదహరిన్మణిభాజనరాజి వాఃపృష
త్సదమలమౌక్తికంబులిడి జక్కఁగఁ జెందొవచేతులూన్చి ష
ట్పదయువతీసుగీతికలపైఁ బయి నారతులెత్తఁ గోరుచుం
డుదురనువాసరంబు మ నినుండనినీకు వనోర్విఁ బద్మినుల్.

చ. పనిఁబడి నత్పృథంబెనసి భవ్యతరుల్ సుమనోభిరామతన్
గొనకొనియుండ వానియలగొమ్మలనంటిన పల్లవవ్రజం
బునొగలఁ జేయుచున్ ఋతువిభుండనుపంగ వనశ్రీయూవళీ
ఘనభటసంఘముల్ వెలయుఁ గా దెసహా కలనిస్వనార్భటిన్

మ. లలి లాలించి మరుద్విటుం డురుశుకాలాపాళిఁ గేళీ వనీ
నిలయాంతర్గతవల్లికానవపురంధ్రీజాతి గుచ్ఛస్తనా
వళిపైవ్రాలినలీనరుఝంకృతుల రవ్వం బెట్టి యాటాడుము
గ్ధలు ప్రౌఢాధికభావసంగతులెఱుంగన్నేర్తురే యెచ్చటన్.

ఉ. భూపవరేణ్య కేళివనభూపవమానకిశోరసంచల
న్నీపవనీపరాగతతి నిర్మలధర్మలసత్ప్రభామయూ

## ద్వితీయాశ్వాసము.

క్షోపలవేదికన్ దొరసి యుండు వియోగులకంగజాతసం
తాపనివారకంబయి నితాంతసుఖంబిడు చంద్రికానిశన్.

ఉ. కూడి కెలంకులన్న శుకకోయిలభోయలమూక నాదువా
దోడుగ వాడికోర్కివిరులతూపుల మొత్తము పచ్చవిల్లుచే
దోడుగఁ దానదృశ్యత గుదుర్కొని శంబరభంజనుండు వేఁ
టాడు వనోర్వి నధ్వగమృగాత్ములకున్ భయమావహిల్లఁగన్.

మ. తలిరుంజాయ పసిండిపూతల సముద్యత్కోకిలవ్యూహకా
హలనాదార్భటిఁ గీరతోరణ సమూహవ్యాప్తి వాతోద్గళ
త్కళికామౌక్తికరంగ వల్లికల హృద్యంబై వనీవీథి భూ
పలలామాధ్య భవత్ప్రభావభవ సౌభాగ్యంబుఁ దెల్పుం జుమీ.

క. ఇనధామ భవత్కేళీ, వనధారుణిఁ బొగడు నేర్ప వరలదు గరళా
దనధాతాద్యులకైనవ, చనఘాటినమ్ము బోటిజనులకు వశమే.

క. అనివనవిభవము బొగడ న, వ నిరుపమానోక్తి కలన వనపాలురు దా
వినివిని పటుసమిదవనీ, వినిహతరిపునృపుఁడు రాజవీరుండంతన్.

క. ఆధోరణాగ్రణి నిజా, జ్ఞాధారణకుశలుఁడై లసజ్జగతీభా
రాధారసప్తకులగో, త్రాధరసమశక్తి బంధురము సింధురమున్.

ఉ. చెంగటఁ దెచ్చి నిల్పఁ బొలిచెం గటదానలుఠత్ప్రమత్త సా
రంగము బుష్కరాంబుకణరాజి నిరంతరరాజమాన సా
రంగ మదగ్రశోణరుచి రాంకవదీప్తకుథాభిరామ సా
రంగ మనూనకౌతుక తరంగిత సర్వజనాంతరంగమై.

మ. ద్విరదోత్తంసము నెక్కె చెచ్చెర ధరిత్రీమండలాఖండలుం
డరుదెంచె న్గుధరక్త రాంకవరుచిప్రాంచత్తటిత్కాంతి బం
ధురదానోదకవృష్టి ఘీంకృతిరవానూన స్ఫురద్గర్జఁ జూ
పరకా సింధురమభ్రవిభ్రమముఁ దెల్పం దాఘనాఖ్యంబునన్.

చ. కరిచరణోద్ధతిం బుడమిగ్రిక్కిదల న్నిజకేళికావనీ
సరసిఁజనంగ వ్రాలఁదగెఁ జంపకపుష్పరజంబు గంధపుం
గరువలియవ్వెందిర తగం దనుడాయఁగవచ్చు వేలికిన్
గరమనురక్తి మున్ను పథగాఁగనకాలి శుకమంపెనోయనన్.

ఉ. ఆనరలోకలోకహితుఁ డాశ్రితచక్రిమనోనుమోద సం
ధానకరాత్మతేజ మహితక్షితి భృత్తమిరాపనోదనఁ
బై నవపద్మినీసముదయంబలరింపఁగఁ డాసెఁ గేళికో
ద్యానమనూనసూన నికరా సవమాద్యదళీనగానమున్.

ఉ. డాసిగజంబుడిగ్గి నికటద్రుమ హర్మ్యవిటంక సంగతో
ద్భాసిలతావధూజనము భవ్యతరద్విజలోకవాక్యపా
ళీసహితంబుఁ గామది దలిర్చెడు భావిఫలప్రదీపితో
ల్లాసముతోడఁ జల్ల విరుల న్నిజమౌళిఁ బ్రియాళిపాణులన్.

క. ఆలోకనములు గేళివ, నాలోకన కౌతుకంబులై వెలయ ధరి
త్రీలోలాక్షీ రమణుం, డాలోవనిలోనికరుగ నప్పుడు బ్రియమునన్.

క. ఆరామపాలురందొకఁ, డారామాంగ భవమూర్తి కనియె నఖండ
ఙ్మాత్రరామాధిరమణగను, మా రామావనివిలాస మతిముద మొదవన్.

సీ. ఇవి మత్తరోలంబ మృదుగీతికాలంబ నవలతాంతకదంబ భవనపాళు
లివి రసాలపటీర హింతాలఖర్జూర కరవీరఘనసారతరువరంబు
లివి మానసమరాళ యువతీగరుల్లోలజలజోత్పలవిశాల సరసులతతు
లివి మాధవీకుంద మృదుమల్లికాబృంద నిరుపమానమగంధ నిర్ఝరంబు
లివి సుధాకర కాంతాతిహృద్యవేది, కాసమావృత పరిమళా ఖండవకుళ
సుమరజఃపుంజములటంచు సూక్తి కలన, నవనివిభునకుఁ దెల్పెనయ్యవసరమున.

మ. సరససమీరణాంకుర వశంబునఁ గంపితయై మరందశీ
కరనవఘర్మవారి దొలక న్విరిదావులఁ గొమ్మ యొయ్యొర్తు వి
స్ఫురదళినీ కటాక్షములఁ జూచుచు సూనపరాగచేలయై
సరసకురావిభుండలరెఁ జారుఫలస్తన భారనమ్రితన్.

మ. మహికాంతుం డిటులాత్మకేళి వనసీమా వైభవాలోకనో
త్సహనుండై మృదుమల్లికాసుమలతా సౌరభ్యలక్ష్మీ వల
త్సహకారద్రుమవేదిపైనిలిచె శశ్వద్గంధవాతాంకురా
పహృతాధ్వశ్రముఁడౌచుఁ జెంగటవనీపాలుం దమంగొల్వఁగన్.

వ. అంత.

సీ. అనువుగా మస్తకంబునజటాజూటంబు గురువిందమకుట విస్ఫురణఁ జూప
నిటలస్థసురఘునీతట మృత్తికోర్ధ్వపుండ్రలత చందనరేఖ చెలువుబూన

మైవన్నె దొరసి వక్షోవనమాలిక ల్నవతారహార గౌరవము దెల్పఁ
గటిమండలీబద్ధ ఘనతరైశేయంబు గురువిచిత్రపరిధానగరిమ మెఱయ
ననిల మేళన సప్తస్వరానుగేయ, మానమృదుతంత్రి కానీతమహతిఁ దాల్చి
నాకమునుండి నారదుం డరుగుదెంచె, రాజసంబున గౌరవరాజుకడకు.

క. రాఁగవినారదముని యను, రాగనిమగ్నాత్ముఁ డగుచుఁ బ్రవిమలమణిశో
భాగురుపీఠి నలమహో, భాగురుచిరమూర్తి నునిచి పార్థివుఁ డంతన్.

క. సముపాత్తభక్తి మెయిన, ర్ఘ్యముఁ బాద్యమొసంగి కుశలమారయుచు మహో
ద్యముఁ బారదరుచిమునిస, త్తముఁ బాథోధిశయనాంఘ్రి తత్పరహృదయున్.

మ. లలితారూఢతపః కళాసురుచిరాలంకార మానీశ్వరో
త్పలినీమిత్ర! దృగుత్పలోత్సుకతఁ గూర్పం జాలె నీరాక యిం
దులకుం బోవుచు నింతువచ్చితి మహాత్ముల్ దర్శనం బిచ్చుటన్
ఫలమత్యంతముఁ బొందెగాదె మము బోఁట్లన్ ధాత్రి నూహింపఁగన్.

చ. సమధికభోగభాగ్యములు సాగరజాధరజాధిపాధివా
సముల జవాసవాసవ నిశాంతము లాసురయక్షకిన్నర
ప్రముఖజగంబులున్ దిగధిరాజపురంబులు దావకాభిగ
మ్యములుగదా! గదాధరపదాంబురుహస్తుతిపూజనాదరా.

ఉ. ఆదరణీయవైభవ సమన్వితమైనది లోక మెద్దియో
నాదరహాసభాసివదనంబున నమ్మునిపల్కె విశ్వధా
త్రీదయితేంద్ర! యెల్లెడలఁ ద్రిమ్మరి మానవలోకపీఠికా
మోదరసంబు చిత్తమున మున్నదయింపఁగ డిగ్గి యొక్కచోన్.

శా. క్ష్మాకాంతాధిప! గాంచితిం ద్రిభువనైకస్తుత్యసామ్రాజ్యము
ర్వీకంఠార్పితహారనాయకమణి శ్రీఁ బోల్చు మాణిక్య శో
భాకీర్ణాలయగోపురావరణ హర్మ్యద్వారకన్ భక్తరా
జీకళ్యాణకరప్రదీప్తగుణ లక్ష్మీద్వారకన్ ద్వారకన్.

ఉ. కాపురమప్పయోధిననుకాన్పున కాపుర ముజ్వలన్మణీ
గోపురదీధిస్థగిత గోపురమున్ మదకాలకూటరే
ఖాపుర మర్థిరాజపదలకాపుర మాపరిపూర్తిఁ సాటిగా
నోపురహింగణింపఁగఁ దదున్నతిఁ బన్నగభర్తజాలునే.

ఉ. భాసురవజ్రకోటి రుచిభారధురంధరమై యసంఖ్యరం
భాసురసాలకానన సమంచితమై బహుదానరత్నరా
డ్వాసితమై నితాంతగుణవర్గనిబోధిత నీతికాటప
ట్టై సొబగొందు ద్వారవతి కాసురరాజపురంబు సాటియే.

ఉ. ఆనగరంబు సాటిముద మాన గరంబు జగంబునందు నే
గానఁగణించి శ్రీవిభునిగా నగధారి ముఖంబు దక్క ధా
గానగరిష్ఠమై యలరఁగా నగభేదను వీటనుండి నే
గానఁగనేఁగఁదా మనుపుఁగాన గణేయదయామయాత్ముఁడై.

క. డాయనరుదెంచి మునివరు, డా! యనఘ యటంచు నన్ను నర్చావిధులం
బాయనికుతూహలతన్, ధా యని బద్ధాత్ముఁజేయఁ దలకొని నేనున్.

సీ. మొగులుచాయలవాని బగడంబు జగడంబుఁ దెగడు కెమ్మోవి సోయగమువాని
వెడఁదవక్షమువాని వెలిదామరల నోముఁగల సొగకనుదోయి చెలువువానిఁ
బసిఁడిపుట్టమువాని బలురక్కసుల పెంపు నలయింపువలయింపు టలుగువానిఁ
దళుకుచెక్కులవాని నెలసంచు నలయించు నురిపంపు లేనవ్వు మోమువాని
గొల్లయిల్లాండ్రయిండ్లలో గొల్లలుగను, జున్ను వెన్నలు మ్రిచ్చిలితిన్నవాని
గొలుచువారలతలపులో మెలఁగువానిఁ, బచ్చవిలుకానితండ్రి వానుప్రిచ్చిపొగడి.

ఉ. కాంచితి శౌరిచెంత మణికాంచికలాపకనత్కటీతటీ
కుంచితవార్ధికాంచి నలికుంతలఁగాంత లతాంతగుచ్ఛకో
దంచదురోజమండల దృగంచలచంచలతా ధరీభవ
చ్చంచలఁ బల్లవాధర రసాధర కాంచనగాత్రి నొక్కతెన్.

క. కనుఁగొని మునుఁగొనియాడుచు, దనుజవినిర్దళన! వనజదళనయన! ముకుం
ద నగోద్ధర యీకుందరదన యే చపతులకూర్మితనుజాతయొకో.

క. ఆవనజాక్షుఁడు మునికుల, పావన! యిది సీరికన్య భవ్యనయశ్రీ
లావణ్యాధన్య సుగుణల, తావాల సతీమతల్లికాభరణమిలన్.

క. కుందరదన శశిశేఖయ,నం దనరు సుమా విధాతృవందన యనవా
నందమిరవొంద నానక, దుందుభినందనుని యాజ్ఞ దొరకొని నేనున్.

క. జలనిధివేలారశనా, వలయాధిప నిన్నుఁజూడ తెచ్చితి వినుమా
గలదొకహితోపదేశం, బలఘుతరా మోదమొసఁగు నది నీమదికిన్.

చ. పలువుర యక్షకింపురుష పన్నగకిన్నర రాజకన్యల
న్లలితవయోవిలాస శుభలక్షణధన్యల నాకలోకకాం
తల నసితాలకాంతల సదా వసుధాధర! జూచినాఁడ నే
చెలువల సీరికన్య తులఁ జెప్పఁగఁ జూపఁగఁ జాలనెయ్యెడన్.

క. జలజారిషోడశాధిక, కళ యలకాధిపునవాధిక నిధానము బూ
విలుతుని యారవబాణము, జలతం గైకొనని మెఱపుసకియ దలంపన్.

ఉ. కుత్తుకబంటి నీటఁ దమిఁ గుందిది వివర్ణతఁ బంకసంభవో
ద్వృత్తి సదా వినీతియ వహించుటఁ జేసి లతాంగివక్త్రసం
పత్తికి సాటివత్తునన బద్మము జాలదుగాని సౌరభా
యత్తము సంతతద్విజకులాస్పదము న్సరసంబు గాదొకో.

చ. కలికికచాళితోఁ బెనఁగి కంధరము న్మృఖవర్ణహీనమై
తొలఁగక గబ్బిగుబ్బగవతో నెదిరింపఁగ బల్మి నెత్తుకొం
చలవుఁ బోవఁగా నదిగ శాంగక వైఖరిఁ దాల్పఁ బూని బె
గ్గిలి యటవెనక్రముస్నయి తగెన్నలనాముఖలక్ష్మి ప్రాపునన్.

క. చెలితను జఘనోక్తి స్మిత, ములు మోము మెఱుఁగు మొత్తములు వన్నెలతో
నిలతో గోయిలతో వె, న్నెలతో నెలతో దురంబు నెరపు న్సరపున్.

క. తమ్ములు వికాసలక్ష్మిఁ, దమ్ములు నయనములు పారిదమ్ములు రుచిభే
దమ్ములలరు నెఱికురులు ప, దమ్ములు మృదులారుణచ్ఛదమ్ములు చెలికిన్.

క. ధరమే చనుగవ ధారా, ధరమే నెఱిగొప్పు నవసుధాలహరీ బం
ధురమే వాతెఱ సిం, ధురమే యానంబు సొబగు తోయజముఖికిన్.

సీ. రజనీచరునకును ద్విజరాజత మధుధరులకు నతనుసుధర్మగుణత
చిరతరామోదలక్ష్మి ప్రసూనసంతతి కరులకు భువనహితానువృత్తి
జలజాతములకు శాశ్వతహంససంగతి చంచలాళికి ఘనాశ్రయవిభూతి
పల్లవతతికి భవ్యతరులతోఁ బొందు కుముదంబులకు రాజసుముఖతాప్తి
గొమ్మ మోముకీవి క్రొమ్ముడిజిగి గోళ్లు, సొగసు జన్నుదోయి సొబగు బదవి
కాస మంగదీప్తి గరతలరుచి నేత్ర, కాంతిగరిమ బూనుక తనఁగలిగె.

క. కమలారిబింబసంపద, రమణీమణి వదనసుందరత్వముఁ దెగడున్
గమలారిబింబసంపద, రమణీ నయనస్తనాధరంబులు దెగడున్.

మ. మునుపద్మాప్తతఁ గాంచు నెమ్మొగము సొంపుం జూడలేక చ్యుత
త్వనిరూఢి న్వెలసిల్లఁగాఁ బృథుకుచద్వంద్వంబు జక్రిత్వ మొం
దెను దోర్ద్వో మెఱుగారు గైకొని మధుద్విడ్భావమాష్ఠంబు గాం
చెను దాఁ గాసితకేశపాళి సుమనస్స్నిగ్ధత్వ మబ్జాక్షికిన్.

ఉ. కొంచె మదెట్టులో ర్చెనొకొ గొప్పచనుంగవ వ్రేఁగుఁగాను దీ
వంచుఁ జేరనీవ్రు నడకల్ చలదృష్టి బెడంగు మీలన
మ్మ్రించు గలంచు దుమ్మ్రదల మేచకరోచులఁ గప్పుకొప్పు గ్రొ
మ్మ్రించు నతిక్రమించు జిగిమించు తనూలతసంచు బోటికిన్.

సీ. బహుళార్తిఁ గృశియించుఁ దుహినాంశు బింబంబు పంకాప్తిఁ దనరారుఁ బద్మపాళి
నిలఘనాఘనసంజ్ఞ నెలయు వారిధరంబు గవఁ బాసి తాలఁగుఁ జక్రవలదోయి
విషసహోవిర్భూతి విలసిల్లు నమృతంబు వడిసుళ్లఁబడి కూతలిడు దరంబు
దువలనీరసములై పొదలు పల్లవజాతి మెఱసి తోడనడంగు మించుదీవ
నెట్లు సరిఁ జెప్పవచ్చు మృగేక్షణాస్య దృక్కుచపయోధరాధరగీర్వికాంఘ్రి
తనులతాకాంతి వైభవోదారతలకు, శతధృతికి నాఘణాధరపతికినైన.

చ. చెలి శృంగారరసస్రవంతి యనఁగాఁ జెన్నొందు నాకానిచో
దళుకు న్వేనలిసొంపుఁ జూపులు గుచద్వంద్వంబు నూఁగారు స
ల్లలితాంఘ్రుల్ నతనాభి ముత్తరులు నేలా తెల్పుఁ బల్మారు శై
వల వాశ్చర ఓఘాంగ భృంగ జలజా వర్తోర్మికా స్ఫూర్తులన్.

మ. క్షితిపై కాళిమగోస ముజ్వలతయున్ శ్రీసొంపు వేణీకటి
శ్రితులొంద న్ఘనకాద్రిధర్మగరిమన్ జూపట్టె బద్మాసన
స్థితి జెల్వొంద హరిత్వమూనఁ గుచలక్ష్మి చంచలాలోకనా
నృతమధ్యంబులు బోటిమే నమరె మూర్తిత్రియ్యనూనాకృతిన్.

ఉ. అంగనకొప్పు కందమున కంద మొసంగు మెఱుంగు రంగులన్
జంగునఁ జౌకళించు మెయిసంచు గటీతటిలీల నే. నే
లంగల దూరు సౌరనటులన్ దరమున్ దరనూగళంబు జూ
పంగ జవాలు వాలుగల నారడిఁ బెట్టు నయారె సారెకున్.

సీ. తరళాక్షివదనంబు సరసిజంబనరాదె తేఁబలుకులు మరందలీలఁ దేల్పఁ
గుసుమకోమలి బొమల్ గొసరి విండ్లనరాదె జూపులు బాణవిస్ఫూర్తిఁ జూపఁ

బూఁబోఁడిపాలిక్కలి పుష్కరంబనరాదె వళులు దరంగల చెలువు నింప
వనితబాహులు కల్పవల్లికలనరాదె కరములు కిసలయ స్ఫురణ నెరప
నతివనెఱిగొప్పుగార్మొగులనఁగరాదె, యొడలిజిగిసంచుక్రొమ్మించుటొరపుఁబూనఁ
జెలువ చెలువంబుఁబొగడ నీక్షింప శేషు, నకునగారికి గాక యేరికిఁ దరంబె.

సీ. మొగు లాకసంబుఁ సంపఁగిమొగ్గ దలిరులు గచమధ్య నాసికాకరతలములు
విాలు జాబిల్లి మేల్పసిఁడి వెన్నెల నయనాననాంగ మందస్మితములు
గొంప నంటులు రాజనంపుఁబొట్టలు జింద మధరోరు జంఘా గళాంగకములు
బుడమితేనియఁపొన్న పూఁబొంగరంబులు శ్రోణివాఙ్నాభి వక్షోరుహములు
మొల్లలరనెలవింట్లు దొమ్మ్రుదులుగ్రొన్న, నలు మెఱుఁగుటద్దములు దరంగలురదాళి
కభ్రుకుటికర్ణకరరుహ గండభాగ, వళులు వాక్రివ్వ భవ్య లావణ్యవతికి.

ఉ. శంపలసానబట్టి కరచాతురిఁ దద్రిజమూని యందునై
లింపవిలాసినీ తనువిశేషకశాతతి మేళవించి చ
ర్చింప సుధాకరామృతముజిల్కి యజుండు రచింపఁబోలు నీ
చంపకగంధిఁ గానియెడఁ జానలకిట్టివిలాసమబ్బునే.

ఉ. ఆశుభవాణి కాసతికి నాగుణలక్ష్మికి భర్తగాఁ బ్రజా
ధీశుఁడు రాజమౌళి యసదృక్ప్రబలారి దరాంకమూర్తి నా
యాశల గీర్తి జెన్నలరినట్టి పయోధిపరీత విశ్వధా
త్రీశుఁడు జాలుగాని గణియింప నృపాలక మాత్రుఁడొప్పునే.

గీ. రాజరాజ కుమార రాజరాజ రాజ, దుకుతరసురూప దృఢమతి చిరయశోభి
రామునకు నీడు పట్టి కారాజవదన, రమణఁగూర్చుట శుభమగురాజరాజ.

మ. సుమనోధర్మ్రధురీణతామహిమ జక్షూరమ్యసౌభాగ్య ల
క్ష్మీ మహిమోన్నతిగాంచుఁ నీతనయ రాజీవాస్త్రి రాజప్రతి
ప్రమదాసన్నిభ శోభనాంగి సుగుణప్రాలంబనా పూర్ణచం
ద్రముఖిం గూర్చుట కాంచనంబునకు సౌరభ్యంబు చేకూరుటల్.

క. ప్రమద మొసఁగనే తత్కా, ర్యమువశ్యము జేయువది ధరాధిప సందే
హము వలదించుకయుఁబ్రియ, త్నమునం దొడగుఁదనంత దైవంబనుచున్.

ఉ. అంబురుహాసన ప్రభవుఁడాతని కింకరణిన్ హితోపదే
శంబొనరించి ఏడ్కని భుజాపరిణీతవిపంచికానటా

దంబు రమాధిపస్తుతి సుధారసముల్ గురియంగ నాక లో
కంబున కేగెనంత మహికాంతుఁడు సంభ్రమితాంతరంగుఁడై.

ఉ. భూరివినీలశైలమునఁ బోల్పఁగఁ గాముల కోఁడు బోలె నా
సారసరోజరాగమణి సంయుతమౌళికిరీటహార కే
యూరపదాంగదద్యుతి సముజ్జ్వలుఁడై కరి నెక్కి సారెకున్
నూరెల వందిమాగధులు సూక్తులఁ బేర్కొనవచ్చె వీటికిన్.

ఉ. వచ్చి పురంబుఁ జొచ్చి మదవారణరాజము డిగ్గి సచ్ఛిలా
రచ్చ వసించి బంధుబుధరాజిఁ గనుంగొని కౌరవేశ్వరుం
డొచ్చను లేనికూర్మి దనయొద్దకు డాసి విధాత్రసూతి నా
కుఱిచ్చినచంద మెల్లరులకున్ వినిపించి మహేమి నావ్రుశన్.

క. గురుభీష్ములరాతిమనో, గురుభీష్ములు గురునృపాలకునకనిరి మఱం
దర సోపమసరసోక్తుల, దొర సోదరులెల్ల వినఁగఁ దొడరెడు వేడ్కన్.

క. అవనీధవ యాదవ నీ, పవనీనవనీరధరుని పాలికి సుగుణా
ర్జవ నీతి కుశల భావుల, నవనీదేవులను బనుపనగు సతినముగన్.

చ. అనజనభర్త సాధుజనతాభినుతాతతధీధురీణులన్
ఘనవసుధాసుధాశనశిఖామణుల న్ననిపెంగుతూహలం
బున హరినీలరత్నమయ భూషణపేటికి సానుమత్ప్రభే
దనపురరాజవైభవ లతావనవాటికిఁ గల్మివీటికిన్.

గీ. పనుపమానవేంద్రుఁడనుపమానవచో వి, శేషశేషఫణులు క్షితినిలింప
మణులు సత్వరముగ మహీధరఘనదరీ, వనఝురీపదమునఁ జనుచుజనుచు.

సీ. గాంగేయగిరితుంగశృంగసంపదఁ దెల్పు ఘనశివరాజమణివిభా రూఢి మెఱసి
సురపురిఁ దలపించు సుమనఃపరంపరాభినవరంభోద్యాన ఘనతఁ గాంచి
కైలాసశిఖరివైఖరిఁ జాటు ద్విజరాజ చూడాకలాప భాసురతమించి
పాథోధిరాజ సౌభాగ్యంబునూహించు కమలోదయవిలాసగరిమ నెనసి
లసదనుపమాన మానసలక్ష్మిఁ జూపు, రాజహంసవిహారగౌరవముఁ బొంది
యారపన్నగతల్పపురాగ్రగణ్య, మనుచు, బొగడుచుం గౌతుక మంకురింప.

ఉ. అన్నగరంబు భూతి పవిభృన్నగరీతులనఁ జెలంగు న
ప్పన్నగవైరి వాహపరిపాలితమైన పురంబులోని కు

ద్యన్నగరాజధీరమతు లవ్వసుధామరు లేగి యొకఁచో
నున్నగదాధరాగ్రజు సమున్నత సౌధముఁ గాంచి వేడుకన్.

క. తాలాంకు వినీలాశ్మవి, భాలాలితమైన మనికిపట్టిది కాదే
యేలా బాలారుణరుచి, జాలాంచద్ద్వారపాలజన మిటునుండన్.

క. అనియూహించి శరద్ఘన, ఘనతాభినుతాంచితాపఘను హలధరుఁ గాం
చి నితాంతార్చ్యకలనా, జనితాంతఃకరణకుతుక సంరంభమునన్.

ఉ. ధీలలితకాలవాల బలదేవ కురుక్షితిపాలమౌళి నీ
పాలికి నేఁడు బాలశశిఫాలఁ గుమారిక వేడఁబంపె మ
మ్మాలసమానసూనవిశిఖానుపమాకృతి కాత్మసూతికిన్
హాళి దలిర్పఁగాఁ బరిణయంబొనరింపు తలంపు పెంపునన్.

గీ. అప్పుడమివేల్పులిటులాడ నప్పుడమిత, సమ్మదము గ్రమ్మఁ దనసెమ్మనమ్మనమ్మ
రాసురార్యాగ్రజుండు ధరాసురాగ్రి, గణ్యులకుఁ బలికె వచననైపుణ్యమలర.

క. ధరణీజనజాతసమా, దరణీయైశ్వర్యధుర్యతా మహనీయుం
డరణవిరోధి జయశ్రీ, వరణసముత్సాహుఁడు గౌరవప్రభుఁ డరయన్.

మ. ధరణీభృన్మకుటాగ్రరత్నకిరణోదంచత్తులాకోటి సు
స్థిరదోర్దూరుదిత ప్రతాపవిజయశ్రీ మేటి విద్వన్మహీ
వరభూభృచ్ఛతకోటి యానృపతికెవ్వాఁ డుర్విపై సాటి భూ
వరకోటింగొనిరం దదాత్మజునకీ వచ్చు న్మదిన్మెచ్చితిన్.

క. అసమానరూపయౌవన, లసమాన గుమారి మతుకలమణి సుగుణమా
నసమాననీయమదిసం తస మాన గురుక్షితీంద్రతనయునకిత్తున్.

ఉ. రాజకులాగ్రగణ్యుఁడట రాజదశేషధరిత్రికెల్ల రా
రాజఁట తత్కుమారునకు రామ నొసంగుట కర్హ మాకును
తేజితశోభనంబుగలదే యని వస్త్రవిభూషణాదులం
బూజ ఘటించి యాద్విజులఁ బుచ్చెఁ గురుక్షితిపాలు ప్రోలికిన్.

క. అనుప మహీసురపుంగవు, లనుపమకౌతుకతరంగితాత్మకులై దం
తినగరికరిగి జవోద్వృత్తి నగరిపువిభూతి గురుపతిం గనియంతన్.

క. రాజకులాంబుధిరాజ!ధ, రాజనపరిపాల వినయరాజన్మతి యా
రాజవదన నిచ్చెదనని, పూజలఁ దనియించి బలుఁడు పుత్తెంచె మమున్.

క. అని హలాపిప్రియశుభదవ, చనలీలాగరిమ దెలుప శతపత్రవసహితా
శనకీలాగ్రిహ శౌరవ, జనపాలాగ్రిణి కరంబు సంతస మొందెన్.

మ. తనుజాతన్ జనతాభినంద్య సుభగత్వశ్రీసమన్వితనూ
తనరంభన్ హలి రాజరాజుజున కుద్వాహంబు జేయన్ దలం
చిన చందంబు సుభద్ర దా విని మనశ్చింతాతురత్వస్ఫురా
వనతాస్యాంబుజయై మురాసురమదధ్వంసిన్ వెసన్ డాసినన్,

ఉ. కాదనిపుద్వజుండు కనకాంశుకదీప్తలసచ్చతుర్భుజుం
డాదరి సోదరిం గని సమాదరణీయమృదూక్తిఁ బల్కె నో
సోదరి! తావకాననపయోజ మయో జిగిఁ దూలి యుంటఁగ
న్నోదరి లేనివంత బెనగొన్నగి నీమది నిక్కమారయన్.

చ. అన మును సీరపాణితనయున్ సుతయున్ శుభలక్షణోదయున్
మనసిజరూపమాన్య నభిమన్యు సమిజ్జయశోభిమన్యుఁ గూ
ర్తునని వచించె నిప్పుడు కురుక్షితిభృద్వరసూతికిఁ దలం
చెనట మనంబులో వనట జెందదొకో వసుదేవనందనా.

చ. అనవబోఁడి నూరడిలవాడి జనార్దనుఁడా ప్రలంబమ
ర్దనుకడకేగి నాకవసతా జనతాభినుతాభిరూప్యతా
లిని దనయన్ నయప్రణయలీలల మున్నభిమన్యుకేల గూ
ర్తుననివచించి తప్పను కురుప్రభు సూనునకీఁ దలంచితే.

క. భువనాధీనుతచరిత యా, దవనాయక నీతలంపు దా నితిఁగిగుణా
ర్ణవ నాఁదగు సోదరిహృ, న్నవనాళీకమునఁ జింతనాటి కలంగున్.

గీ. మునుసుధీజనంబు నినుసుముఖత నెన్న, బలుకుసూక్తి నిలిపి ప్రబలసూక్తి
మనసుభద్రసుతునకును సుతనొసఁగిన, మనసు భద్రమగును మా! హలాంక.

చ. అన హలపాణిపల్కె చతురబ్ధిపరీత మహీతలంబెంగి యె
వ్వని భుజపీఠినిచ్చలు ప్రవర్తిలు నాతఁడు మేటి తత్తనూ
జునకుం గుమారి నిచ్చుటయె శోభన మంగనఁ గన్నవారికిన్
మనసహజాతపట్టి యభిమన్యుఁడు దాద్భుఁడే గణింపఁగన్.

చ. అనవిని శౌరి సూరిజనతావనతా ఘనతాభిరాముఁడం
త నరుగుదెంచి లోకవిదితా ముదితా సుదితాశ్మిఁ బూనితో

చినగతి విన్నవించితిని చిత్తము మెత్తదనంబుఁ బొందద
య్యానఘునకిఁక నీదు తలపో హాలపాణి ఘటింపఁ డారయున్.

క. అనుజాత వినుము యుష్మ, త్తనుజాతమణిన్ వరింపఁదగినవయశ్శ్రీ
మనుజాతరూపగాత్రులు, మనుజాధిపసుతలు గలరు మహిలోఁ బెక్కుల్.

ఉ. మన్ననమూని రూపమహిమన్ ననవిల్తుని గేరు నీకుమా
రున్నగవైరిపౌత్రుని మరున్నగధీరుఁ బరాభవించెఁగా
యన్నయమూద్వహుండు దనయన్ నయశాలినొసంగ దంచుజిం
తన్నలిసేయకంగన యెడ న్నలినాదెస చైదిజూడుమా.

క. అనిదనుజాహితుఁ డనుజా, త నిజాభ్యంతరమణి సదనమున కనుపం
జని తామరసాక్షిమనో, జనితాకులతాలిపరవశత నటఁబొదలన్.

సీ. ఎదలసీధుమదంబు బొదలఁ గమ్మనిపూఁవుబొదలఁ దిమ్మరు తేటిరొదల కదరి
మొలకమామిడిఫలమ్ములకు మూఁగు శుకాళికలకలధ్వనికిఁ బెక్కులకఁ బూని
దళముకొన్న మహీజదళములంటెడు పికదళము మ్రోతలకు గొందలముఁ దాల్చి
యతులపంకజనాళరతులమించు మరాళతతుల క్రేంకృతుల కుఁదద్దనడలి
యసమశరవీర ఘోరసాయకనికాయ, వేదనాస్పదహృదయుఁడై విజయతనయుఁ
డనుపమారామసీమా విహారమెడలి, కనకమణిమయ మందిరంబునకువచ్చి.

సీ. కీలుకాఁడెడ సేయఁ గెరలిన త్రనలీల బ్రతిసీరనంటిన పత్రిమయనఁగ
నెరయఁబర్వములసంధితమంబు గప్పిన కమనీయతరరాజకళయనంగ
దరలనిఘోరసంతమసాను గతతాపమున గాసిబడిన పద్మినియనంగ
ఘనతరమధుసమాగమ దర్శనవివర్ణతావాప్తిగనుజాజితీవయనఁగ
దెలివుగోల్పడినిజమనోజలరుహాంత, రావృతనితాంత నిబిడచింతామయార్తి
నొగిలి చేష్టారహితయై వినూత్నరత్న, ధర్మమయపీఠి నున్నసుభద్రఁ గాంచి.

మ. తిలకింపన్సుమనోమనోహరకళా ధిష్ఠానమై తారకా
లలితశ్రీనిధియై సదాకువలయోల్లాసంబుఁ గావించు నీ
విలసద్వక్త్ర సుధాంశుమండల మనావిర్భూత శోభాసము
జ్జ్వలమై యున్నది యేమిహేతువిది యాశ్చర్యంబు డెందానకున్.

చ. ఉదితనయుండు ధర్మతనయుండు మహాబలజుండు విక్రమో
ద్యదురుభుజుండు సంయదభియాతి కులానిలచక్రి శక్రిదు

ర్మదరిపురాడ్యములు యము లరణ్యమహిన్సుఖులమ్మనీదు సె
మ్మది కేటువంటివంత పాడమంగళమెయ్యది యమ్మహావ్రుసున్.

ఉ. మంథరగధీర ! ఘోరరణమధ్య పరిక్షుభితార్య నీకె? నీ
కుందరళాయతాక్షి నవకుందరద న్నరదబ్జసన్నిభా
స్యందనపట్టి నిత్తునని సద్విభులా సుగుణాంబుధుల్ ఖగ
స్యందనముఖ్యులెల్ల విననాడె హాలాంకుఁడు శైశవంబునన్.

చ. అతనిశుభప్రసంగమనఘా ! మునుగొంగుపసిండివోలె నం
దతనయు నాన మానసమునం గడునమ్మినదాన నే ననా
రతమిపుడాత్మజం గురువరప్రభునూతికి నీఁదలంచి కొ
న్న తలఁపు నేనెఱింగి మదినాటిన వంతఁ గృశింతునావుఁడున్.

గీ. పాండురాజసుతులు పాండురాజసుతులు, కీర్తి నిధులు గాన నార్తిఁబొదల
జూలకఁజూచె మనల హాలపాణి దీనికే, మదినివగవవలదు మానుమనిన.

చ. మనసిజరూపకాంతి మహిమ న్మహి మన్నసమస్తబంధుస
జ్జనమతిఁగన్న కూర్మియనుజా తనుజాగ్రణి కీక యన్న య
న్యుని సుతఁగూర్పఁజూచిన సహోదరి లోఁదరి లేని వంత నూ
లొగ్రను టిదియబ్రమే జగములోఁగల కట్టడినా నతండనెన్.

చ. సిరి కెడయై లతాంగి తనచెన్నుఁదొఱంగి హృదంతరవ్యథా
భరవివశాంగియై రవిగభస్తిఁ గుముద్వతిబోలె బుట్టినిల్
జేరఁదగదొకొ వేళ విధిచోదితయై చొరబారె నేని సె
వ్వరు బ్రియమాచరింపరులవంబిది లోకముపాడిమాడుమా.

క. హాలపాణికిఁదలఁపౌ కురు, కులపాలునిపట్టిపైఁ దగులొగ్రనఁగ నయో
కులపాళికవీవిందుల, నిలపాటిగఁ జూతురే యనింద్యచరిత్రా.

క. జననావాస సుఖశ్రీ, మనసాస న్బొరయ కింక మదిఁబాండుసుతా
ననవాళీక విలోకన, మనసాసక్తి నమెలంగుమా సుకృతనిధీ.

మ. ద్రుపదాధీశ తనూజభూజన నుతారూఢకుమారా ప్తిభ
ద్రపదార్చాకలనాభిజాత చిరకీర్తింగాంచ నెంతేయర
ణ్యపదాపత్తి సహించితాద్భుశ యశఃఖ్యాతి న్ప్రకాశింపరా
దె పదార్థప్పెపసిండి వజ్రమణితో దీపించినట్లీవిలన్.

క. అనికరిగమనసుభద్రి వ, చనచతురిమగరిమ దేల్చిశరహేతిశరా
సనకవచ ధురీణుండై, కనకవసు నగరివెడలఁగాఁ దలఁచిమదిన్.

ఉ. రమ్మని తల్లి కోమల కరమ్మని వార్యగతిం దెమల్చి ఘో
రమ్మగు చిమ్మచీకటి దరమ్మణుమాత్రము లేక ధైర్యసా
రమ్మలర న్భయంకరశరమ్ము రిపోసి కిరీటిపట్టి దూ
రమ్మతి భీమసత్వనికరమ్మగు కానకు నేగియుద్ధతిన్.

వ. చని చని ముందట.

సీ. సదమలాంభఃపూర సంస్ఫాలనోన్మత్త కరటిఘీంకరణ విస్ఫురితఝషము
పరిపక్వకీచక తరుగళన్ముక్తాత్మ ముక్తారాశిధవళిత క్ష్మాతలంబు
దశదిక్చరత్ఫణాధరఫణాంతరభవ్య రత్నకాంతిచ్ఛటా భ్రాజితంబు
దవహుతాశనశిఖాగ్రవ్యామానాశేష చందనాగరుధూపసంకులంబు
భూరికుహరాగ్రనివసన్మయూరనికర, కృతరవాపాంగ సంగతోద్గీతశబర
నీలకబరీసుగీతికానిరుపమాన, మతిభయానక మొకయరణ్యంబుఁ గనియె.

చ. గనుగొని భూనభోంతరము గ్రమ్మినసంతమసంబులో వినూ
తనజజనీ తనుద్యుతి వితానవిదర్శితకాననాధ్యుఁడై
ఘనతరశైలకూటకటకప్రకటాటన జంతుమండలీ
నినద విజృంభణంబునకు నెమ్మదిభీతిల కాతఁడేగుచున్.

మ. హరిపోతుండొక మత్తేఁగన్గొనియె నుద్యద్భాతభేతాళశా
తరథచ్ఛేదిత దేహికుక్షిగణితాంత్రశ్రేణిగా స్పృగ్ఘురీ
పరివిలిప్తచ్ఛదగుచ్ఛబంధుర మదభ్రీపాద్రి శుశాఖాచయాం
తరనీడస్థదివాంధగృధ్రముఖ నానాపక్షి సంరావమున్.

గీ. కనియటవసుంధరాజాని కరము వెఱఁగు, గొని వటవసుంధరాజంబు గొంతఁబొగడి
తత్కుటచ్ఛాయనాయమదనదుమేల, జిలుగుదువ్వల్వ పఱచి వసింపఁజేసె.

క. హాలికొదవును పేత్మాహల, హాళిక వసింపంగనయ్యోనర్థకళారా
డలికకుఁ బాండునృపతికో, డలికకటా! యీనిశిన్ వటద్రుమమునెడన్.

క. జగదారాధితు హలధరు. దగదారడిఁబెట్ట విధికృతంబపిలంఘ్యం
బుగదా దీనికిమదినె, వ్వగఁదాల్పగఁజనదుస్సృతియవశ్యము వలయున్.

గీ. అనిసుభద్రపట్టి యని సుభద్రమగుభుజాశుగాసమార్వనాశుగాప్త
తులితవిశిఖమూన్చి బలితంపు ధృతి పెంపు బోదలవటము మొదలఁగదలకున్న

క. తరసాదనకులపతికా సురసాద్రిభుజాగ్రదండ చండబలుఁడు సం
గరసాహసుఁడు ఘటోత్కచుఁ డురసాధరతుల్యదేహుఁడు వసించునటన్.

ఉ. ఆనిశనాళిశాటుఁడు హితావళితో లలితోరువిక్రమ
శ్రీ నెరయన్ వలుంగడఁ జరింపుచుఁ గానవనాటి మేటివి
లాసినిసుభద్రపట్టిఁ బొడగాంచి వటాక్షితిజాంతికంబునం
దీనడిరేయి నెవ్వఁడొకొ హీనరుండిటనున్న వాఁడొగెన్.

క. సవనాశనాళికెమది యవవావనిచాయడాయ నలవియె పీనిన్
భువనాప్తజుఁడు మహానస భవనాగత శశముగాఁ గృపన్ వాకొసఁగెన్.

గీ. పృథులదంష్ట్రాభినిహతి మేనెల్లవ్రచ్చి నల్లఁ బ్రావెద బలలఖండములు గడుపు
నిండ మెసవి చిత్రగతులఁ దాండవంబు సల్పెదనటంచు ననివార్యశౌర్యగరిమ.

మ. అసదృగ్దేహరుచీమసద్యుతులతో నంభోదగర్జాసము
ల్లసదాభీలరవంబుతో శితకరాళస్ఫారదంష్ట్రాస్ఫులిం
గసమాకీర్ణభయంకరాననముతో గ్రవ్యాదసుండేగుదెం
చి సుభద్రాసుతు జూచి పల్కె వికటాక్షిణాంగలాపంబులన్.

క. ఓరీ యెవ్వరు జేరగ లేరీవనవాటి బ్రాసలేశముగొనకీ
వీరీతిరే చెరించెదు పూరీకృతధీరతాసమముజ్జ్వలమతివై.

క. అనివేలుపు నారమనుమని గనుమని వెన్నురము ముష్టిఘాతమున వగ
ల్చిన వడి నపుడుకరచి య య్యనఘాత్ముం డెరచి దిండి నరచేనడచెన్.

క. అరచేఁజరచిన గడుని వ్వెరచే నుసురనుచు నుద్ధవిడి బలుమొనలం
గరచినర కర్కసుపైక స్నెరచే నరుపట్టి పలికె నెగసిన కినుకన్.

క పరిణాహశక్తినిఁకమల్లకౌతిప్రౌఢినడచి లావనిచెద ని
న్నరుణాత్మజచరణార్చా, కరణాదరనైక హృదయ కంజాతునిగాన్.

వ. అనిమఱియు నవ్విధంబున నొండొరు లుద్దండ కోదండ దోర్దండ పాండిత్యంబులు
మెఱయ సమీప తరుషండ శిలామండలంబు లన్యోన్యపదఘట్టనంబులఁ జూర్ణం
బులుగా శరభము శరభము పుండరీకము పుండరీకము కరి కరి హరి హరి దొడరు
తెఱంగున నుత్తమాంగంబున నుత్తమాంగంబును భుజంబున భుజంబును దగుల్చుచు
బాహుదండంబులఁ బీడింపుచుఁ గూర్పరమ్ముల గ్రుమ్ముచు జానువులఁ బొడుచు
చు నఖంబులంజీలచుచు బదంబులఁ బదంబులు బెనిచి ధరణిక్రొడ్డిగిలం ద్రోయుచు
గడువడిఁ బిడికిళ్ళనడఁచుచు బెడిదంపు టడపుల వెడలు రక్తంబులం దోఁగి పుష్పితప

శిలాశద్రుమంబులం బురణింపుచుఁ జెట్టలఁగూలుట్టివడఁ బరస్పరజయేచ్ఛల ఖండ
నంబు సేయుచుండ నాసమయంబున.

మ. నిదురంగూడిన నీడఁజాలక శకుంతీసంతతుల్ బెగ్గిలెం
జెదరెన్ భూభరణాహివిస్ఫుటఫణీ శ్రేణీమణుల్ గోత్రియుల్
గదలెన్ రాల్బడియయ్యె వన్యమృగసంఘాతంబు త్రాసాకుల
త్వదశన్ నల్గడఁబాఱెఁ దత్పటుపదద్వంద్వాభిఘాతోద్ధతిన్.

క. నిదురదొఱంగితనతనయుఁ, ని దురంబున నారసిబల్మి నెరయఁగఁ జలమా
ని ధురమొనర్చునిశాటుఁగ, ని దురంతంబైనచింత నెలకొనియంతన్.

క. అరిదరకరుసోదరి యా, య్యరిఖరకరదోఃప్రతాప మడఁచికరంబా
దరమూని మదాత్మజు భూ, వరమాన్యుని గాచునట్టిపాఁడొదవడొకో.

చ. నలనలకూబరాకృతి రణక్షితివైరి విభీతికృన్మహా
బలబలశాలి నీకొమరుఁబట్టినిగూర్పకుపేక్షఁజేయఁగా
నలహాలపాణి కానలమహాపదనోర్చివసింప దైవమీ
హాలహాలఘోరమూర్తి రుధిరాశనువాతికిఁ ద్రోచెనకటా.

ఉ. బాలుఁడితండు యుద్ధపరిపాటి నెఱుంగఁడొకింత వీనిను
ద్వేలబలోద్ధతి న్దనుజవీరుఁడు మార్కొని యీనిశీధినీ
వేళ దురంబొనర్చెడు పవిప్రతిమానకఠోరమూర్తియై
వేలుపులార! భక్తిమెయి వేడెదఁ బ్రోవఁదగుం గుమారకున్.

గీ. అసురబారిసుతుని యసురక్షణమొనర్పుఁ డనుచు వేఁడుచుండె నచలభక్తి
నపుడుపార్థనారి ప్రార్థనాభాషల, వేలుపులను భక్తలోలుపులను.

మ. అభిమన్యుండు నిశాచరప్రవరుఁ డట్లన్యోన్యదోర్దర్పభూ
తభ్రాజత్ప్రౌఢబలప్రకల్పిత సముద్యన్మల్లయుద్ధక్రియా
రభసోదగ్రతఁ జేర్చి యంతటమహోగ్రక్రోధులై చాపరో
పభృతిన్మార్కొని రొండొరుల్ హుతవహప్రద్యోతమానాకృతిన్.

గీ. ఆసమర్థర్తులై నిశాటార్జునజులు, భూరిశక్తి నాకర్షించినారులన స
మాంబకానూన కేళీవిహారకలనఁ, దవిలివర్తిల్లిరప్పుడు పల్లవులుబోలె.

క. వినుమా నను మార్కొని గె, ల్వను మాధిపనాకలోకవరుల కలవిగా
దనుమాన ముడిగి చనుమా, యనుమాడెద నిల్చెదేని దోర్బలలీలన్.

క. వ్యాసముని కాయకాంతి వి, లాసము నిఖిలాశల న్వలయ వచ్చిసమి
ద్భాసురశక్తిమురుజ్జం, భాసురభిత్త్వాత్రి మానసామోదముగాన్.

గీ. నిలిచితన్మత్స్యమునసూక్తి బలికెవిూరు, భీమవిజయాత్మభవులు సంగ్రామకేళి
జలుపజనునొక్క భీమవిజయమహాను, రక్తి బెరవారలట్లు మిత్రతకుఁ దొలఁగి

క. అనికృష్ణద్వైపాయను, డనిలజనరసుతుల భీషణాయోధనసం
జనితాగ్రహోపశమనం, బొనరిచి తనపేరుఁ జెప్పియొగిచనియెనటన్,

శా. ఆకర్ణించి పరాశరాత్మజమనోజ్ఞాలాపముల్ సంగరో
త్సేకోద్రేకము మాని కార్ముకము ధాత్రిన్వైచి బాష్పావక
వ్యాకీర్ణేక్షణుఁడై ఘటోత్కచుఁడు డాయంబార్థుఁ డంఘ్రినా
ళీకద్వంద్వనుతుండుగా నిజభుజాశ్లేషాదృతిం జేల్చుచున్

క. కటకటబడి యతఁడును ను, త్కటకటకతటాతిభీతిదంబగుగరమీ
యటవివటవిటపినడచీ, కటిసీవెక్కటెజరింపఁగామదిలోనన్.

క. అనుజయొకహీనమనుజుఁడ, వనుజడిమన్ గడగివాఁడ నాహవమునకున్.
నిను జగదభినుత చరితుని, మునుజనకులాభిధానములు వేడకొగన్.

క. కరుణాసూనృత శుచితా, భరణాదరహీనమతులు పాపవిధానా
చరణాను రక్తులురుఖీ, వరణాంతఃకరణ దితిజవరులుధరిత్రిన్.

క. అనిశాల్మిగరురబలుమరు, దనుదానుజుంను దూషిత సాధ్వాయుఁడై
యనఘమతి మదపరాధము, మనమున సైరింపుమనుచు మఱియిట్లనియెన్.

చ. అసదృశచాపరోపభృతినై యత్నివైపినజంతుమండలీ
విస్ఫురణిమత్కహా గహనవీథివిరోధి వరూధినీతమో
విసరదినేంద్రసాంద్ర భుజవిక్రమలీలఁ జరింప నింతసా
హసమునకేమిహేతువొ ప్రియంబున నాకెఱిఁగింపు నావుడున్.

క. అని దరిమిరిపులఁబాండుజు, లనితరభుజశౌర్య సంపదధికతరయశో
ధనగరిమనయిందప్రి, స్థనగరిమనఁ గురునృపాల తనయులనయుడై.

క. మాయాద్యూతబలమున న, మాయాద్యూతోరు విక్రమయశోధనులన్
జాయాన్వితముగ వనవా, సాయాసంబొంద బనిచిరఖిలముగొనుచున్.

మహాసప్రిద్ధగ పనుపన్ దోర్దండదీక్షప్రకటతర బలప్రాప్తితా శేషధాత్రీ
జనరాడ్క్షత్రోప భాభాస్వరమణి ఖచితస్థానులప్పాండుభూభృ

త్తనయుల్ కాంతారవాసాంతరగత దురవస్థాకృశీభూతులైకా్రి
లనటన్ వేనున్ సుభద్రాలలనయు మరటిల్లెన్ సదాచింతచేతన్.

సీ. నిసువయ్యు విసపుపాల్వోసఁగ్రోలిచేసె నచేతనఁబూతనా దూతనారి
నమరాగమిలకుఁబోఁధిమదెచ్చెబాలకై యాలకై లీలకై యచలమెత్తె
ననిగూల్చెకంసుఁ బెల్లెనయించెఁ దద్వధూనంద నాక్రందనా మందనాద
మలయించెసోకుమూఁకలనెల్ల నలగొల్లనవలాల నవలాలనమునఁ గలసె
నందగోపాంగనా పాంగనలినదళస, భాజనవిభాజనకపరిభ్రాజమాన
శుభతనుండయ్యెనే దయాసుస్థిరాత్ముఁ, డకమలపత్ర లోచనుండోకనాదుఁ

స్రగ్ధ. సారంభోజాతరాగస్థగిత సురుచిర స్యందనారూఢుడై సం
సారారణ్యోగ్రదావజ్వలనదురుకథా సాధగంగాఝరీవా
ర్ధారాధౌతా ఘను షడ్గుముని రణధరాదైత్యరాడ్వర్గనుండిం
దారాధ్యుండా పృథాపత్యవిహరణ వనప్రాంగణక్షోణిజేరెన్.

క. దళశాలజేరి రక్షఃకులశాసను, డరదనుడిగి గురుధైర్యభుజా
బలకాలుల నిలజార్జును లలశామని, యాజ్ఞచేఁ బ్రియత సెనరుకొనన్.

క. యామునాత్మభవున కేలఁగబ్రి, యమునగరాబ్జములనెత్తి యయ్యానఘుఁడు సె
య్యామునబలుకుఁ గురుపతి యన, యమున వనవాసఖేదమును గతమయ్యెన్.

శా. నాలక్ష్మీభవుడిట్లుపలుక నసమానప్రౌఢిశౌర్యానల
జ్వాలాదగ్ధవిరోధివంశతతులన్ సర్వంసహా మర్త్యర
త్నాలోలాత్ముల నిట్లుగానవనటన్ గాశిల్లఁగాఁజేసె మి
మ్మేలాయవ్విధి మూరనేర్తునకటా యేసెట్లు సైరించెదన్.

క. అనిపలుమరు నల మరుగె, ల్చినసుకుమారతయు నొడలజెలువగు కుంతీ
తనయుల విఖ్యాతనయుల, దనస్వాంతనవాక్య మధుర తలఁచేర్చియటన్.

చ. దరికలుపొంబురాశిపరిధర్మజు నానతి బూనినన్ సహా
దరినసుహృత్కుంబ దరదంబ రథంబుననిల్పి వీటికిం
గరమనురాగయుక్తిమము గైకొని తెచ్చి. సువర్ణమందిరాం
తరమునఁజేర్చె సౌఖ్యపరతంత్రులమై విలసిల్లనచ్చటన్.

క. అలహాలి కరిజయలీలా, హాలహాళి కోకయనుగుగూఁతురలరు నతను ప్రా
పులికి చికురఘాతమదవ్ర,దళికిసల్లో, క్షి యతల్లియునజను లెన్నన్.

క. దాని గమనజితమదవ, ద్దానిం జిరుతనాదు దనకుదా నుపమేసం
ధానిధిహాలి బలికెన్ మదియం, దానిభవత్సుతునకిత్తు నని చెలియలతోన్.

క. కతిపయవాసరముల క, య్యతివవయోరూపలక్ష్మి నత్యద్భుతమై
నుతికందమినానాటికి, మతికెం దమి బొడమెనాకుమదనుండేఁచన్.

ఉ. బాలశశాంకఫాల నలబాలసురూప వయోరమాలతా
వాలబలారివైభవు డవారితభూరి తరప్రతాపలీ
లాలసమాను డకుర్కురకులప్రవరుం డొకనాడు నేలజే
జేలహలాంకువేడఁబనిచెం దనపుత్రునకున్ ఘటింపఁగన్.

క. యదులోకతరణిధరణీ, త్రిదశశుభాలాపమాధురికి మెచ్చిమదిన్
మదవతినిత్తుననియెఁదా, మొదలిటనూనృతమువదలి మూర్ఛితరుండై.

మ. బలరాముండిట నూనృతంబెడలి శుంభద్రూప లావణ్యధ
న్య లతాంగి కులమాన్య నాత్మసుత మాపాల్ప్తిన్ గురుశ్రోణిమం
డలనాధాగ్రిణి పట్టికిదలప దానన్ గాఢచింతావ్యధా
విలచిత్తాంబుజ యాసుభద్ర మదియావిర్భూత రోషంబునన్

క. అమ్మనిట నేను దోడ్కొని, నెమ్మదిభీతిలక గాఢనిశనధనుర
స్త్రమ్ములుగొని భయదార, ణ్యమ్మన కరుదెంచినాడనా నతఁడనియెన్

క. అవరజగౌరవధాత్రిం దప్రవరజకపటపుదురోదరముపాండుధరా
ధవపుత్రులకరి వైతుల కవిగాత్రుల కటవినివసనా త్తిదమయ్యెన్.

క. అకటా యీవిటచలనిక, టాటవి వటముగీడ నివసించె నజాం
డకటాహకుక్షియగు నా, శకటాహితుసహజ కిట్టి సంకటమొదవెన్.

చ. అనిదరిసోదరింగదసి యంఘ్రులకుం బ్రణమిల్లి తల్లియం
గనలమతల్లి యేనలఁకపప్రివిరోధిజుడన్ ఘటోత్కచుం
డనుమును మిమ్మెరుంగక కడం కదురంబొనరించి నాడనా
యనుజునితోడ నేరమిదియాత్మ సహించికృపం గనందగున్.

ఉ. అమ్మ కడిందియమ్మలిక నానగ జేసెగదమ్మ నీకు నై
వమ్మ కటామణీమయ నివాసమునందు నిజోచితైకకా
ర్యమ్ము కలంకవృత్తి ననయమ్ము ఘటింపఁ జెలుల్ ప్రియానత
ల్పమ్మకరమ్ము సౌఖ్యదశలన్ గజయింప వసించు జానికిన్.

చ. అడవికిరచ్చునట్టి తెఱఁగంతయు నింతకుమున్న తమ్ముఁడే
ర్పడ నెఱిఁగింపుచో ప్రతినబట్టితి నబ్బలరాముపట్టి నే
వడిఁగొనితెచ్చి వీనికి వివాహము జేయుదునంచు నమ్మునీ
యతుగులయానతిచ్చిన మహాత్ములదూరిన పాపమొందెదన్.

వ. అని పలికి ఘటోత్కచుండు సగౌరవంబుగా సుభద్రాభిమన్యుల నిజనివాసమ్మునకు దోడ్కొనిచని చే తద్వృత్తాంతంబు హిడింబకుం దెలిపిన విని సంతసిల్లి యదియుగారవింప వారలందుల సుఖంబుండిరనిన విని జనమేజయుండు పరమానంద కందళితహృదయారవిందుండై యప్పైలమునీంద్రు నవ్వలివృత్తాంతం బడుగుటయును.

మ. క్షితికన్యాధిపపాదపద్మయుగళీ సేవాసదాచార ఘో
రతరామోఘనరంగరంగదసిధారాకృష్టనీ యోజితా
యతనానావిమతక్షమారమణరాజ్య శ్రీప్రకంపిశ్రీ సమా
శ్రిత గేహాగ్గళ నిత్య సత్య వచనస్థేమాభిరామానవా.

క. నిరతిశయదానధారా, పరిపక్షితబుధమహీజపటలార్పిత వి
స్ఫురదాశీరుక్తినిరం, తర సస్యోదయ సువర్ణనగధీరమతీ.

ఉత్సాహ. తపనజామరాగతులిత దానశౌండ వైరిరా
డ్విపుల నిజకరాంగనా సుహృత్తకుచతటోపగూ
హాప్రకృష్టసౌఖ్యకారి బలసమగ్రబాహుదండ ని
ష్కపటభావ పుషిత సర్వకవిధరాసురావళీ.

గద్య—ఇతి శ్రీ భ్రమరీమల్లికార్జున కరుణాకటాక్ష వీక్షాలబ్ధ సరస
సాహితీధౌరేయ యాత్రేయగోత్ర పవిత్ర మంగళగిరి నరస
యామాత్యపౌత్ర తిమ్మయామాత్యపుత్ర సుజనవిధేయ
ఆనందనామధేయ ప్రణీతంబైన విజయనందన
విలాసంబను మహాప్రబంధంబు నందు
ద్వితీయాశ్వాసము.
శ్రీ. శ్రీ. శ్రీ.

—o—



శుభమస్తు.

అవిఘ్నమస్తు

# విజయనందనవిలాసము.

:o:

## తృతీయాశ్వాసము.

శ్రీరుచిర సుందరాంబా చారునయన కుముదపూర్ణ చంద్రరుచియశో
గౌరవ వేంకటకృష్ణ జ్యాగమణేంద్ర రిపువేవిహానవరేంద్రా.

వ. అవధరింపు మధికవిజ్ఞానసంపత్సాంద్రుండగు నప్పైలమునీంద్రుండు జనమేజయ భూవల్లభున కిట్లనియె.

మ. విను ముర్వీశ సుభద్రం దోడ్కొని నిశావేళన్ భయభ్రాంతిం గై
కొనక వీరవరేణ్యుం డుద్ధతమృగక్రూరాటవీక్షోణికిం
జని యచ్చోట ఘటోత్కచాలయమునన్ సౌఖ్యాప్తిమై నుంట యా
త్మ నెఱింగెన్ హరి యంతటన్ హరి యమాత్యశ్రేణితో నిట్లనున్.

మ. హరియున్ సాత్యకియున్ బృథాసుతులయం దాసక్తచిత్తుల్ నిరం
తర మస్మత్ప్రియకార్య నిర్వహణ తాత్పర్యంబు సంధిల్ల ది
ర్వ్యగకు న్గావున మీర లేమరక చేర్పున్ మీర నానామనో
హర వైవాహికవస్తుసంగ్రహణ దీక్షారూఢి నొప్పంగున్.

మ అనిన న్వారలనూనకుంకుమ హరిద్రామూల్యమాణిక్యకాం
చనభూషా పరిధాన గంధఫలపుష్పద్రవ్య సంభారశో
భనసామగ్రి మనోజ్ఞసంభరిత శుంభత్కౌతుకావాప్తి నొ
ప్పునఁ గైసేసిరి కేశవాగ్రజ కృతాజ్ఞాసక్తి జాగ్రన్మతిన్.

సీ. ఘనబహిర్ద్వార సంఘటితశోభాచార గారుడాశ్మవిచిత్ర తోరణములఁ
గామినీరచిత ముక్తారంగవల్లికా పరిభాసిమందిర ప్రాంగణముల
ఘనసారమృగమదాగరుసంకుమదగంధ పరిలిప్తవేదికా భవనతతుల
రమణీయ చిత్రితారాత్రికాపుత్రికోద్ధితరత్నకోరక దీపశిఖల
మరకతస్తంభసంబంధపరిణతాచ్ఛ. ఫలసమాన్విత రుచిరరంభాతరుప్ర
కాండ విభ్రాజితోశీరకాయమాన, ములనలరెఁబ్రోలు చూడ్కులకెలమిఁబొడమ.

మ. లలితోద్యన్నిజ పుత్రికా పరిణయాలంకార సంకీర్ణమై
విలసద్రత్న విచిత్రకాంతిమయమై విద్వత్సుహృద్బాంధవా
కలితంబై బహుశంఖకాహళీ మృదంగధ్వానసంధానమై
హలభృన్మందిరమొప్పెనప్పుడు సురేంద్రాభోగభాగ్యోన్నతిన్

ఉ. ఆహలికిన్ మనీషిజన మర్కముఖ గ్రహతారయుక్తమై
వాహికసన్ముహూర్తశుభవాసర మొక్కటి తెల్పినాతఁడు
త్స్నేహముతో సువర్ణలిఖితస్ఫుట శోభనహేమపత్రి సం
దోహముఁ గౌరవావళికిఁ దోడన పంపెఁ గ్రమక్రమంబునన్.

ఉ. ఆశుభలేఖలూని సరయంబున వచ్చినభూసురాళి కు
ర్వీశముఖుల్ విచిత్రమణిహేమవినిర్మిత భూషణావళీ
పేశలవస్త్రజాల సురభిప్రసవద్రవ చంచదిష్ట మృ
ష్టాశన వీటికాదిక సమగ్రసపర్యలఁ దేల్చిరాదృతిన్.

వ. తదనంతరంబ దుర్యోధనుండు దుశ్శాసనునితో నిట్లనియె.

చ. అమలగుణుండు లక్ష్మణుని కాహలిపుత్రి వయఃకళాభిరూ
ప్యమహితవిగ్రహం బరిణయంబొనరింపఁగ నిశ్చయించి నా
ర మని శుభార్థబత్రికలు వ్రాసియశేష వసుంధరాధిప
ప్రముఖుల కీక్షణంబునన పంపఁదగున్ దగువారిచేననన్.

ఉ. మానితసంభ్రమోద్యమ సమగ్రత నంత శుభార్థవర్ణసం
ధానసువర్ణపత్రములు దవ్వులనున్న మహీతలేశ సం
తానము గూర్చి పంపిన నతండఖిలక్షితి పాలకుల్ దదీ
యానుమతంబు గోరి సచివాత్మజ బంధుసుహృత్సమేతులై.

మ. అనఘోద్యద్ద్రుచిమాననీయతపనీయామూల్య నానావినూ
తనమాణిక్య విచిత్రితాభరణ వస్త్రవ్రాతమాల్య రూపయా

వనశోభాన్వితయోషి ద్దున్మదగజాశ్వస్యందనచ్ఛత్రి శో
భనవస్తూత్కరయూని వచ్చిరి మహీపాలుల్ ప్రహర్షంబునన్.

క. అతులరథద్విపాశ్వముఖ యానములెక్కి చతుస్సముద్రము
ద్రితమహిఁ గల్గురాజు లరుదెంచినవారల రాజరాజునా
నతిఁగురువింద రత్నసదనంబులఁ గాంచనచంద్రశాలికా
తతుల వసింపఁజేసిరి సదంపడి భానుతనూజసౌబలుల్.

గీ. కరముసంతసమున గురురాజవరునను, మతిఁబురోహితాప్తవితతి సగసి
జాత్రయూపశాలి నాలక్ష్మణకుమారు, హృద్యముగనలంకరించె నంత.

సీ. భూరిమందర నగంబుల సమున్నతులు మెచ్చని భవ్యమణిమయస్యందనములఁ
గరుబంతశుండాలనికరంబులావు నుల్లసమాడుదంతావళవ్రజములఁ
బద్మినీహితరథ పంక్తితరధ్వజవంబు నిరసించుకాశ్మీర తురగతతులఁ
బిఱుగులనొత్తంబు కడిమి నెగ్గులుబలకుజాలెడు బహుభటజాలకముల
బటుగదాశూలకరవాల పరశుచక్ర, ముఖనిఖిల చండసాధనంబుల సమగ్ర
చాకచక్యమ్ములనశేషలోకపాల, రాజిబలమొప్పె నప్పుడా రాజధాని.

మ. ప్రణతాశేషమహీశశేశమకుటాగ్రస్వర్ణరత్నచ్ఛటా
ఘృణిశనీ రాజితపాదపద్మ్ముఁడు ధరిత్రీలోకరక్షాకళా
చణుఁడక్రూరవరాజు భవ్యసుషమా సౌభాగ్యవన్మూర్తిల
క్షణు నాహోహితుఁజేసె నున్నతగజస్కంధంబున న్గూరిమిన్.

మ. కరినెక్కించియు నిట్లుపెండ్లికొమరు న్గంగాత్మజద్రోణభా
స్కరపుత్రాద్యఖిలాప్తబంధుజనసంఘాతంబు మత్తద్విపా
శ్వరథాధిరూఢిఁ జెలంగి తోడవఁగాజంచద్భుజంగధ్వజం
బు రథోత్తంసము నెక్కి పోరిలువెడలె న్భూరిప్రమోదంబునన్.

శా. ఆసుయోధనుఁడీగతిం జనియె సైన్యాన్వితుఁడై రత్నశో
భాదీప్తోన్నత సౌధజాలక చగత్పద్మాక్షు లత్యుత్సవ
శ్రీపైవారఁగఁ జల్లమూత్తియము లాశీరుక్తులన్ మార్గమ
ర్యాదాశాసనవేత్రిభృన్నికర సంరావంబు శోభిల్లఁగన్.

వ. అయ్యవసరంబున.

సీ. తతవందిమాగధనుతుల పెల్లడగించె నభిరామశంఖకాహళరవంబు
లభిరామశంఖకాహళరవంబుల మీఱె జవనాశ్వనికరహేషారవంబు

జవనాశ్వనికర హేషారవంబులఁ జిమ్మ పృథుమదద్విపఘటాబృంహితములు
బృథుమదద్విపఘటా బృంహితంబగనూఁదు భేరికాభూరిభాంకారగవము
ప్రోద్యదీవ్యశ భేరికాభూరినినద, సహితసైనిక బిరుదనాదాప్రసంగ
ఘోషములు సర్వదిక్తటీకుహరదళన, పాటవములయ్యెఁ గురుమహీపాలుసేన.

సీ. బహుసానుశృంగప్రపాతకందరదరీ పరిశోభితాఖర్వ పర్వతముల
రమణీయ కమలకైరవసౌరభమిళద్వ నిర్మలాంభఃపూరనిర్ఝరముల
లలితలతాపుష్పఫలపల్లవపరాగ బంధురకాంతార పాదపముల
భర్మనిర్మితఘన ప్రాసాదగోపుర భవనకుడ్యవిశాలపట్టణముల
భీషణారణ్యతలమృగాన్వేషణాను, రక్తపుళిందశబరకిరాతవాస
ముల సరణిఁ గన్గొనుచు మహితలవిభుండు, చనియె నిజపుత్రి పరిణయోత్సాహలీల.

మ. అరుదై మీరు చమూసమూహ చరణవ్యాఘాతనీరంధ్ర ధా
త్రీరజోంధీకృత రోదసీకుహరుఁడై పృథ్వీభృదార్యాప్త సో
దరబంధూత్కరముల్ భజింప నిటులద్ధాత్రీతలస్వామి చె
చ్చెర నేతెంచు విధంబుఁ జారతతి వేఁ జెప్పన్ముదం బొప్పఁగన్.

వ. ఆకర్ణించి యత్యంత సంతోషకలితుండై ప్రలంబాంతకుం డాప్తపురోహితా
మాత్యజనంబులఁ బుత్తెంచిన వారలభిముఖంబుగాఁ బరతెంచి సుయోధన భీష్మ
ద్రోణ, కృపాశ్వత్థామ, బాహ్లీక, సోమదత్త, భూరిశ్రవ, శకుని, దుశ్శాసన, కర్ణ
ప్రభృతి సకలరాజలోకంబును సబహుమానంబుగా ద్వారకానగరంబునకుఁ దో
డ్కొనివచ్చి జాంబూనదమణిమయ ప్రాసాదశిరోగృహ వివిధభవనమంటపస
భాంగణ ప్రదేశంబుల విడియించి తత్తద్విధ సామజాశ్వ వీరభట పరిజనంబుల
నుచితప్రదేశంబుల నుండనియమించి వేరువేఱ నందఱ రుచిమదమృతాన్నాపూప ద
ధిమధుఘృత పలల నారికేళ కదళీకాబదరీఖర్జూర జంబీరపనసాది నానావిశేషఫల
కుసుమాంగరాగ తాంబూల శయనాద్యుపచార బాహుళ్యంబునఁ బ్రహృష్టచిత్తు
లంజేసి వారలుకమ్మర సత్వరంబుగా నడపెంచి తాను సుయోధనాది రాజబంధు
జనంబుల సత్కరించిన తెఱంగు సవిస్తరంబుగా విన్నవించిన నుత్సహించి బలభ
ద్రుండు లగ్నావసరంబు నిరీక్షింపుచుండె నంత.

మ. అయుతానంగ శతాంగ శాతవిశిఖవ్యావిద్ధచిత్తాబ్జయ
క్రమలాక్షాగ్రజా కుమారప్రతతి శశిరేఖామానినీలోక ర

త్నము చింతాపగఁ దన్ గిరీటితనయోద్యద్రూపలావణ్య వ
ద్రిమణీభూంగ విభావిచిత్రఫలకభ్రాజత్కుచద్వంద్వయై.

మ. అలరుందోఁటఁ గరంబు సంభరిత పుష్యత్కీర మస్త్రప్రభీ
కులరత్నంబున కిచ్చు నాఁడు మది కోర్కుల్మిండి దైవారఁగా
సాలపుంజాపుల నీవు జూచిన మనోజుండింకఁ దివ్రాశుగా
ర్చులనార్తి వహింపఁజేయ నసమర్థుండంచు నూహించితిన్.

చ. నిరతిశయానురాగమున నీకుఁ బ్రియాచరణం బొనర్చు సు
స్థిరమతిఁ గోరుచుండు నను దిగ్మ్రరి మారుని బారిఁద్రోఁచి యే
కరణి శుభప్రదోదయము గాని కావక నేఁగితి వింతనిర్దయా
పరత వహించి యివ్విరహభారపయోనిధి నెట్లు దాఁటుదున్.

ఉ. ఇమ్మహిఁ గల్గు భూరమణ బృందమునం దొకఁ డైన నీకురూ
పమ్మున విక్రమస్ఫురణ భవ్యకళామహిమన్ సునీతి సా
మ్యమ్ము వహింపఁజాలఁడని యంటిని ప్రేమ మదీయ చిత్తప
ద్మమ్మున నిన్నుఁ గోరితి గదా తగ వారడఁ బెట్టనీగతిన్.

ఉ. అంబురుహాస్త్ర యత్కుతనయాబ్జరిపు ప్రతిమానమాననీ
యంబు త్వదీయ రూపమహిమాతిశయంబు మదీయమాన
సాబ్జంబున నాటియున్నది నిజంబుగ దానజనిందు నేహతా
పంబు ప్రియా తగ స్పృహ కుఁబాల్పడనీదిఁక నేమి సేయుదున్.

మ. శిశుపాలాది ప్రపాలుగ నృపములోఁ జింతింపకా భక్త్రశ్రీ
శశిబింబాస్య హరిన్వరించు కరణిన్ సౌభాగ్య వదాన్యతుర్యమా
ర శిఖారత్నము నిన్నుగాని యొరుఁ జేరన్ వారిదాంభస్స్పృహా
వశ సారంగము పల్వలోదకముఁ ద్రావంగోరునే నెమ్మదిన్.

చ. అనిమిషరాజవహ్నిశమనాంబుధిరాజుల మున్ను భైమి జే
కొనమరుబాణ కక్షకుసుమకోమలి నైషధుఁ జెందెగాని యం
దునొకని దా వరించెనె కనుంగొన సత్కులజాతయైన మా
నిని మును గోరునట్టివరుని న్వరియింపక యన్యుఁ జెందునే.

చ. కటకట కంతుఁ బాణశిఖి గ్రాఁగెడునన్ననురాగయుక్తిఁ గౌఁ
గిటఁ గదియించి నా విరహఖేదముఁ బాపదలంప వేలరా

కటికిమనంబునం బిలువఁగా నా సఖుఁడు మాఱుఁబలికెనే
మిటికిటులాతిగాఁగనుట మేరయె నీకు నృపాలనందనా.

ఉ. నామదిలోనఁ బాయ దొకనాటికి నీపయి మోహమగ్గలం
బైమురగిత్వభంజనుని యన్న తలంచిన యట్టికోరవ
స్ఫీతమహీంద్రసూనుఁడనఁగా నతఁడెంతటివాఁడటుండ ని
మ్మాత్మ మదనాద్రిభిత్సుతులనైనను నేఁగడకంటఁ జూతునే

ఉ. రాగసంబున్నమై నన్నుఁ గరగ్రహణం బొనరించి యిష్టసం
భోగసమృద్ధిసంపదలఁ బొల్పువహింపఁగఁ జేయవేని నే
నీగురుమిత్రబాంధవ సుహృజ్జనము ల్వెలిగందఁగాఁ దను
త్యాగము జేయుదాన సుఖివై విలసిల్లుము గాక నీవిలన్.

ఉ. కప్పురగంధి చిత్రఫలకం బెదఁ జేర్చి మొఱుంగు సోఁగక
న్నెప్పలబాష్పముల్ దొఱఁగ నిర్భరమోహవిషాదమాత్మలోఁ
నుప్పతిల న్నృపాలసుతు నూరక సారెకు నిట్లు నూరన
య్యొప్పులకుప్పఁ గన్గొని ప్రియోక్తులఁ బలికిరి బోటికత్తియల్.

మ. తలిరుంగైదువజోదుజోడగు తనూతారుణ్యలావణ్యలీ
లల ధన్యుం డభిమన్యుఁ డట్టి సుగుణాలంకారునిం దోఁచి నెం
గలిమైనిన్నె వరుంగూర్పఁగా నిపుడు సంకల్పించె నీతండ్రి నా
గలి దాల్పు విధికృత్యమెట్టిదో యెఱుంగ న్శక్య మెవ్వారికిన్.

ఉ. రాజకుమారులం దతనిరామలయందలి నిన్ననూన వి
భ్రాజితరూపలక్షణ ధురంధరతా మహనీయవిగ్రహుల్
గాఁజని ముంపఁ జేసి తగులాటముఁ జేయఁగఁ జూడకిప్పుడీ
యోజనలంచు నక్రమమె యోనిన మారదగుంగుమారికా.

చ. అతులితరూపలక్షణ సమన్విత విగ్రహుఁడర్జునాత్మజుం
డతనికిఁ గాని వేరొక నరాధిప పుత్రుఁ బరిగ్రహింప నం
చతినియమంబు జేయఁదగ దమ్మ స్వతంత్రతగల్గ నేర దిం
డతివల కెద్దరన్మెలఁగ నాదలిదండ్రుల యాజ్ఞ చొప్పనన్.

చ. నిరతము పార్థనందనుఁడు నీవు బరస్పర మైత్రి నూనము
న్నురభిత యట్లభేదగతి శోభిల నెన్నఁడు జూచు లోచనాం

బురుహములు త్వత్కత్వమునఁ బొంగునొ యంచు దలంచు మంచు మ
త్స్వరుచిరవాంఛితం బెడలఁ ద్రోచె విధాత కఠోరచిత్తుఁడై.

చ. అనికలకంఠకంఠులు ప్రియంబున నమ్రనగరాజ మధ్య న
త్కు-నగదియించి సోగకనుగోనల బాష్పములొత్తి పార్థనం
దన జనితానురాగ రసతత్పరవృత్తిఁ దొలంగి నెమ్మది
న్గోనములపోక తండ్రి మదికోరిక బూనఁదగ న్ప్రియంబునన్.

క. అని చెలికత్తియ లివ్విధ, మున నాశ్వాసింప గనులముఖి గుండియ ఝ
ల్లున బాష్పంబులు జలజల, గనుదమ్ములఁ దొఱఁగ సఖులగని యిట్లనియెన్.

చ. ఒరులకు నాలకింప సమయోచిత సమ్మదసూచకమ్ములై
పరగు శరత్ప్రఫుల్ల శతపత్ర విలోచనలార యుక్తమై
ఖగులివి మన్మనోంబురుహ కౌతుక సంగ్రహణ ప్రభావ త
త్పరములు గా పుడాంతు తలఁపన్ప్రతికోట రసూచి కాగ్రిముల్.

క. మున్నొకవరు రాగరసో, త్పన్నతఁ గామించి యతనిఁ బాసితుదిమది
స్సన్నత శుభ సౌశీల్యగు, ణోన్నత తానేల కోరు నొండొకవరునిన్.

ఉ. కాంతమనంబునందు మును గైకొనఁగోరినవాని వీడివి
భ్రాంతిఁ బ్రియాంతర స్పృహకుఁ బాల్పడి బంధుజనంబులోన నా
వంతయు లజ్జలేక వెలిపానక సర్వజనాపవాద సం
క్రాంతి కిభూమిలో మెలఁగుకంటెను మేను దొఱంగుటొప్పదే.

ఉ. వేడుక గేశవాది యదువీరులు మీరు వినంగ శైశవ
క్రీడ మెలంగునాడు శశిరేఖ దలంప సుభద్రపట్టికిని
జోడగు వీడదీనికి మనోధవుఁడంచు ప్రలంబవైరి తా
నాడఁడె నీతిమాలి యిపుడన్యునకిచ్చిన నే వరింతునే.

చ. అమరపతిప్రియాత్మజున కాత్మసహోదరి యా సుభద్రకున్
గొమరుఁడు గంతుచైత్ర నలకూబర విగ్రహ సన్నిభుం డరిం
దముఁ డభిమన్యుఁ డట్టిగుణధాముని రోసి సుయోధనాత్మజున్
రమణునిఁ జాయఁ జూచె బలరాముఁడు నా కవివేకి గాడొకో.

క. గురుడైన నేమి సత్య, స్ఫురణ మెడలి చెనఁటిపథము బోయిన నిహమం
బరము న్బాసియు దుర్భర, దురితాస్పదుఁడగుచు దూషితుఁడు గాడన్నే.

క. సకలాస్త్రవేత్త గాదే, వకికొమరు కాతనిసుతత్వైఖరి వినవో
ల్లక కురుపతి నుట్టరికము, నకుఁబూనినాఁడె యెనఁటినాఁడగడొకో.

క. ఆర్యానకుం జనసమ్మత, కార్యావరశైకధిక్షుఁ గైకొనినయశో
ధుర్యాన కరచేనుండున, నార్యసుగతి యుండుఁ బెలుచ వాదించు శ్రుతుల్.

మ. యదువంశంబునఁబుట్టి కంసముఖదైత్య ధ్వంసనాటోపసం
పద శిష్టావనదీక్షుఁ బెంపెసఁగు గోపాలుండు తమ్ముండుగాఁ
దిరిపైశ్వర్యమునం దనర్చు హలియౌకీర్తిన్ మ్రుపాలాదిగా
నుదితంబీయసకేతు యెన్నటికిఁబాయుం ధాత్రి నూహింపగన్.

క. నుతికాస్పదుఁడైతనసూ, నృతవచనమునిలుపఁగా హరిశ్చంద్ర మహీ
పతికిఁ దగేఁగాక గోపక, సుతునకు నలవను నె యంతసుకృతియె తలఁపన్.

చ. అకటమహోత్తరంబయిన యాదవవంశమునం జనించి ము
న్నొకనివరింపఁగోరి తుది నొక్కనిఁ గైకొను తండ్రిదుర్నయం
బుకతన నంచు నెల్లొరులు మూకలుగట్టి యనేకభంగులం
బకపకనవ్వుచుండఁగఁ దప్పం దలవంచికొనంగ నో పతిన్.

చ. హరిపయినల్కనూలొక్కని భయంపడ కర్ధనిశీధినిన్ వనా
కులమణి నల్లిదోసుకొని ఘోరమృగాకులమైన కానన
స్థలికి నరాగ్రజుండరుగుజాడ నెఱింగినదోడ నేగనే
జలరుహాక్షుతుప్పి పాత్రైడలఁజాలక పోయెను ఛాయచాన్పునన్.

సీ. హరిసైనులకంటె నతిశయశ్రీగాంచి నెరిమించు వానిపెన్నెరుల సొబగు
శశిబింబమునకంటె జగజంపుజిగిబూని నలువొందు వానిలేనగుమోముబాగు
శతపత్రములకంటెఁ జాకచక్యముగల్గి వెలయు వానికటాక్షవీక్షణములు
మెఱుఁగుచేరువకంటె నొరపుకల్మివహించి దనుకొత్తునాని నిద్దపువాణి
నిందుబింబాస్యలార యీకృశమనోజ్ఞ, నవవయోరూపశుభలక్షణ సమిద్ధ
మూర్తి సౌభద్రుఁగాక యామోదగరిమ, నాది యేనేల పురుషుని నన్యుని వరింతు.

. ఆననవింటిదంట కైనయైనత నూరమణీయరూపశో
భానిధి యంతరంగమున బాయనికూర్మి బరిగ్రహించి సాం
ద్రానుపమానభోగ మహిమాతిశయంబున వెల్పడేని మ
న్మానితరూపలక్షణగుణంబులు నిష్ఫలముల్ దలంపగన్,

ఉ. ఎన్న దుజాండగల్గునొ మృగేక్షణలార! నృపాలసూతివా
ల్గన్నులు నున్ననెమ్మొగము లాలితయానము గప్పపెన్నెరుల్
సన్నపుగౌను నున్నసభుజంబులు గోమలపాణియుగ్మమున్
గన్నులసమ్మదాశ్రువులు గ్రమ్మఁగ మైపులకింప సొంపునన్.

ఉ. కిన్నరయక్షకింపురుష ఖేచరరాజకుమారకోటి కా
సన్నుతమూర్తి రూపగుణసాహసధైర్య కళావివేకముల్
జెన్నగునంచు మున్నొరులు సెప్పఁగ నాదరమంది వీనులన్
విన్నదిలేదు వానికి భువిం గలరాజులు సాటివత్తురే

ఉ. ఏటికి నీయమూల్యమణిహేమవిచిత్రవిభూషణవ్రజం
బేటికి నీయుంతివయ సేటికి నీఘనసారచందనం
బేటికి నీసుమోపవన మేటికి నీశుకశారికాకులం
బేటికి వానిఁగూడి రమియింపని చెల్వ మఁదేటికారయన్.

సీ. అనుపమానూల్ప కళ్యాణనానాదివ్య మాణిక్యమయసౌధ మందిరముల
సురభిపానపుత్రా సుమపల్లవపరాగ రమణీయకేళికా రామసరణి
రాజీవకుముద సౌరభమాసనాకీర్ణ సురుచిరామృత ఝుకీసరసిపాళి
తటరత్నకోరకోత్కటనీపికావళీ కమనీయకృత్రకాద్రి కందరముల
బ్రియనయన్యలార మృగలోచనా మన్మథుని సుభద్రపట్టిసెనసి నామ
నోరథంబులెల్ల నీరికలెత్తఁగా, విహరణంబు సలుప వేడ్క పడుదు.

సీ. శ్రీవత్సకౌస్తుభాశ్రితము పెన్నురమెక్క హరి బాయని రమాతరుణికరణి
సంతానతరువనచ్ఛాయ నగారాతితో మెలంగు శచీవధూటిమాడ్కి
పదమలానసపద్మ సదనాభిరామయై నరునిపొత్తుడలని వాణికరణి
గలధౌతశిఖరిపై నెలదాల్పు వేల్పుతో సుఖమొందు గట్టుఁగాచూలిరీతి
మానితశ్రీనిధిని సుధర్మానురాగ, సహితుజతురాస్యుసర్వజ్ఞు సవ్యసాచి
పుత్రుని వరించి యిచ్ఛానుభోగసరణి, వర్తిలుదుగాని వేరొకవరుసదలప.

చ. అనవిని నెచ్చెలుల్ బలికి రత్తఱి యాదృఢనిశ్చయంబు నీ
కనుచితమూ ప్రిలంబరిపునాత్మకు నెద్ది ప్రియంబు తద్విధం
బున కొడఁబాటు గామి నినుభూజనమాడిక నొందజేయఁగా
ననలినలోచనా కురుజన ప్రభుసూతి వరింపఁగాఁదగున్.

చ. సకలవసుంధరారమణ సౌందర్యశిరోమకుటాగ్రరత్నకో
రకరుచిశోభితాంఘ్రి కురురాజు తదీయసుతుండు గ్రీడిప
ట్టికి తుల్యుఁడైనవాఁ డప్రకటీకృత రూపవయోవిలాసధై
ర్యకళల నట్లుగావున గరగ్రహణం బొనరింపుటొప్పునే.

ఉ. నేర్పుననిట్లు నెచ్చెలులనేకవిధంబుల బోధసేయఁగా
దర్పకశాతబాణ వితతక్షతికిన్ నిజమానసాంబుజం
బర్పణజేసి పార్థతనయానుగతాతి శయానురక్తిని
ట్టూర్పులుపుచ్చుచున్ బలుకకూరక యుగ్మలియుండెన త్తటిన్.

ఉ. ఆజలజాతరాగమణిహార్మ్య తలంబున కేగుదెంచె వి
భ్రాజితదేహసంపద శరద్ఘనరాజికి వన్నెబెట్టవీ
ణాజనితస్వరంబు హరినామకథారచనాను గీతికా
శ్రీజెలువొంద నారదఋషిప్రవరుండు మరుజ్జవంబునన్.

ఉ. వచ్చిన జూచియంత చెలువల్ వెసలేచి నమస్కరించి లో
హెచ్చవభక్తినొక్క మణిహేమవినిర్మిత పీఠికల్పిపై
యచ్చగమౌని బల్కిరనఘా మహనీయతపఃప్రభావనీ
విచ్చటికేగుదెంచుట నభీష్టములింక ఫలించు నింతికిన్.

క. నావిని పరమమునీంద్రుండా వెలదులకిట్టులనియె నంభోజమరం
దావిర్భూతమధురతా, శ్రీవిలసితవచనచాతురీ ఫణితిమెయిన్.

క. గొనములపోల్క మనోహర, తనురూపవయోవిలాసధన్యయిదిమనం
బున వగగొని నేమి తం. బనియజ్ఞుడపోలెమరియు నాతండనియెన్.

చ. హరిచతురంబురాశి రశనాధిసమాఖ్య సుతున్ జయంతకం
తులసితరూపలక్షణయుతున్ సమకూరిచి పెండ్లిఁ జేయఁగా
దలచుటగౌతుకాతిశయ తత్పరతన్ దగువేళగాని త్రో
య్యాలియడరూనునట్టి సమయంబిదిగాదు తలంచిచూడఁగన్.

మ. జగతిన్గన్నెలు రూపయౌవనకళాసామగ్రి నానాటరే
బగలాత్మప్రియసంగమోత్సవ రసప్రాలంబలై కోరిక
ల్జిగురొత్తన్మణిభూషణాంబర సుమాలేపాదులన్ బొల్పసం
గగదా నట్లునురంతఖేదభరసంగ్రి ప్రాత్మ్రగా నేటికిన్.

చ. సొగసు మెఱుంగు మేలిమిపసామ్ములు వెట్టి కటీతటంబునన్
జిగిదళుకొత్తఁగాఁ బసిడిచేలముఁ దాల్చి యుదారసౌరభం
బగు కుసుమాంగరాగలసితాంగకయై చెలియొప్పుగన్న సో
యగమునఁ గ్రొత్తపెండ్లికొమరాలయి చెన్నలరారఁ బోలదే,

క. అని నేరపుమాటసరసవ, చన రచనలకాత్మ మెచ్చి శశిరేఖసఖీ
జనతతిఁ దగునొకపాత్రిం, గనకేల్గవ మొగిచి కౌతుకంబునఁ బలికెన్.

గీ. హరికి మేనల్లుఁడలసుభద్రార్జునుల క, నుంగు కొమరుఁడు నలజయంతాంగభవస
మానమానిత సుకుమార తానవద్య, హృద్యవిగ్రహుఁడభిమన్యుఁ డెంచిచూడ.

ఉ. అమ్మహనీయరూప మహిమాయతికిన్ మృగరాజమధ్యభా
ల్యమ్మున నెమ్మిమైఁ బరిణయం బొనరించెద నంచు బంధులో
కమ్ము మురారియుం మొదలుగాఁగలవారు వినంగ నొక్క నా
డిమ్ముగఁ బల్కె నా హరి మృగేక్షణ దావిను నాఁడు నాటికిన్.

చ. దినములవెంబడిన్గళలదీప్తికిఁ బట్టగుచంద్రరేఖయో
యనశశిరేఖ రూపరుచియౌవనశాలినియౌట దన్మనం
బనురుచిరాలవాలమున నంకురితంబగు సవ్యసాచినం
దనజనితానురాగలత నాఁడభివృద్ధిని నొందుటన్.

ఉ. ఆభువనైకరూప రుచిరాంగుని దక్కఁగ నన్యుఁడైన భూ
మీభుజునిన్ గ్రహింపనని దీక్షవహించియనంగశస్త్రసం
క్షోభితమానసాబ్జ యగుచున్వగనూల్కొనియాతనిన్ప్రభా
శోభనగాత్రి కూర్చుచవిఁ జూడదు కన్గవఁ గూర్కొనింతయున్.

చ. విను మునిసార్వభౌమ గుణవిశ్రుతుఁడా హలపాణి యిప్పుడ
య్యనఘునకిక్క కౌరవనరాధిపసూతికి నీమహోద్ధరూ
ప్యనిధిఁ బ్రియంబుతోఁ బరిణయంబొనరింపఁ దలంచినాఁడు నె
మ్మనమున నిట్టినీతిఁ బలుమానసులందున నెంచఁగంటిమే.

గీ. అనుచు మునిపలుకఁ బరతంత్రిలజ్జముఖులు, ప్రియులందముఁ దామకోరివరింపనగునె
తల్లిదండ్రులుఁగూర్చిన ధవులనెనసి, యలరుచుండుగాక యిష్టసుఖానుభూతి.

శా. ద్యూతక్రీడ సమస్తసంపదల నామూర్ఖ్యధనుంజేర్చి ని
ర్ధూతారాతిని పాండునందను లతికూరాటవిం దాపస

ఖ్యాతిన్వర్తిలువారి బంధుతకు వేడ్కఁ బూనకపోరె యే
రీతిన్దానుఁ దలంచె నీక్రియకు హర్షింపందగుంబోటికిన్.

ఉ. కౌరవపాండవుల్ సములు గన్గొననిప్పు డఖండరాజ్య ల
క్ష్మీరమణీయుఁడై ప్రబలకీర్తి వహించి చెలంగుచుండు న
క్కౌరవరాజు తత్సుతునిఁ గైకొనుటొప్పిద మింతకంటె ధా
త్రీరమణవ్రజంబున వరింప ఘనుండిఁక లేఁడు బోటికిన్.

చ. అనియత డిట్లుఁబల్కుటయు నబ్బలనందనగుండెఝల్లనన్
గనలుమనంబుతో మునిశిఖామణి గన్గొని కేలుమోడ్చి యి
ట్లను వినరయ్య మీరలు మహామహనీయ తపఃప్రభావు లా
ర్యనుత సమస్తసద్గుణగణాకరు లిద్ధచరిత్రులారయన్.

చ. తరుచువచింపనేల నిఁక తాపసముఖ్యజగత్త్రయంబునన్
వరలు నె మీ రెఱుంగ విది నాయమ మున్నొకనిన్ హృదీశుగాఁ
దెరవమదిన్వరించియుఁ దుదిన్నయ లజ్జలు బాసి యాతనిన్
దొరఁగి ప్రియాంతరస్పృహకుఁ దార్కొన బానిపురంధ్రి యందురే.

గీ. తగవుమాతండ్రి తన్నొరునకు నీద, లఁచినఁదలచుగాక లలితమూర్తి
విజయసుతుఁడ నాకువిభుఁడని మఱి నేను, నిశ్చయించికొనిన నియమమిదియ.

ఉ. ఈనియమంబు మీమదికినిష్టమయేని మదీప్సితార్థ సం
ధానసమర్థభవ్య వరదానముఁ జేయుఁడు మీరటంచు న
మ్మానవతీ లలామ పరమంబగు నిశ్చలభక్తిభావనా
నూనమృదూక్తులన్ మునికులోత్తముఁ బ్రార్థనసల్పి వేడినన్.

ఉ. ఆకలహాశనుండు దరహాస విభాసిముఖాబ్జుఁడై వధూ
లోకమణిన్ దయారసవిలోల మతింగని యిట్లుఁబల్కె వా
చాకుశలత్వ మేర్పడఁగ సారసలోచననీదుకోర్కె యె
ట్లో కనుగొందమంచు మదిలో వివరింపుచు నిట్టులాడితిన్.

మ. భువనత్రయ్యభినంద్య నిర్మలగుణాంభోరాశి నీతండ్రి కౌ
రవరాట్పుత్రుని నీకు నీశునిగఁ గూర్పంజూచినంజూచుఁగా
క విధాత్రిండటుల న్మనంబునను సంకల్పింపఁడం చాత్మయం
దువిచారింపఁగఁదోఁచుచున్నయది కన్గోబోలు దత్కృత్యముల్.

# తృతీయాశ్వాసము.

శా. ధాతయటుండనిమ్మతని తండ్రిచతుర్దశలోక రక్షణ
ఖ్యాత మహామహత్వనిధి కన్గొనద్వారవతి న్మనుష్యలీ
లాతనుఁడై జనించిన కళానిధి నీపినతండ్రియై యశో
దా తనయుండు గల్గ ముదితా మదికోర్కి ఫలించుటబ్రిమే.

ఉ. లాలితభక్తినై మదిఁదలంచి భజించెడు వారియాపదల్
దోలి కృపం దదిష్టవరముండగుశౌరి ఫలింపఁజేయగాఁ
జాలఁడె నీదుకోర్కి హాలసాధనుబుద్ధిమరల్చి యూరకే
వేలయలందులన్ బిసరుహేక్షణ తాల్మివహింప కెంతయున్.

ఉ. నీదృఢనిశ్చయంబునకు నీగుణసంపద కాత్మమెచ్చి శా
తోదరి సవ్యసాచితనయుండగు నమ్మహనీయమూర్తిని
న్నాదర లీలఁగైకొని సుఖైకరతి న్విలసిల్లునట్లుగా
నేదయనిచ్చితి న్వరమ నింద్యము నీకనివల్కి వేడుకన్.

ఉ. అంగనగాఢసమ్మద సమావృతయౌచుఁ గృతప్రణామయై
నంగఝణారసాన్విత మనంబున దీవనలిచ్చి మౌనిరా
ట్పుంగవుఁడేగె నందసుత పుణ్యకథారచనైక గీతికా
సంగవిపంచికానినదసంజనితాధిక కౌతుకంబునన్.

ఉ. బాలిక యంతనంత హాలపాణియనుజ్ఞ నలంకరించియున్
లాలిత శయ్యఁజేర్ప నతుల ప్రియమోహతమోనిమీలితా
లోల దృగబ్జయై చపలలోచన మూలుచునుండె దక్షిణా
శాలసమానమారుత వశప్రచలత్సుమవల్లి చాడ్పునన్.

వ. అయ్యవసరంబున,

ఉ. ఓలిసరోజముల్ నిజవియోగవిగాఢ విషాద వేదనన్
జాలఁగృశింపఁగాఁ గుముదసంఘములుబ్బఁగఁ బశ్చిమాంబుధిన్
వ్రాలెవిభాకరుండు దిమిరంబున నద్దెసలావరించెఁదా
రాళివియత్పథాంతరమునం దెసగెన్ సుమకందుకాకృతిన్.

వ. అంత.

మ. శశిరేఖాజనితాతిమోహ వివశస్వాంతంబనంగాస్త్రజా
తశరవ్యంబుగఁజేసి రేబగలు సంతాపంబునం గుందుచు

నిశ్శేషదాశార్హపతిప్రియపుత్రి నిర్మలజగద్విఖ్యాతచారిత్రి న
న్నిశిచాగుండు ఘటోత్కచుండనియె సాంద్రీభూతహర్షంబునన్.

ఉ. వచ్చిననాటనుండి వనవాటిఁ జరింపఁగఁ బోవుతల్లులన్
మచ్చికతోడఁ దాసి యొకమాటును బిల్వవు కూఁడుఁ గూరతీ
విచ్చభుజింపవాకఁకతరి నించుక కన్గవఁగూరఁక వేలకో
యొప్పను లేనికూరిమి సహోదర నాకెఱుఁగఁగఁ జెప్పవమ్మా.

చ. అనవభిమన్యుఁ డిట్టులను నాహలపాణి యనాదరంబు న
జ్జననికి నాకు నీదృశదశన్ సమకూర్చినటంచు నెమ్మనం
బున వగవన్ జగత్త్రితయమోహనరూప కళావిలాస భా
సిని శశిరేఖపై బెలుచ జెందినవంతయు జాలిదూలెదన్.

ఉ. కన్నులఁ జూడఁగోరుదు జగన్నుతరూపవయోవిలాసల
క్ష్మీన్నలినేక్షణామణులఁ గెల్చినదాని మెఱుంగు మేనువా
ల్గన్నులు మందహాసరుచిలాలితవక్త్రముగబ్బినిబ్బపుం
జన్నులలంతిగాను మదసామజయానము జేటజెక్కులున్.

మ. అని కన్దమ్ములు మోడ్చి మానసమునం దబ్జాక్షి త్రైలోక్యమో
హనసౌభాగ్యవయోవిలాస భజనాత్యంతానురాగామృతాం
బునిధిం దేలియొకింత సేపునకు నూర్పుల్ గ్రమ్మ నంతంతహా
యని హైడింబునిఁ జూచి యిట్టులను దీనాలాపలోలాస్యయై.

ఉ. ఆనలినాక్షిఁ గూడి కనకాలయగోపురసౌధమందిరో
ద్యానసరోవరాంతికములందు నిరంతరమిష్టసౌఖ్యలీ
లానిరతిం జరింప కేటులన్ మదనార్తిగృశించునన్మదీ
యానుపమానరూపరుచియౌవనబాహుబలంబు లేటికిన్.

ఉ. భాసురతేజ ద్వారవతిఁ బాసి నిశాసమయంబునన్ సుభ
ద్రాసహితంబుగా వసథరాస్థలికిం జనుదెంచునప్పుడే
యాసరసీరుహేక్షణ బ్రియంబున దోశ్శాని తేరనైతి న
య్యాసుమధన్వియింత నెగులొందఁగఁ జేయునటంచెఱుంగమిన్.

క. ఆయరవిందానన యీ, రేయి సుయోధనసుతున్ వరించు హలధరుం
డాయనయన్నయు బంధుని, కాయములత్యంత కౌతుకము మదిఁబొల్పన్.

క. ఈశతిదప్పిననంభో, జాతేక్షణనన్నుఁ గూర్ప శక్యము గాద
జ్ఞాతభవునకైనరిపు, వ్రాతభయానక భుజపరాక్రమసుర్యా.

చ. అమితబలప్రదీప్తధనుర్ధర కృపాదికభూసురక్షమా
రమణసమూహమధ్యమున రాజిలు జవ్వనిదేగ దుర్లభం
బమరగణాధినాయకునకైన నటన్ హరియుంటనీకు సా
ధ్యమనితదీయరూప విభవాతిశయంబులు జెప్పనాపుడున్.

ఉ. ధీరత మున్నుఁ జేసిన ప్రతిజ్ఞఁ గొలంగునునేల యింతకున్
భారవహుండకఁ బాండవులపాలిఁటి దైవము శౌరిగ్గన
చ్ఛోరధికుల్ సహస్రములు చొప్పడినన్ హరి క్షేత్రమువారలన్
బోరజయించి తెత్తు విరిబోఁడి మనంబున శంకయేటికిన్.

చ. కురునృపసైనికుల్ సమరకోవిదులట్టి మహాబలాఢ్యులన్
దురమున గెల్చి యొక్కరుడు తొయ్యలి దెచ్చుట కష్టమంచలో
మెరమెర జెందకించుకయు మేకొని యిప్పనిఁ జేయనేని మ
ద్గురుతరదోఃప్రతాపమునకున్ ధరపైయపకీర్తి గాదొకో.

గీ. అని హిడంబానందనుఁ డవరజుఁ గని పొల్చి యుత చిత్రఫలకాంతగాత్రదీప్య
మానమానితమానినీ మహితభావ లీలవీక్షించి సంభ్రమాలోలుఁ డగుచు.

క. తల్లులకు మ్రొక్కి రథ్యో వల్లభుఁ డత్యుద్ధతిన్ దివంబునకెగసెన్
సల్లలిత సమీరణవేగోల్లసితుఁడగుచు ఘనసముత్కర మెడలన్.

ఉ. ద్వారవతీ పురోత్తమము దవ్వులఁ గాంచి తదీయగోపుర
ద్వార వితర్దికావరణ దామ శిరోగృహ సౌధకేలితో
దారమణీ ఘృణిస్ఫురణ కచ్చెరువొందె నగారి పట్టణ
శ్రీరహిఁ దీనితోడ సరిసేయఁగఁ బోలదొకించుకేనియున్.

క. అని కొనియాడుచు నిట్లు, ద్దనుజ వరేణ్యుండు మధుమదన పురవిభవం
బును జేతఃపరితోషంబున వీడం దంతటాయఁ బోవుచునొకచోన్.

సీ. సనకాదిసురమౌని జనమనస్స్వాంతత ధ్యానగోచర పదద్వయము వాని
నిరుపమానాభీర వరవర్ణినీవయస్ప్రామాజ్య హారణకౌశలము వాని
వసుధాసుతాదిగర్వగ్రంధి పరిపంధిబలవినిర్దళనదోః పటిమ వాని
మహితసద్గుణరమామాన్య పాంచాలరాజన్యజా మానరక్షణము వాని

హారకుండలకటకకేయూరమకుట, సురుచిరామూల్య మణిఘృణిస్ఫురణావాని
హారి నయాశాలినిం దొక యజ్జరాగ, సముదయాకీర్ణ సౌధ భాగమునఁ గనియె.

చ. కనిమణిదీపికానికర కాంతివెలుంగ విదర్భరాజనం
దనయును సత్యయుం గడుముదంబునఁ బాదములొత్తఁ బూవుపా
న్పున శయనించియున్న పరిపూర్ణ దయానిధి శౌరి నెమ్మనం
బున భజియించి కన్నుఁగవమోడ్చి యొకింత ఘటోత్కచుండటన్.

చ. తనదునిఁ బూని పాల్పసఁగు దామరసాక్షు భజింపధాత్రికొ
య్యనడిగు నీలమేఘమనవాతఁడు నింగిదొలంగి తత్పురీ
ఘనతరరాజమార్గమునఁ గ్రిక్కిఱవారిలి కురుక్షితీశయో
ధనికరదంతి ఘోటకపదాతి జనంబులు సంభవింపఁగన్.

మ. సమదానేకప ఘీంకృతిధ్వనుల నాజానేయ హేషార్భటిన్
సమరాటోపభటావళీ బిరుదవాచాస్ఫూర్తులం భేరిశం
ఖమృదంగాదికవాద్యఘోషముల దిగ్భాగంబు గంపింపఁజే
యుచు రారాతపురీరమోన్నతికి హైత్యుండద్భుతంబొందుచున్.

చ. ఇరుదెసజాళువా మిసిమినింపగు గోడలు జాలుగొన్న సుందర
కురువిందరత్నరుచి దట్టపుదివ్వెల చాయనిద్ధపున్
సరణినివింధ్యమాకెడిన చందమునం బ్రజసందడింపఁగా
వెరలఁగఁ గేలదోయియుచు నదృశ్యతనుత్వముఁ దాల్చి యేగుచున్.

వ. కురంగట నింద్రిసంపత్సాంద్రింబగు నొక్క శోభనమందిరంబుఁ గనుంగొని.

గీ. ఇదియ కాబోలు హలపాణిసదనమనుచు. రంజిలహరిన్మణికదంబరచితభవ్య
తోరణద్వారమశలీలఁ దూరి సంభ్ర, మమున నమ్మేటి యభ్యంతరమునకరిగి.

సీ. పరిచారికావధూప్రతికరానుబింబ సందీప్త మాణిక్యభిత్తికలు చూచి
పరిణయోచిత వస్తుభారసంభరితభాజనకుశీలాంగనా జనముఁ జూచి
మరకతస్తంభ సంబంధ రంభాఫలగ్రాహి పంజర శుకోత్కరముఁ జూచి
నికటనృత్యద్వారముకురాననా చంచదవయవరూపవైభవముఁ జూచి
బహుళ మణిప్రతిక్రికాకర భ్రాజమాన, చామరానిలచలితాభిరామగంధ
తైల భవనప్రదీపికాతతులఁ జూచి, యబ్బురంబంది యంతంత నరిగియరిగి.

సీ. ఎలనవ్వు వెన్నెలల్ దొలకు నెమ్మోములఁ గొమరారు మెఱుఁగు ముంగురులు బొదల
జిరుత బొమ్మ్రించు వాతెఱలపై కర్పూర తాంబూల రుచిరరాగంబు మెఱయ
నిగనిగల్ గుల్కు మానికపు సొమ్ములతోటి తళుకుచుల్ మెఱుఁగు మొత్తములుఁ గురియ
జిలుగు పయ్యెదలలో మెలఁగు గుబ్బలమీది కేపంబు గమగమ వలపులీన
విరులు దురిమిన జడలతో జరణలిప్త, యావకాంశులతో నూపురారవముల
తోఁ దలిరుపాప్రియములతో వధూమణులు త,దీయగృహవాటి గొంద ఱుదిరుగఁ జూచి

ఉ. ఆయరవింద గంధుల కచాననలోచన కర్ణనాసికా
భ్రూయుగ బాహుమధ్య కుచభూరి విలాససిరీక్షణోత్సవ
శ్రీయుతుఁడై యొకింత హాల భృత్సుతమవ్వఁపు సోయగంబు లేఁ
బ్రాయము దన్మహోదయవరమ్యతలించుక యందు లేమికిన్.

క. మది మెచ్చక యాతఁడు ద, త్సదనాభ్యంతరమునందుఁ జనఁ జనవాలో
ముదితామణు లిరువురు దన, కెదురై యన్యోన్యమైత్రి మృదుతరఫణితిన్.

చ. హలికురురాజునందనుని కర్మిలిఁ దన్నొసగందలంచె న
చ్చెలి నభిమన్యుఁ డక్కు నొరుఁ జేకొనవంచు ప్రతిజ్ఞఁ బట్టె త
త్సలలిత మోహదాహవివశత్వమున న్విరిఁబాన్పుమీఁద న
గ్గలముగ వేఁగుచున్న యది కంజముకృత్య మదెట్టులున్నదో.

ఉ. ఏల మణీవిభూషణము లేల దుకూలము లేల గంధతాం
బూలము లేల కేళివనభూమివిహారము లేల జీవితం
బేల సువర్ణమందిరము లేల భుజిక్రియ లేల వైభవం
బాలసమానరూప కుసుమాస్త్రునిఁ గూడనినన్ను బోటికిన్.

క. అనిపలుమరు నీచాట్పున, మనతో వాదించు దాని మదినియమంబీ
తనిరూపసమిట్టివసితా, జనతామణి గంటి మే మెచట లోకమునన్.

క. అనిపల్కు తద్వయస్యా, జనసరసాలాపములుఁ బ్రసమ్మద భరసూ
చనవరములగుట వీనుల, కనఘుండతఁడ చటఁ బాసి యవలం జనుచున్.

సీ. ఇరువంక నకలంక హేమపాత్రిలగంధ తైలప్రదీపికా తతులు వెలుఁగ
శృంగారభిత్తి చిత్రితరత్నపుత్రికా వర్గంబు చేలవీవనలు విసరఁ
బట్టాంబరవితాన బద్ధసూనరజంబు లళిమండలము మేననలవరింప
సరసపంజరకీర శారికాపోతంబు లమృతవాచాలీల నాదరింప

నాకఱ్ఱమణిమందిరమున నిట్టూర్పులొలయఁ, గన్నులరమోడ్చి కుసుమపత్రికాండకాండ
జనితపరితాపమున నూనశయ్యనొరగి, చేతలాడఁగఁగనుగూరుఱ్ఱ చెలువఁగనియె.

వ. కనియనంతరంబున.

సీ. నెఱిజాఱుకప్పు పెన్నెఱులంటి యొసివాఁడు వికచప్రసూన మాలికలదాని
నెదలోని వెఁకాక నెసఁగిచీటలువాయు కుచకుంభలిప్త కుంకుమము దానిఁ
జటులోష్ఠసాంద్ర నిశ్వాసవాతాంకురార్తిఁ జలించు నాసముత్తియము దాని
మొగమునొత్తిఁజమట పల్లిగరఁగుగండస్థల న్యస్తమకరీదళములదాని
విజయనందన జనితాతివేలమోహ, భరతమో ముద్రితేక్షణాబ్జములదాని
నవవయోరూప శుభలక్షణప్రదీప్త, తనులతా వైభవముదానిఁ దరుణిఁ డాసి.

గీ. సవ్యసాచి సుమారాంక భవ్యచిత్ర, ఫలకలక్షితరూప సంపద్విశేష
ముత్తలిరుబోఁడి మేననచ్చొత్తినటులఁ, గనుపడినఁ జూచి కుతుకంబు గడలుకొనఁగ

ఉ. శ్రీయుతమూర్తి యోశశిరేఖ యకాఁదగు నీసరోజప
త్రాయతనేత్రి కానియెడ నవ్యపురంధ్రులకీ త్రివిష్టప
ధ్యేయశుభాంక రూపరుచ లేటికిఁ జెల్వగునింత చక్కఁగా
నీయరవిందగర్భ సృజియించు విరించినుతించఁబోలదే.

ఉ. వన్నెపసిండిమిన్నగలువల్ మదవారణకుంభయుగ్మముం
బున్నమరేవెలుంగు ధరమున్ సుధయున్ దిమిరంబునద్దముం
జెన్నుగఁబూని వాక్పతి సృజించెనొకో సతిమేను గానవా
ల్గన్నులు జన్నులాస్యము గళంబధరంబు నెఱుల్ గపోలముల్.

గీ. ఈలలన నేత్రములు సామ్యమెట్లుబూను, బంకభవవృత్తిదమిముడ్చు బద్మ్రసముద
యముసభంగగతుల బిసాహారమగుచు, గలగియవ్వలఁ బడిపోవు జలచరాళి.

ఉ. కంతులతాంత సాయకనికాయనిశాతములై శ్రివస్తటో
పాంతవిశాలవైభవములై పరిదిహ్నిత కజ్జలప్రభా
కాంతములై సమానగతిఁ గాంచుచు రెప్పల నాగవేని నీ
యింతికటాక్షదృష్టు లలయింపవె చిత్తము నైజవేదనన్.

క. ఈలలన రూపురేఖా, శ్రీలభినందింపఁగా నిరీక్షింపధర
త్రిలోకచరులు జాలరు, వ్యాళకులాధీశ్వరుండు వజ్రియు దక్కన్.

ఉ. అని యతఁడిత్తెఱంగునఁ బలాత్మజరూప వయోవిలాసముల్
మనమున నెంచుచుం సురభిమంజుల పుష్పవిలీఢ శయ్యనొయ్య
ననిజమాళి నెత్తుకొని యంబరవీథి మరుజ్జవంబునం
గొనిచనియెన్ బలాధ్యువకుఁ గుంభినియొద్ది యసాధ్య మారయన్.

క. నిజమాయా బలమునఁ బంకజలోచన నిట్లు దృశగతిఁ గొనిచనియా
రజనీచరుఁడు సుభద్రాత్మజు మ్రోల నిలిపె మహాద్భుతము దళుకొత్తన్

చ. నిలిపినఁ గ్రీడిపట్టి మదినిండిన కోరుకులుఁ బెగ్గలింపఁ దొ
య్యలి దనురూప యౌవ్వన శుభాంకరుదుల్ బరికించి చూచి
బ్బాలసుత నిక్కజలజపత్రవిలోచన సందియంబులో
వలువన్ నటించుఁ గన్నుల నవాఖ్యము దశ్రుజలంబుఁ గ్రిమ్మగన్.

గీ. వలికె భీమాత్మజునితోడ బాష్పపట్టి యన్న త్రిభువన విఖ్యాతమైన బాహు
శక్తిగలవాఁడవగుట నీచాన జెప్పి తన్యులకు భారమిట్టి కార్యంబు సలుప.

ఉ. తావక బాహుశక్తియును దామి నేఁడు పుకల్మి దేవ దై
త్యావళికైనఁ గల్గునె మహాత్మ సమిద్భయ దాయుధీ
య వర్గాన్ప్రతా మాహ లాంక నిలజుంబడి నిర్భయ వృత్తి జొచ్చి రా
నీవసుధన్ సమర్థుఁడగు నెవ్వఁడు నీ వకయుండ వేకదా.

చ. అన విని యాతఁడిట్టులను నంగన దెచ్చితి నాప్రతిజ్ఞ సె
ల్లినయది కౌరవాధిప హలప్రముఖాఖిల రాజబంధు స
జ్జను విటమీఁద నెయ్యది విచారము జేయుదురో యెఱుంగ జొ
ఱునుచు నంత నుద్ధతబలుండు ఘటోత్కచుఁడేఁగె ద్వారకన్.

గీ. అంత శశిరేఖ మదనమాయాంధకార, ముదిత్రంబులులోచనములు దెఱచి యొ
కింత సేపున కల్లనవింతయగు సు, వర్ణమందిర నిష్కుటవాటిఁ జూచి.

మ. అరయున్ మామకరత్నసంఘటిత సౌధాగార నానామనో
హరభూజాతలతాఫలప్రసవ యుక్తారామముల్ గావు భీ
కర భూభృత్కటకానుషక్త విపినధ్వాంత మధ్యప్రాంగారంబు పం
దిగ జేశంబని వోఁ చుచున్న యది చింతింప స్వర్నోవీథికిన్

మ. అనఘా మాల్యమణీమయాలయమునం దాళీజనానీత సూ
తనపుష్పాన్వితతల్పమధ్యమున నిద్రింపంగ నన్నిట్టి వి

గీ. హరిసుభద్రపట్టి కాత్మజ నొసంగక, యిటులఁ దలఁచె నటుచుఁ గుటిలవృత్తిఁ.
కృష్ణుఁ డిట్టి మాయ సృజియించెఁగాఁబోలు, ననుచుఁ దోచె నిదియ మనసులోన.

చ. అనుచు నతండు పల్క మనుజాధ్యఘనుత్కృఖి సాధనావళుల్
గొని యెదిరించి కయ్యమునకుం గమకించినవానితోడ మా
రొంగ్నదగుఁగాక చూడఁగల కగోచరుఁడై వినువీధినున్న దై
త్యునిఁ బరిమార్చ నెంత బలయుక్తున కైన నసాధ్యమారయన్.

గీ. శిలలు బలుఁగులు రుధిరంబు జెట్టు లెముక, లాకు మొగి సైనికులపైఁదఁ బెనుగతులఁ
గురియుచుండఁగ మాన్ప నెవ్వరితరంబు, జిచ్చు పైరాగ నలవియె చేతగ్రిమ్మ.

ఉ. ఆసమయంబునం బరిణయాగతబంధుయదూద్వహుల్ బరి
త్రాసవిషణ్ణులై నతిదారుణశల్య శిలాదురక్తధా
రాపముపగ్రవృష్టి కిమురక్షణ దాచరవైరి యొయ్యనన్
డాసి హలాయుధుండు పరికటపిప్రియ భాషలతోడ నిట్లనున్.

ఉ. ఏతరి ద్వారకన్ బొరయ విట్టిజనప్రళయార్తి భీకరో
త్పాతము లిప్పుడేమిటికి తంబునఁ బుట్టె విహాహసంభ్రమా
యాతజనాళి కార్తిదములై మధుసూదన సర్వలోక వి
ఖ్యాతుఁడవీవె యుంగనిది గల్గునె యెయ్యది నాకుఁ జెప్పుమా.

చ. అనుటయు నాతఁ డిట్లనును నగ్రజుతోడ ఘటోత్కచాఖ్యదై
త్యుని ప్రబలంపు మాయల వితోయదగర్భగతుం
డనిమిషయక్షరాక్షసులకైన నజేయుఁడు వాఁడు కౌరవా
వనిపతి సైనికుల్ దొడరి వానిజయింపఁగఁ జాల రెమ్మెయిన్.

మ. ప్రకటాత్యద్భుతమాయ నాయనిమిష ప్రత్యర్థి యుద్వృత్తుఁడై మా
రిక గొంచేగి తదీయ సుందరతను శ్రీ ధాల్చి కౌరవ్యసై
నికులన్ బెట్ట లయించె దీనికి మదిం జింతింపఁగా నేల ధా
త్రికృత్యం బెట్లటుగాక వేరొక తెఱంగే కా విచారింపగన్.

క. నా విని యతఁ డిట్లను మనకీ విపులాపదవోలంగు నెత్తెఱంగున రా
జీవాంబకయన నబ్బలదేవునకుం బల్కె దేవదేవుఁడు ప్రేమన్

ఉ. ధీవిశదాత్మ యస్మదుపదేశవిధానము పథ్యమై వినం
గావల తేని జెప్పెద జగద్భజనీయుతనూవయుక్తశా

భావజుఁడైన యర్జునుని పట్టికి నాత్మజనిత్తునన్ ప్రీతి
జ్ఞా వచనంబు పల్కెమది సమ్మతి వానికి నాలకింపగన్.

గీ. దాన నుత్పాతములడంగుఁగాని శూర కులుల గురుసైనికాఢ్యులబలిమికతిమి
సరకుగొనఁడే యుపాయంబు సాఁగ దిదియ తక్కె నతఁడుగ్రబలశాలి నిక్కమనిన

క. మును నీ చెప్పినమాటలు విననొల్లని కతన నిట్టివింత లాదవె న
ర్జున సుతునకు సుతఁబరిణయ మొనరించెద నింక మాన్పుము త్పాతములన్.

గీ. అనిన నెల్లెత్తి కంసారి యనిలజాత్మ నందనునిగూర్చి పలుకు పురందరజకు
మారునకు సీరి పుత్రిసమ్మదమెలర్ప బరిణియ మొనర్చు నిక్కమిప్పలుకునమ్ము.

చ. అని యిటులం బయోధర మహాధ్వనిఁ బల్కెఁ దదీయవాక్యముల్
విని యివి శౌరిపల్కెలని వేమరు సమ్మదితాంతరంగుఁడై
చనియెనిశాటుఁడంత మహిజాత శిలాకృతజాస్థి వృష్టియిం
కిన బ్రతు కాసలింకఁ గలిగెన్ మనకంచు నృపాల సైనికుల్.

వ. పెక్కు విధంబులఁ దలంచుచుండ దుర్యోధనుండు, భీష్మ, ద్రోణ, కృపాశ్వత్థామ ప్రభృతి యోధవర్గంబుఁ గూర్చికొని కరితురగాది చతురంగబలములతో విఫలమనోరథుండై లజ్జాభరంబునఁ గరినగరంబునకరిగె మఱియు హైడింబుండు నిజనివాసంబునకుంజని తద్వృత్తాంతంబు హిడింబా సుభద్రలకునభిమన్యునకును సవిస్తరంబుగాఁ దెలిపిన వారలు సంతసిల్లి సుఖంబొందిరంత

చ. ఒకపలలాశియుద్ధతికినోడినదిసుతకుంభజాది సై
నికతతితోడ విశ్వధరణీప్రభుడక్కురువంశమౌళి పౌ
లికెటులఁ బోయెఁగో రికఫలించునె దైనముతోడుగామియే
రికినని కృష్ణుఁడున్ బలుడరిందముఁ దమ్మునిడాసి యిట్లనున్.

గీ. కన్యసౌజన్యభువనైకమాన్యపాథఁ, తనయునకు ఖ్యాతనయునకు జనమువొగడఁ
బరిణయమొనర్పకితర సంబంధమునకు, నిచ్చగించిన మురహరయింతపుట్టె.

మ. ప్రతికూలించిన దైవమెవ్వరికిఁ గార్యంబెట్లుసిద్ధించునా
దుతలంపట్టిదియయ్యె శోభనములొందుంగాదె యుష్మత్సమా
శ్రితసంకల్పమునన్ జగంబులకునిర్విఘ్నంబులై చిత్తవృ
త్తి తెఱంగెట్టిదొ యట్లొనర్పుమనఁబ్రీతిన్ శౌరి దానిట్లనున్.

చ. తనకొమరున్ సురూపనిధి ధన్యవధూకులమాన్యఁ గన్యఁగూ
ర్పనొరునకిత్తునంచు బహుభంగుల నిప్పువచించుచో సుభ

దర్పనయపరోక్తి నీమదిమరల్ప సమర్థతలేమి గొందలం
బునఁదనయుండు దాను జనఁబోలు ఘటోత్కచుఁడుండు కానకున్.

చ. జలధులలో సుధాంబునిధి చందమునన్ భువనప్రసిద్ధిచే
నిలయదువంశమింపెసఁగు నిట్టికులంబున సంభవించి దో
ర్బలచిరకీర్తి సంపదలఁ బ్రస్తుతిఁగాంచినవారమాట కే
వల ముచితంబు నీతిపథవర్తనమున్ మనకెన్ని భంగులన్.

ఉ. కావున జాగుసేయపనిగాదు హలాంక ఘటోత్కచాఖ్య ర
క్షోవనవాటిఁ గష్టదశఁ గుందుచు శాకఫలోపహారదీ
క్షావిధినున్నవారి సరసంపు మృదూక్తులగారవించి తో
డ్తేవలయున్ సుభద్రయువతీమణిఁ దత్తనయున్ శుభోదయున్.

చ. హరియిటులాడి కాంచనమయంబై మేరునగంబనాఁ మనో
హరకురువిందరత్న చపలాంశుధృతిన్ శరదంబనాఁగరం
బరుదుఘటింపఁ జాలిన శతాంగమునన్ వసియించి వారలి
ర్వురుఁ జని రన్నిశాచరవరుండు ఘటోత్కచుఁడుండు కానకున్.

మ. తపనీయద్యుతులాశలంబొరయ రత్నచ్ఛాయ లబ్జాప్తుతో
రపు కెంజాయల నావరింపఁ దురగగ్రైవేయ ఘంటానినా
ద పరిస్ఫూర్తిఁ వనీమృగావళి భయోత్కంపంబునంబొంద వే
గపుయానంబునవచ్చు తేరుఁగని రక్షస్స్వామి దావవ్వలన్.

చ. హరునకుఁదొల్లి విల్లయి సురాసురులెన్న జయంబొసంగి త
ద్గురుకృపనాత్మ పాదములకున్ గమనస్థితిగల్గునట్లుగా
వరమువహించి నల్దెసల వర్తిలవచ్చిన కాంచనక్షమా
ధరమను శంకఁబూని యలదైత్యుఁడు సారెకుఁ జూచుచున్వెసన్.

మ. అలఘుశ్రీకరచేత నోజ్వలదవశ్యాయాసిత క్ష్మాధరం
బులహోలెక్కం దగురామకృష్ణులనగ ప్రోత్తుంగ నానావిని
ర్మలరత్నాంక శతాంగసీమఁగని చేరంబోయి భక్తిం గృతాం
జలియై కన్గవసమ్మదాశ్రు సలిలాసారంబు తోరంబుగన్.

ఉ. అంతసగౌరవంబుగ నిశాటుఁడు డొడ్డొక్కని రాఁ దదీయసా
ధ్వాంతికసీమఁదేరుడిగి సాగ్రజుఁడై యతఁడున్న హేమక్ష్మా

శాంతరవాసియై కడు(బ్రియంబు మెయిన్ విలసిల్లినావదేగా
స్వాంతుడు భక్తమానస నిశాంతుడు గాసక్షతాంశు పక్షిటికిన్.

గీ. అహరహపూజావినుల నామయాసుధాంబు, ధులహరి విఘులకలతించి యలరించి
గురునిగురుగిబిడసుకీర్తి శరద మూర్తి, గుశలమారసి మఱియు నాకు నిచ్చెనిట్లు.

ఉ. వీడొక వైష్ణవ మాత్రుడని వేఱుగ జూడక కూర్మి పెంపునన్
మూడుజగంబులేలు శుభమూర్తి మదీయ గృహంబులోనికిన్
నేడరుదేర నీవు మదినిండినకోర్కె ఫలించె నాసిరుల్
పోడిమిగాంచె శూరకులభూషణ నిన్నునుతింపనేర్తునే.

ఉ. చండబలోన్నతి న్మెఱసి సాధుజనాళికి గీడొనర్చు ను
ద్దండ ఖలప్రకాండము మదంబుడపన్ శ్రితమండలాపదల్
జెండనఖండ రూపరుచి లీలమెయి న్మహి దోచు నాదివి
ష్ణుండవుగాక నీవుమనుజుండవె వృష్ణికులప్రదీపకా.

ఉ. ఎవ్వనిచేసృజింపబడు నీజగమంతయు బెంపుగాంచు దా
నెవ్వనిచేనశించు దుది నెవ్వనిచే దృటికాలమాత్రలో
నెవ్వగదీరు నెవ్వని యనింద్యకథ ల్బరమానురక్తి నా
ఋష్యవనతండవీవ యదుకుంజర కంజదళాయతేక్షణా.

సీ. దురితదుస్తరరుజా హరణౌషధీలత శంకాకళంక భుజంగనకులి
జననజరామృత్యు సానుమచ్ఛతకోటి దారిద్ర్యవిటపి కుఠారదార
యమితసంతాప సంతమస ప్రదీపిక హృదయశోక దవాగ్ని వృష్టిధార
కామాదిరిపువిహంగమ వాగురాబంధ మజ్ఞానమాద్య ద్విపాంకుశంబు
దివ్యమానివితాన సంసేవ్యమాన, మాననీయ భవత్పద ధ్యాననిఘ్న
కంసవిధ్వంస నిఖిలలోకప్రశంస, దివిజచేతోరి రంసయాదవవతంస.

చ. శకటము గూల్చి తాలకయి శైలమునెత్తితి కంసుజంపి తిం
తికొలఱువేల్పు మాపనికు దెచ్చితినెల్లనృపాలకోటికి బో
రికి దొలగించి రుక్మిణి వరించితి వైపినవహ్ని మ్రింగితే
రికి దరమిట్టిచెయ్వు లొనరింపగ నీకతగు న్మురాంతకా.

మ. పరితిశాస్త్రోక్తుల నెన్నరానియవియై సొంపొందు నీలోక వి
శ్రుతకళ్యాణగుణంబులెన్న నసమర్థుల్ మాదృశుల్ చుమ్మహా

ర్పతి జాంభ శ్చరకాళి యొరగఫణా రంగాంతరానర్తితాం
ఘ్రితులాకోటి ఝణంఝణం నినద సాంద్రీభూతహర్షోదయా.

గీ. పద్మదరసమొంద మందార సుమమరంద, మధురిమధురీణవచన సంభావనమునఁ
దేల్చి వసుదేవసుతుని సుధీజనాభి, నుతుని శాశ్వతవైభవోన్నతినినిట్లు.

వ. మఱియు హిడింబానందనుండు మీరలిర్వురిచ్చోటికి విచ్చేసినకార్యంబెద్ది యానతిండని విన్నవించిన నమ్ముకుందుండిట్లనియె.

గీ. అనుఁగుఁదోడు సుభద్ర భవ్యతరగుణ సముద్రి తత్కుమారుండుసంపూర్ణబలవి
జితకుమారుండు కాంతిరాజీవమిత్త్రుఁ డతులచారిత్త్రుఁ డభిమన్యుఁ డతిశయిల్లు.

గీ. ఆయసమబాణ తుల్యకళ్యాణమూర్తి, కాత్మతనూజాత రతిసమానాంగిఁబెండ్లి
సేయఁగలవాఁడనని యాడెఁ జిరతనాఁడ యురతరామోదమున సీరియొరులువినఁగ.

వ. అంత.

క. తనతనయునకుద్వాహం, బొనరించుతలంపునను సుయోధనుఁడు సుధీ
జన మనిచి కన్యనడిగిం, చిన హరియొడఁబడుట యెఱిఁగిచెందినవగతోన్.

క. అగ్రజుఁడాసి సుభద్రస, మగ్రామోదమున నీకుమారకునకుఁ బా
ణిగ్రహ మొనర్తుశోభన, విగ్రహ శశిరేఖనను మ విబుధులుమెచ్చన్.

చ. పలికితిగాదె మున్నిపుడు భావమునం దొరుఁగూర్పగాసుతం
దలఁచుటపాడిగాదెచట ధార్మికు లిప్పనికియ్యకొండ్రె యం
చలికులవేణితా సవినయప్రణయోక్తుల కల్మిదూరినం
బెలుచబలుండు మార్మొగముఁ బెట్టిన ఖిన్నతఁజెంది కుందుచున్.

ఉ. అచ్చటనుండరోసి తనయాన్వితయై నడిరేయిఁగానకు
న్వచ్చిత్వదీయ మందిరమున న్వసియించిన చొప్పెఱింగియే
మచ్చపలాక్షి కోర్కెయెటు లట్లులచేయుతలంపుఁ బూనివే
వచ్చినవారమంచు మురవైరివచింప ఘటోత్కచుండటన్.

చ. తనజననీసమీపమునఁ దద్దయుఁ బుణ్యకథానులాప చిం
తనపరతం బ్రివర్తిలు సుధాకర బింబముఖి న్సుభద్ర ధ
ర్మనిరతు రూపమాన్యు నభిమన్యునిఁ దోడ్కొనివచ్చి సమ్మదం
బునబలరామకేశవుల మ్రోల వసింపఁగఁ జేయనత్తఱిన్.

చ. రణరిపురాడ్వితా నభిదురప్రతిమాన శిలీముఖావళిం
దృణకణలీలఁజూచు బలుదిట్ట పురందర పౌత్రుఁడబ్జమా

ర్గణసుమబాణ వేదనలఁ గ్రాఁగి కృశించినవానిఁ జూచి నే
ప్రణుతబలాఢ్య ! యంచు బలరామున కమ్మురవైరి చెప్పినన్.

మ. దరహాసస్ఫురితాననాబ్జుఁడగుచుం దాలాంకుఁడు ద్వేలరా
గరసాస్త్రిన్ సహజాతనూజానకలంక శ్రీవయస్సౌకుమా
ర్యరమానందనుఁ గేల్గవందిగిచి యంకాగ్రంబునం దేర్చి సా
దరసల్లాప కలాపలీలమెయిఁ జేతఃప్రీతిఁ గావించుచున్.

మ. జగతీస్తవ్యచరిత్రి భవ్యసుషమా సౌభాగ్యవన్మూర్తి భ
ద్రగుణోన్నిద్ర సుభద్రఁ గాంచి పలికెన్ రాముండు నీవర్ధరా
త్రిఁగుమారుం గొని కాననక్షితికి నేతేరంగ నాయంబుగా
దిరుగుంబోఁడె యెఱుంగమిం జనువుచే నేమంటినో దాన్కై.

చ. నలినదళాక్షి నీమనమునం గల చందమెఱుంగ గోరినిన్
జులకనిమాటలన్ మనసు నొవ్వఁగ నాడితి నింతె కాని నీ
వలుకవహింపకమ్మ వినుమాత్మజ నీసుతుఁ గూర్పకంత వెం
గలివోకో యన్యునిన్ వరునిగాఁ దలఁపన్ బుధులీసడింపఁగన్.

చ. హరికిఁ బ్రియంబుగానిపని యయ్యజుఁడైన ఘటింపజాలఁడు
ర్వరనిదినిశ్చయంబు కురురాజుకుమారిక వేఁడఁ బంప సో
దరి ! ప్రియశిష్యుఁడౌటతఁడు దానికొడంబడినాఁడ నింత క
ప్పరిణయకార్యసంపదకుఁ జాల్పడియెం దుదిభంగ మెంతయున్.

చ. అనిమిషసీరి యిట్లనుఁ బ్రియంబున నాపలుకాలకించి ప
ద్మనయన ! కీర్తిధన్యుఁడభిమన్యుఁడు నీవును ద్వారకాపురం
బున కరుదేరఁగావలయుఁ బోదము లెండనునంత కంసమ
ర్దనుఁడను నీమదింగనలు దక్కియొడంబడుమమ్మ దీనికిన్.

ఉ. నావిని యింతి యిట్లను జనార్దన సంపద పోయి పుట్టినిల్
రావలదేను వచ్చుటయు లాఘవమౌపయిసీరి బంధుమి
త్రావళివించునుండఁ గననాదరభాషలఁ జుల్కసేయనే
నీవనికిన్ ఘటోత్కచుని యింటికి వచ్చితి మేను గావఁగన్.

ఉ. ద్రౌపది యేవురన్ ప్రబల దోర్బలశాలు లనాత్మభర్తలం
గేవల భక్తిమైఁ గొలిచి ఖేదముపైఁచి వనోపహారది

తెఱవిధిఁ గాలముం గడపఁ గాఁ జనియెన్నటులుండ రావె నా
కావెరనొప్ప దేకడుఁ బ్రియంబది నీదయగల్గు నంతకున్.

ఉ. నీకొఱపరుండ కాని రమణీకులభూషణ మాత్మపుత్రికిన్
లోకములందు వరుండు ప్రబలుండిఁక లేఁడెయటన్న యన్నయ
స్తోకమనీషమామకనుతున్ వరుఁగా నతఁడెట్లుసేయునే
లాకమలాక్షి యీకపటలాలన భాషలు నాకుఁ బ్రీతియే.

చ. మునుపితృసోదరాది జనముల్ గనఁగాఁ గడునంచితాత్మునై
వనికరుదెంచి యే మగుడివచ్చిన యచ్చటిబంధులెల్ల మ
న్ననఁ గనుఁగొందురే ననుజనార్దన యెచ్చటనుండి యేమి శో
భనగుణశాలియైన బలభద్రుని యింతటికూర్మి చాలదే.

చ. అనుడు ముకుందుఁ డిట్లనియె నయ్యలివేణికి నీప్రలంబమ
ర్దనుఁడనఘాత్ముఁ డగ్రజుఁడు దైవసమానుఁడు తండ్రియట్లకా
మనలకుఁ గావునంగనలు మాని ప్రశాంతివహింపు మానసం
బునని(ఁ)క నీకు నెల్లశుభముల్ సమకూడుఁ దదీయ సత్కృపన్.

మ. అనిపల్కెన్ మురవైరికామిని యనుక్తాలాపయై యానతా
ననపంకేరుహయై కుచోపరితలన్యస్తాంశు కామృష్టలో
చనబాష్పోదకయై సమీరవిచలచ్చంచల్లతాభ్రాంతికృ
త్తనుయష్టి ప్రథమానయై యొనగఁగాఁ దాలాంకుఁ డత్యాదృతిన్.

ఉ. గద్దియడిగ్గి కేల చిబుకంబు గ్రహించి మదీయవాక్యసం
పద్దళనంబొనర్పకుము మానవతీమణి నీకు శౌరికిం
బెద్దనుకేన మార్గముగఁ బెట్టక యీయుపగూఢనొప్పి నీ
ముద్దులపట్టి నట్లగరమున్ ననుఁ జూడు కృపాంకరీ చిత్తవై.

గీ. అనుచు సంప్రార్థనోక్తుల నసితవసనుఁ, డళిచికురఁ దేర్చఁ గాఁ దదీయాననంబు
పొలిచె దరహాసలక్ష్మీసంపూర్ణపూర్తి, మావిరాజిత రాజబింబంబువోలె.

ఉ. కేశవుఁ డంత హేమమణికీర్ణ శతాంగ తలంబునన్ సుభ
ద్రాశశిరేఖలన్ నిలిపి దానవమాళి ఘటోత్కచుండు పం
చాశుగరూపశాలి విజయాత్మజుఁ డన్నయుఁ దాను మేరు సం
కాశరథంబునందు నెసకం బెసఁగన్ వసియించి వేసుకన్.

మ. ప్రకటభ్రూహరిచాపభూషణ లలితాపాంగ ప్రభాజిల్లస
ద్వ్యకరాత్మాంగ విలాసలక్ష్మియుప కంఠాహార్య శృంగాగ్రబ
ద్ధికలాపంబుల కంబుద భ్రమదగా నేతెంచె నేవేగ యూ
రికి సమ్మోద మెలర్ప శూరకులవర్ధిష్ణుండు కృష్ణుండొగన్.

మ. బలకృష్ణుల్ చని యాత్మసోదరిని సౌభద్రిందటద్దిష్టిని
ర్మలదేహన్ శశిరేఖఁగాంచనమణి ప్రాంచద్విధాసీనతన్
వెలయంజేసి మరుజ్జవాప్తి నిదిగో విచ్చేయుచున్నారలు
జ్జ్వలులై యంచు వచించు చేటి జనవాగ్వైచిత్రికిన్ మెచ్చుచున్.

శా. భాస్వత్కౌతుకలీలవృష్టి విభుఁడాప్తశ్రేణితో భూరితూ
ర్యస్వానంబులతో నెదుర్కొని శుభైకాయత్త విద్వద్వచ
శ్శ్రీస్వారాజ్య విభూతి మందిరముఁజేర్చె న్వారలన్ శూరవం
శస్వామిత్వర మాధురంధరుల నాశల్ ముట్టవందిస్తుతుల్.

వ. అనంతరంబ.

శా. అభ్రోత్తుంగ సువర్ణసౌధమున నధ్యాసీనులై శుభ్రకీ
ర్తిభ్రాజిష్ణులు రామకృష్ణులు వయశ్శ్రీరూపలావణ్యవ
త్సుభ్రూలోకమణిం గుమారి శుభవస్తుశ్రేణిఁ గైసేయ భ్రాం
తభ్రామ్యత్పరిచారి కాంగనలకుద్యత్ప్రీతిమైఁ దెల్పఁగన్.

చ. వెలఁదులురమ్మటంచు నళివేణికకేల్ దమకేలఁ బూనిచెం
తల నొక సారహీరమణిధామ సముజ్జ్వల పీఠిఁ జేర్చి మాం
గలిక సుగీతికా యుతముగా నుదుటం బ్రిశుభ్రారుణాక్షతం
బులిడి ముదంబున న్మెఱుఁగు ముత్తెపుటారతులెత్తి రత్తఱిన్.

క. సుమనస్స్నేహము గైకొని, సుమనస్స్నేహమున నొకట సుదతితెలం బెన్
భ్రమరీతులకచకుచ సం, భ్రమకీతులఁ జాణి కటకరవము సెలంగన్.

గీ. సారఘనసారకాశ్మీర సంకుమదప, టీరరసమున నలుఁగుఁ బెట్టిరి నెలంత
లకుటిలకుంతలకు మనోహర్షమునను, హేమమయవల్లికని మొఱంగడినకరణి.

ఉ. చామయొకర్తు నూత్ననఖజాలమున న్లతకూనవెంట్రుకల్
ప్రామినయూ నెఱిగ్గు పయిపైసడలించి కరాబ్జమెత్తి గం
ధామలకంబుఁ బెట్టె నొకయంగన కేళివల శాతకుంభకుం
భాపుల సౌరభోధకములార్చె మదద్విపరాజయానకున్.

చ. ఒకయరవిందగంధి తడియొత్తె నెఱుల్ లతకూనయోర్తు కం
చుకమలరించెఁ గజ్జలము సోఁగకనుంగవఁ దీర్చె నోర్తు బా
లికయలదెం బటీరమొక లేమ కటీతటిఁ బూసెఁ గాంచనాం
శుకమొక బోటి పూసరులు చుట్టెఁ గచాళి నొకర్తు చెల్వకున్.

శా. ఆలోలేక్షణ పాల్పెసంగె మణిదీప్తామూల్య కళ్యాణభూ
షాలంకార సమేతయై కటితటిన్యాలంబి సౌవర్ణరు
క్చేలప్రాంచితయై దృగత్స్వతర శ్రీకృత్తనూరూపరే
ఖాలావణ్యసమగ్రయై భవన సాక్షాల్లక్ష్మి యోనాఁగడున్.

సీ. కమనీయతపనీయకలశాన్వితము భవ్యగారుత్మత ద్వారతోరణంబు
ఘనగంధతైలభాజనదీపికావృతమురుతరాగరుధూప సురచిరంబు
యంత్రపాంచాలికావ్యజనానిలమనోజ్ఞమతిచిత్రపటవితానైకనభము
ఘనసారకదళికా కలితహీరస్తంభ మలఘుగంధ రజస్సమాహితంబు
శుక్తిభవరంగవల్లికాసురుచిరంబు, మహితపరిఫుల్లమల్లికామాలికాని
కాయలామజ్జికోన్నతకాయమాన, మునునగుచునొప్పె నప్పరిజనము పొగడ.

మ. ఘనపన్నీకృతాభిషిక్తయును దృక్కౌతూహలాపాదినూ
తనచిత్రాంబరయున్సకుంకుమ హరిద్రాసాంక వామోదయుం
గనదమ్లానసుమస్రగన్వితయునై కన్పట్టె నానవ్యశో
భనగేహేందిర యప్పురందర పురీభాగ్యోన్నతిం గేరుచున్.

మ. తగవెన్నుండఖిలాప్తబంధుతతితో ధాత్రీసురప్రేయసీ
జగతీస్తవ్యశుభాంక గీతికలతో శంఖాదితూర్యప్రభే
దగభీరధ్వనితో యశోధను సుభద్రామానినీ నూనుగం
ధగజారూఢునిఁ జేసెఁ బెండ్లికొమరుం గావించి హర్షంబునన్,

వ. అంత.

చ. కరమనురాగయుక్తి మునుగాదనుఁ గూడిన పద్మినీపరం
పరలవియోగఖిన్నతకుఁ జాలానరించి యనంతరంబునం
జరమదిగంగనావరణసంజనిత ప్రకటానురాగ భా
స్వరహృదయుండుబోలె దివసప్రభుఁడేఁగెద దంతికోరికిన్.

గీ. సమయహరిమాళి బర్హిపింఛప్రదీప్తు, లన దిగంతరముల నిరులావరించె
గగలక్ష్మి కుచాగ్ర ముక్తాకదంబ, కములనఁగ నింగినుడు సముత్కరము లెసఁగె.

గీ. అంతట సువర్ణసూత్ర రత్నాంకసీమ, మనుమధను నాజ్ఞ నభిమన్యుఁడధివసించె
నప్పుడు బోలుపొందెఁ గనుపండువగుచు జాత, రూపగిరిశృంగసంగతధ్రువుఁడుబోలె

మ. అనఘామూల్య సువర్ణకుంభకుచయై ప్రాంచన్నిజాగ్రిజ్జలో
చనయై మౌక్తికరంగవల్లి సముదంచద్దామయై సౌరభో
ద్ఘనకాలాగరుధూప ధూమకచబంధస్ఫీతయై యవ్విభా
తనవైవాహికవేది తెల్పె గృహపద్మాక్షీల నమ్మేటికిన్.

గీ. మానితాతనుగుచిరమా మహితమూర్తి, మామహితమూఁది పెండ్లికొమరునకు నభి
రామతనురూపజితపుష్పతోమరునకు, భవ్యదధియుక్త మధుమధుపర్కమొసఁగె.

మ. ననవిలాసుఁడు మదిన్వసించి బోమవింటన్ జక్కఁగా నెక్కొన
ర్చు నిశాతాంబకపాళి నాచపలదృష్టుల్ పర్వఁగూలంకష
స్తనభారమ్మునఁ గౌనుఁదివఁదలన్ దన్వీలలామంబు వ
చ్చె నిజాంఘ్రిస్థగితాబ్జరాగమణి మంజీరారవంబొప్పఁగన్.

చ. అనుపమశక్రనీలనిచయద్యుతి సద్గృహరాజినుండి జీ
వనధరవర్గము న్వెడలి వచ్చినశంపయనోలె వచ్చె ని
ట్లనఘసతీకరోన్నమితయై శశిరేఖ తదుత్సవావలో
కనజనలోచనోత్పల వికాసరమాప్రద యయ్యెనయ్యెడన్.

ఉ. కీరసువాణి నెన్నడుము కేసరి కేసరియౌను విస్ఫుర
న్నీరజపత్రముల్వెలఁది నేత్రములంగన మైమెఱుంగు క్రొ
క్కారుమెఱుంగు పైదలి నిగారఁపుఁజూపులు నూరుచుంపునౌ
శౌర! యటంచుఁ బెండ్లికొమరాలి నుతించిరి తత్సభాసదుల్.

చ. అకలుషమానసార్య రచితానుమతిం బరమానురక్తి మ
చ్చకితమృగేక్షణా తిలకజాలకముల్ తెరయెత్తి యమ్మహో
పకుల శిరోవిభూషణము పైదలి డాయఁగఁ దెచ్చె నంతనా
యకమణిమాననీయ నవహారలతన్ గడియించుచొప్పునన్.

చ. ఇనకరయుక్తి బంకజదళేక్షణపాణి సరోజముప్పఁ జ
కరిభపయోధర ద్వితయరమ్య కరాంబురుహానుషక్తి గ
య్యనకరి మించెసంగ ఘటియించె గురుండు సమంత్రకంబుగా
మనమతి కౌతుకంబెనయ మాంగళికాంక ముదుత్కరత్వయిన్.

తృతీయాశ్వాసము.

క. అలఘుతరభేరికా కా, హళము రజపటహశ్రుతి జయజయధ్వను లెసఁగన్
నలుగడ మెలఁగు బుధజనా, వలు సుముహూర్తంబటంచుఁ బోరిఁ బోరిం దెల్పన్.

మ. వనజశ్రీముఖపాణిపాదములతో వర్ధిష్ణు సంపద్విలా
సినియై పొల్పగు నాత్మకన్య సుమనస్సన్మానుకూల ప్రవ
ర్తనుగా భూతనయ ప్రవర్ధనునిగాఁ దానాత్మనూహించి సాం
ద్రునన మ్మేటికి ధారవోసె సుగుణాంభోరాశి రాముండొగిన్.

చ. సదమలచిత్తభూ విజయశంఖమునన్నిరు దూల్చినట్టుల
మ్మదవతికంఠ దేశమున మంగసూత్రము గట్టెవేడ్కన
త్రిదశవరేణ్యస్తోతుఁ డురరీకృత పుణ్యపురంధ్రికావళీ
మృదులవివాహమంగళ పరిస్ఫుటగా నరమాతిలోలుఁడై.

మ. చకితైణేక్షణ సనియాదలను సేసల్ జల్లుచో భూమిభృ
న్మకుటోద్యన్మణి బింబసంభమునఁ గన్యారత్నమాత్మేశు మ
స్తకమెకేఁ గనుఁగొంటిరే యన జగత్సంస్తుత్య మయ్యాశు మ
స్తకమెకన్ శశిరేఖ యొప్పునని కాంతల్బలికెన్ రత్యాధృతిన్.

ఉ. లెక్కకు నంబోయ యంజలిపుటిన్ జిగిముత్తెఁపు సేసజల్ల స
మ్యక్కరువంశవర్ధనుని యాదలి నాతఁడు నట్లనింపఁగ నా
చోకఁపు ముత్తెముల్ దెలిపె సుందరిపాణి కచప్రదీప్తులన్
నెక్కొనిపద్మరాగ హరినీల మణిద్యుతి వైభవోన్నతిన్.

ఉ. ఇంతియు నవ్విభుండు వెలయింపఁగ లాజచయంబుతో బుధా
క్రాంతవివాహవేది యభిరమ్యమనూక్తవిధిప్రయుక్తి శ్రీ
త్యంతవచోభినందితుఁడు హవ్యవహుండు బ్రిహృష్టచిత్తుఁడై
యంతట నవ్వధూవరుల కారతులెత్తె శిఖాపరంపరన్.

ఉ. వెండియునాహుతిక్రియల వేమరుఁ దృప్తి ఘటింపనమ్మహో
త్తుండు శిఖాపరంపర సముజ్వలుఁడౌ తటి ధూమజాలమొం
డొండ రథాంగవర్తుల పయోధరపైఁ బ్రసరించెఁ దత్తనూ
దండముషంబునం బొదలు దాడిమవల్లికి దోహదంబనన్.

మ. అనఘోత్తుంగమహీధరోద్ధర పితృవ్యాంకస్థలీవాసవా
సనకోశాంధుర రత్నహారపటలీ సంసక్తినో గ్రీవయో

జనమోఘ్నేన్ గోమరాలటంచు బుధులెంచం బార్థసుపుత్రుఁడో
య్యానఁ జేఁబూనినిజప్రియాంఘ్రి సనెకల్ హత్తించె హార్దంబునన్.

చ. తమతలపుల్ ఫలింప నలదంపతులంత వసిష్ఠనామనిలో
కమణి కులాంగనన్ గనక కన్నియ కేల్ గవమోడ్చి మ్రొక్కెను
త్తమగుణధన్య పుణ్యవనితామణి నన్ గరుణింపుమంచు లో
కము నఁబొగడ్త గాంచి చిరకాలము నైదువనై సుఖింపఁగన్.

సీ. కరముభక్తిమహావాదిక క్రియాపరిదత్తచరుసార భుక్తినిర్జరగణంబు
నభినవవస్త్రచ్ఛందనాది యథాహసత్కృతి కల్మినానామునీశ్వరాళి
నిరుపమమణిగణాభరణాంబర ప్రభృత్యుపచార కలననార్యోత్కరంబు
నభినందనీయమనోభీష్ట మృష్టాన్నసంతృప్తి బంధుప్రజాచయంబు
దనిపి సమ్మోదవశతఁ దత్తత్ప్రశస్త, దీపితాశీర్వచస్స్వర దీయమాన
సురమహీజసూన సమ్మిళచ్ఛోభనాక్షు, తములు దాల్చిరి మౌళిఁ దత్పతియు సతియు.

చ. అరుదుగ హేమరత్న రుచిరాంగద హారకిరీట మండలా
ద్యురుతరవస్తుజాలము గుణోదధికిన్ నలరాజరాజభూ
స్మరసమరూపశాలి కభిమన్యున కప్పుడు భౌమదానవ
ద్విరదమృగేంద్రుఁడంత చదివించె సముంచిత కౌతుకంబునన్.

మ. జలజామిత్రుఁడు చంద్రికానవసుధా సారంబునం దిక్తటం
బుల నాలేపమొనర్చి స్వాన్వయసముద్భూతాంచ దుర్వాహమం
గళకార్యంబునకై జనప్రజము వక్కాణింప నస్త్రాద్రిడా
[illegible]లసత్తేజముతో విభాకరుఁడు దోచెంబూర్వ గోత్రంబునన్.

చతురహముల్ వివాహమఘసంభ్రమ మీక్రియఁ జెల్లినన్ శత
క్రతుతనయాత్మజన్మునకుఁ గామినికబ్బులుఁ డబ్బురంబుగా
వితతనవీన రత్నరుచివిస్ఫురితాభరణాంశుకచ్ఛటల్
గుతుకముతో నొసంగె మదిలోఁ గలకోరిక తీరి కెత్తఁగన్.

సీ. ఘనరత్నపుత్రికా కరగంధతైలభాజన దీపికాప్రకాశంబు గాంచి
పుంజీకృతసువర్ణపంజరాంతరకీర జల్పితస్మరశాస్త్ర చర్చ జదివి

చీనాంబరవితాన చిహ్నితప్రతిమా విశేషైకబంధ వైచిత్రిమెఱసి
జగతీప్రశస్తనిస్తంద్ర సామ్రాణికాగరు ధూపపరిమళస్ఫురణ నెనసి
వరలుకాంచన కేళినివాసమున ల, తాంతసంతాన విరచిత హంసతూలి
కామ్యములశయ్య నాతనూకామనీయ, కాభిరాముఁడు జెందె చిత్తాబ్జమలర.

సీ. కర్ణతాటంక సంకీర్ణవజ్రప్రభల్ మృదుహాసచంద్రికా శ్రీలనెనయ
కుచకుంభ హారినీల రుచిరహారద్యుతుల్ నెఱిగొప్పకప్పువన్నియలఁ బెనఁగఁ
గరకంకణనిషక్త కురువింద రుచిబృంద మధరారుణచ్ఛాయ నాశ్రయింప
దురుము గూరిననవ్య దూర్వాంకురాంశువుల్ గాంచిగారుడరత్న కాంతిగదియ
లలితనృపసూతి సామ్రాజ్యలక్ష్మివోలెఁ, జెలువఁదోతేగవచ్చె నచ్చెలువపతికి
మున్నతనరాక నిజపదాంభోజఘటిత, రత్నకటకఝుణంఝుణారవము దెలుప.

చ. వెలదులు ద్రోడితేర నరవిందముఖీమణి వచ్చి లజ్జలో
నిరువుకొనంగ నంగజసమిద్ధశిలీముఖ పీడితాత్మయై
నిలయముఁజొచ్చి యందు హరినీలపురాణమొగరంబు మాటునం
బొలిచెఁ బయోధరాంత రసముద్యదిరమ్మద మాలికాకృతిని

క. లలనామణులాకరాకర. య్యేలనాఁగఁ దొలంగి వెనక్కేగిరి కార్శ్య
కలనాగంభంబునవా, త్మ్రలనాటిన కౌతుకంబు దైవారంగన్.

శా. కేళీమందిరభిత్తికా విరచితాక్షీణాబ్జరాగస్థలీ
లాలావణ్యవిభూతిగాంచి యలబాలారత్న మాత్మాళికా
పాళీశంకఁద్రిపానతాస్యయయి కప్పెట్టె న్మనఃపంకజా
తాలీఢాంగజశాతసాయక నికాయ శ్రీరణన్ సైపుచున్.

మ. పరిదూతార్థిజనాక నాకతటినీప్రాలేయశైలేంద్ర భా
స్వరసుశ్లోకవిపాకపాక దమనాంచద్వైభవామోద ని
ర్భరమిత్రౌఘ విలోకలోక భయకృత్ప్రత్యర్థి భూపాలకో
త్కరవేశ్యా సదభీకభీకవిత మర్త్యత్రాణదీక్షాచణా.

చతుర్విధ. శ్రీరమ్యాకీర్తి భండన, శూరావరమదవిదార సుస్థిరకరుణా
శ్రీరామనామకథనా, ధారాసిరవద్యసుగుణజాలాభరణా.

స్రగ్విణి. సురాహారకీర్తి వచోవ్యక్తి దూతా
హిరాజారణక్షాత్రసుహృజ్జాల శిక్షా
కరాశీ రమాపుత్రిక శ్రీస్వరూపా
స్థిరాభూరికారుణ్య దృక్పోషితోర్వీ.

గద్య—ఇతి శ్రీశైలభ్రమరీమల్లిఖార్జున కరుణాకటాక్ష దీక్షాలబ్ధ సరస
సాహితీధౌరేయ యాత్రియగోత్ర పవిత్ర మంగళగిరి నరస
యామాత్యపౌత్ర తిమ్మయామాత్యపుత్ర సుజనవిధేయ
ఆనందనామధేయ ప్రణీతంబైన విజయనందన
విలాసంబను మహాప్రబంధంబు నందు
తృతీయాశ్వాసము.
సంపూర్ణము.

